# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



నవంబరు 1965



సంపుటము 42 : : సంచిక 11

విడిప్రతిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1965

# భవిష్యత్ హేమంతం

శ్రీ సి. నారాయణరెడ్డి

బల్లపరుపుగా పడుకున్న భావనా జగత్తు
గిరిశృంగంలా శిరసెత్తింది.
గొంగళీ పురుగులా ముడుచుకున్న ఆలోచన
నింగిలా రెక్కలెత్తింది.
సిరాపథంలో విద్యుల్లహరి
చిక్కని నెత్తురులా పరుగులెత్తింది.
భద్రంగా నిద్రపోతున్న చైతన్యం
రుద్ర విపంచిలా స్వరాలొత్తింది.

ఎందులకీ కల్లోలం
ఎడదలోన నురుగెత్తెను.
పిడికెడంత మెదడెందుక
జలధివోలె తరగెత్తెను.
మన్నుదిన్న పామువంటి
మనసెందుకు పడగెత్తెను.
చిట్టెము గట్టిన ఆశయ
శిఖరమేల చిగురొత్తెను.
ఏందుకు ఎందుకు నాలో
దండడించె నీ సందడి.
మువ్వలు పలికే హృదయ
మ్మున ఝుంఝుల పెను సవ్వడి.

మేడలాంటి శరీరంలో
గూడులాంటి మస్తిష్కం
ఎన్నాళ్లు ఎడంగా వ్రేలాడుతుంది
ఎన్నాళ్లు జడంగా ఊగాడుతుంది.
ఒడ్డుమీద రెడ్డిగంవేసి కూర్చొని
ఊరికే సముద్రాన్ని చూసే మనస్తత్వం
ఎంతకాలం కొనసాగుతుంది.
ఎప్పుడో ఒకప్పుడు మారితీరుతుంది.

అందంగా ఒదిగి పడుకున్న పరమాణువులు
అమాంతంగా ఒళ్లు విదిలిస్తే
అదే ప్రళయం; అణు ప్రళయం.
అలవోకగా చెలియలికట్టను చుంబించే
జలరాశి తరంగాలు
మూక ఉమ్మడిగా ఎగిరి
దూకడం ప్రారంభిస్తే
అదే ప్రళయం; జలప్రళయం.
పరమ సాధువుల్లా జీవిస్తున్న
పర్వతగర్భాలు కళపెళకాగి
రొమ్ము చీల్చుకొని అగ్నిద్రవం
లోకం మీద విరుచుక పడితే
అదే ప్రళయం; జగత్ ప్రళయం.
పచ్చి మంచుగడ్డలా తేలుతూ
పైకి అంచుల్ని ప్రదర్శించే నీ
మస్తిష్కం అట్టడుగున ఏముందో తెలుసా?
అవ్యక్తం అగాధంలా వుంది.
అందులో బడబాగ్ని దాగుంది.
కాలం విసిరిన గరుత్తులతో
కల్లోలం రేపిన మరుత్తులతో
బడబాగ్ని బయట పడింది.
జడ జగత్తు కుబుసం విడింది.

ఔనా నాలోన డమరు
కార్భటి వినిపించినదా?
నిజమా ఈనాడు నిటల
నేత్రం వికసించినదా?
మత్తు నిదురలో ఉన్న
రిత్తు ఎలా లేచినదో?
ఒత్తిగిలిన నాలో విల
యోర్మి ఎలా వీచినదో?
నాలో యీ విక్రాంత
జ్వాల లెవ్వరంటించిరి?
నాలో చైతన్య కాంతి
మాల లెవ్వ రందించిరి?

# భవిష్యత్ హేమంతం

ఇంకెవ్వరు? కాలమే నీ
సంకెళ్లను ఛేదించింది.
నీ చల్లారిన గుండెలో
నిప్పు పూలు పూయించింది.
ఇప్పుడు నీ నాల్కకు త్రుప్పన్నదిలేదు.
ఇప్పుడు నీ వాక్కుకు ఇనుప పంజరంలేదు.
ఈనాడు నీ అంతరంగం
ఎల్లలులేని విహంగం.
ఈనాడు నీ మనశ్శాల
ఇరులులేని చంద్రశాల.
గగనమంత పెరగడం నేర్చుకున్నావు.
కడలిలా కదలడం నేర్చుకున్నావు.
కాలం యెలా పయనిస్తుందో గమనించు.
ప్రగతి యెలా ప్రవహిస్తుందో పరీక్షించు.
ఆరు ఋతువుల జిలుగు వెలుగునీడల్లో
అనుభవ సస్యాలు పండించు.
గతంలోకి కళ్లు విసిరి చూడు
ఋతువుల గతుల్ని రుచి చూడు.
మనస్సును వెండితెరగా మార్చుకో.
మరపురాని ఛాయా చిత్రాల్ని కూర్చుకో.

నిజం సుమా నీ వన్నది
రుజువైనది నే విన్నది.
కాలం గీసిన బొమ్మలు
నాలో కనపడుతున్నవి.
గతకాలం గ్రీష్మంవలె
కన్నుల నిప్పులు చెరిగిన
వికృత స్మృతులేవేవో
సకిలింతలు చేస్తున్నవి.
మంచి మనసు మాదిరి విక
సించిన చిరుమల్లెపూల
రేకులపై కత్తులు నూ
రిన ఎర్రని టీరెండలు;
వెన్నెలలో పవ్వళించి
యున్న ప్రాణి కోటులపై

వడగాడ్పుల వోలె వచ్చి
పడిన దుండగుల దండులు;
నిరాశ్రయుల బరువెక్కిన
నిశ్వాసమ్ముల పోలిక
నెర్రెలు వారిన భూస్థలి
నిగిడించిన సెగ ఊర్పులు;
అన్నెము పున్నె మెరుంగని
ఆకుటిండ్ల చూరులపై
త్రాచుపాము పడగలవలె
లేచియాడు పొగమంటలు;
ఒకటేమిటి? ఎన్నెన్నో
వికట దృశ్యములు తోచెను.
భూతకాల మొక బిగిసిన
ప్రేతంలా అగుపించెను.

భూతకాలం ప్రేతంలా బిర్ర బిగిస్తే
నర్తిస్తున్న వర్తమానాన్ని చూడు.
జలధర కుంతలాలు విరబోసి
చంచలా దృగంచలాలు దూసి
ఆకుపచ్చని దరహాసాలతో
లోకాన్ని మలాము చేసి
వర్షంలా ఆనందాన్ని కురిసిన
వర్తమానాన్ని చూడు.

వర్తమాన మనగానే
నర్తించెను నా మనస్సు.
వర్షము పే రెత్తగనే
హర్షించెను నా తపస్సు.
కానీ; సెల్తురుల వెన్క
కదలే క్రీనీడలవలె
వాన కారులో విషాద
గాన మేదో వినిపించెను.
శిశువుల వలె చిరునవ్వులు
ప్రసరించెడు పైరులపై
పొంచి పొంచి పిడుగులు కురి
పించిన విషధర పంక్తులు;
పంట కెదుగు బంగరు స్వ

# భవిష్యత్ హేమంతం

పొన్నలవంటి చేలపైన
కనుమోరంగి లంఘించిన
పెను వరదల త్రుళ్లింతలు;
ఒకలక్ష్యముతో పయన
మ్మొనరించెడు పథికులపై
కుత్సితముగ విసిరి విసిరి
కొట్టిన వడగండ్ల జడులు;
తలచుకున్న నా హృదయం
మెలికలువడి పోసాగెనను.
వర్తమాన మొక వికల
స్వప్నంవలె ఊగాడెను.

గ్రీష్మంలాంటి గత కాలాన్ని నీవు
కెంపు చూపులతో చూశావు.
వర్షంలాంటి వర్తమానాన్ని గూడా
హర్షించలేకపోయావు.
నీ మనస్సు పింఛం విప్పేదెలా?
నీలో హరివిల్లు విరిసే దెలా?
మంటలుమిసే నీ అంతరంగంలో
మంచుజల్లు కురిసేదెలా?
ఇంకా కొన్నాళ్లాగితే
హేమంతం వస్తుంది.
అవరోధాలకు ఖేదాలకు
హంసగీతం వినవస్తుంది.
భవిష్యత్తులోని హేమంతాన్ని
బారసాచి కౌగిలించుకో.
ఇన్నాళ్లులేని ఆనందాన్ని
ఇకనైనా పండించుకో.

హేమంత పరీ రంభణ
మెరుగని వాడనా నేను?
చలిరాత్రులు పలికించిన
అలజడి చవిచూచినాను.
మారుమూల కోనలలో
మంచుకొండ లోయలలో
నరాలు నమిలే చలిలో

నడకలు సాగించగలను.
మిన్ను విరిగి మీదపడిన
కన్ను తలుపు వేయకుండ
అర్ధరాత్రమున హిమ శై
లాగ్రమ్మున నిల్వగలను.
ధమనుల పారెడు రక్తం
హిమవర్షాపాతమ్మున
గడ్డ కట్టినను జన ర
క్షా దీక్షను విడువలేను.
నాలో నవ చైతన్యం
జాలు వారి నన్నినాళ్ల
చలికాలంలోనే పు
వ్వులకాలం అవతరించు.
గుండెలోని సంకల్పం
గాండీవమెత్తి ప్రమోయగ
మంచులోన సైతం కిర
ణాంచలాలు తురగలించు.



# సెక్స్ సమస్యలు

శ్రీ ఆటో హమొరి



*[ఈ వ్యాసమును హంగేరియన్ క్వార్టర్లీ అనే ఇంగ్లీషు త్రైమాసపత్రిక సౌజన్యముతో ప్రకటించాము. ఇతర సంఘాలలో వున్నట్లుగానే కమ్యూనిస్టు సంఘములోగూడా సెక్సు అనేది పెద్దసమస్యగా వున్నట్లు ఇందువల్ల వ్యక్తం అవుతున్నది. ఈ సమస్యలను పరిశీలన చేసే వ్యాసములను ఆహ్వానించుచున్నాము. ఇచ్చట 'సెక్సు' అను ఇంగ్లీషు మాటకు సరియైన మాట దొరకక దానిని ఆ విధముగానే వాడినాము.]*



నేడు బుడాపెస్ట్‌లో చర్చలు జరుగుతున్నాయి. చర్చకురాని విషయమేలేదు. ఆధునిక కళనుగూర్చి ఆవేశంతో, ఆర్థిక సమస్యలను గూర్చి బాధ్యతతో, సైన్సును గూర్చి కౌతూహలంతో చర్చలు సాగుతున్నాయి. అన్నింటికంటె రసవత్తరమయినదీ ఆసక్తి కలిగించేదీ ఆధునిక ధర్మాన్ని గూర్చిన చర్చ. ఇందులో ప్రకటితమౌతున్న మహోత్సాహాన్ని చూస్తే, ఒక్కోసారి నవ్వు పుట్టుతోంది కూడా! నవ్వేవాళ్లు బయటి వాళ్లేకాదు. చర్చలో పాల్గొనేవాళ్లూ నవ్వుకుంటారు. ఏమంటే ఈ చర్చలో ప్రతి వస్తువుకూ ఒక క్రొత్త పేరు పెట్టుతున్నారు. ప్రేమకు కూడా క్రొత్త పేరే. ప్రేమను గూర్చి చర్చిస్తూ, ప్రేమంటే నిండైన అందమైన జీవితంకోసం ఇద్దరిమధ్య ఏర్పడే సంబంధం (Alliance) అంటూ ఒకరు నిర్వచించారు. నిర్వచనం బాగానే వుంది. కాని నిర్వచనంలోని ఆ 'యిద్దరు' ఎవరో, ఆడా? మగా? తేల్చి చెప్పక పోవటం లోపం కాదా! అంటూ అతనికి మేము చెప్ప వలసి వచ్చింది.

అలాంటి పొరపాట్లు జరుగుతాయి. ఏమైనా, ఏ దృక్పథంనుంచి చూచినా, ఈ చర్చ చాల ముఖ్యమైన ప్రశ్నలే స్ఫురిస్తోంది. నేటి పరిస్థితుల్లో జీవితపు ప్రాథమిక సమస్యలు పరిష్కారం కావటంతో, జనం గట్టిగా ఆలోచిస్తున్న సమస్య: మన జీవితాలు మంచి మార్గంలో వెళ్తున్నాయా లేదా అనేది. ఇంకా వివరంగా చెప్పాలంటే, మనం వైయక్తిక జగత్తుని జాగ్రత్తగా తెలివిగా తీర్చి దిద్దుకుంటున్నామా? దాన్ని అందమైన దాన్నిగా రూపొందిస్తున్నామా లేదా? అనే ప్రశ్న నేడు జనాన్ని రాను రాను గట్టిగా పట్టుకుంటున్నది. విచిత్ర మేమిటంటే జీవనోపాధి సమస్య తీరిపోతూ వచ్చినప్పటినుంచీ భార్యాభర్తలమధ్య విడాకులు ఎక్కువైనై. జీవితంలో మరో వ్యక్తిని తోడు నీడగా పొందలేక ఏకాంతంగా కాలం గడపవలసి వచ్చేవారి సంఖ్యా ఎక్కువైంది. ఇలా ఎందుకు జరిగిందనటానికి సహేతుకమైన వివరణ ఒక వైపు ఉండనే ఉన్నది. ఇద్దరు వ్యక్తుల్ని దగ్గరగా బంధించి ఉంచటంలో పూర్వం ఆర్థికమైన హేతువులు చూపే ప్రభావం యిప్పుడు సన్నగిల్లిపోయింది. కూడూ గుడ్డ కోసం విధిగా వివాహం చేసుకోవలసిన అవసరం ఏ అమ్మాయికీ నేడు లేదు. అవతలి వ్యక్తికి ఎంత డబ్బు వున్నది అనే చూపుతో ప్రియుణ్ణిగాని ప్రేయసిని గాని ఎన్నుకొనే పరిస్థితి నేడు ఎవరికీ లేదు. ఇలా ఆర్థికమైన ఒత్తిడి లేకపోగానే, వ్యక్తి హృదయగత భావాలు ప్రాముఖ్యం వహిస్తున్నాయి. నిజానికి ఇది యిద్దరిమధ్య వ్యవహారం మాత్రమే కాదు; సమస్య

కూడా "ప్రేమ" ఒక్కటేకాదు. వైయక్తిక సంతుష్టి అనేది—కనీసం దాని ఫలితాల్నిబట్టి అయినా—తప్పకుండా సామాజిక సమస్యే అని చెప్పాలి. జాతికీ, సంఘానికీ వైయక్తిక సంతుష్టి ఒక సృజనాత్మక శక్తి; అసంతుష్టి జాతికి నష్టం కలిగిస్తుంది.

హంగెరీలో ప్రజాభిప్రాయం ఈ సత్యాన్ని గుర్తించింది. సాగుతున్న చర్చ ఒక ప్రధానమైన సమస్యను గూర్చి అనటంలో సందేహం లేదు. సమస్య ప్రేమను గూర్చే కాదు, మానవుల మధ్య సంబంధ బాంధవ్యాలను గూర్చి, వ్యక్తికీ, సంఘానికీ మధ్య సమన్వయాన్ని గూర్చి—అంటే, మొత్తంమీద ధర్మ వ్యవస్థను గూర్చి. గడచిన కొన్ని మాసాల్లో, ఈ చర్చ పరివ్యాప్తంగా సాగుతూ చివరకు అన్ని రకాల అభిప్రాయాలూ సమీకరింపబడి ప్రకటితమయ్యేందుకు వీలుగా ఒక చర్చావేదిక ఏర్పాటైంది. ఈ చర్చ 'కొత్తపాళీ'' (New writing) అనే సాహిత్య పత్రిక పుటల్లో సాగుతున్నది. దాన్ని నిష్పక్షికంగా యిక్కడ సంగ్రహించే ప్రయత్నం చేస్తాను. ఔను, ఈ విషయాన్ని నా యిష్టా నిష్టాలతో సంబంధంలేని విధానంలో వ్రాసేందుకు నేను గట్టి ప్రయత్నమే చేయాలి. అది నిజంగా కష్టమైన పనే. కారణం యిలాంటి విషయంలో ఎవరిమట్టుకు వాళ్లకు అనుభవాలూ, ఆశయాలూ వాటినుంచీ ఏర్పడే అభిప్రాయాలూ ఉండనే ఉంటాయి. ఒక సైన్సు సమావేశాన్ని గూర్చి విషయ నిష్ఠమైన (Objective) నివేదిక వ్రాయటం సులువు—సైన్సును గూర్చి పెద్దగా పాండిత్యం లేనప్పుడు. కాని ప్రేమ, సత్ప్రవర్తన అనే విషయాల్లో "తెలియదు" అనే మాటైనా ఎవరనగలరు?

మొదట ఈ చర్చలో ప్రధాన వ్యక్తులను, పాఠకులకు పరిచయం చేస్తాను.

"ధర్మమూ— ఛాందసమూ" అనే వ్యాసం వ్రాసిన లాసెలో జెర్కో తన వ్యాసం ద్వారా ఒక దుమారం లేవదీశారు. పారిస్‌లోఉండినట్లయితే ఆయన నెప్పుడో ఈపాటికి "మేధా ప్రపంచంలో ఆకతాయి" క్రింద జమకట్టేవారు. ఈ యువ రచయిత చక్కని కథానికల్నీ, ఒక ఎన్నదగిన నవలికనీ వ్రాశారు, అనువాదాలు కూడా చేశారు. జర్మన్, ఇంగ్లీష్ సాహిత్యాల వ్యాఖ్యానంలో అందెవేసిన చేయి. తాత్త్వికగ్రంథాలని అనువాదం చెయ్యటంలో ఉత్సాహి. విమర్శకుడుగా మొదటిసారి రంగంలో ప్రవేశించారు. సమరోత్సాహమూ, మొగమోటంలేని వాక్కూ సహజ గుణాలు.

చర్చను ప్రారంభిస్తూ జెర్కో తన వ్యాసంలో కేవలం సామాన్య సూత్రాలనే ప్రస్తావించలేదు. నిశితంగా, వ్యంగ్య వైభవంతో వ్యక్తులను కూడా పరామర్శించారు. ముఖ్యంగా 'లాసెల్లో డెజరీ'ని. డెజరీ నైతిక దృక్పథంలో ఛాందసుల పక్షానికి ముఖ్య ప్రతినిధి అని జెర్కో సూచించారు. డెజరీ పూర్వాశ్రమంలో బిషప్. హంగెరియన్ ప్రాటస్టెంటు చర్చికి అధిపతి. ఆరోజుల్లో ప్రచార వ్యాసాలు వ్రాసేవారు. నైతిక జీవనం వస్తువు ఆ వ్యాసాలకు. తర్వాత తన మతాధికారానికి స్వస్తి చెప్పి పత్రికా రచనలో దిగారు. ఇప్పుడు హంగేరియన్ రేడియోలో ఉద్యోగి. ప్రతి ఆదివారం మధ్యాహ్నం ఆయన ప్రసారంచేసే "ప్రస్తుతాంశం" ఈనాడు చాలమందిని ఆకర్షిస్తున్నది. ఈమధ్య కాలంలో ఆయన చాల పుస్తకాలు వ్రాశారు. తల్లిదండ్రులను యువతరం పాఠకులను ఉద్దేశించి వ్రాసిన ఆ పుస్తకాల్లో నైతిక విధులు, "సెక్సు" విషయాల్లో అనుసరణీయమైన ధర్మము వస్తువు.

చర్చలో ప్రవేశించిన మూడో వ్యక్తి 'టైబర్ హుజార్'. యువతరం మార్క్సిస్టు తాత్త్వికుల్లో మంచి ప్రతిభావంతుడు. ముప్ఫైయేళ్లు రాక పూర్వమే పెద్ద డిగ్రీ పుచ్చుకున్నారు. చర్చాంశము మీద ఆయన వ్రాసిన గ్రంథానికే ఆ డిగ్రీ లభించింది. సాంఘికశాస్త్రం ప్రాతిపదికగా సోషలిస్టు వ్యవస్థలో యువతరంవారు ఎదుర్కొంటున్న జీవిత సమస్యల తాలూకు ధార్మిక సందేహాల్ని చర్చించే గ్రంథం అది. కొమ్ములు తిరిగిన మేధావి అయినా, శాస్త్రీయమైన వైదుష్యంలో దిగబడి పోకుండా, జన బాహుళ్యాన్ని ఉద్దేశించి ప్రచారం చేస్తూవుంటారు. రేడియో టెలివిజన్ ప్రసారాల్లో పాల్గొంటూ ఉంటారు.

చర్చలో కల్పించుకున్న మరొకరు, విదుషీమణి 'ఆగ్నెస్ హెల్లర్'. జార్జి లూకాస్ శిష్యురాలు. బాగా చదువుకున్న యువతి. సాహిత్యాన్ని నైతిక దృక్కోణంనుంచి పరిశీలిస్తూ ఉంటుంది. ఇరువయ్యో శతాబ్దిని అవగాహన చేసుకున్న పరిణత మనస్కురాలైన మహిళగా, చర్చాంశాన్ని మార్క్సిస్టు వాదపరంగా స్పృశించే ప్రయత్నం ఈమెది.

# సెక్స్ సమస్యలు

'జోసెఫ్ నీరో' అనే చరిత్రవేత్త మరొకరు. 'మిషెలీ వారో' అనే సెకండరీ స్కూలు ఉపాధ్యాయుడు కూడా యిందులో ఉన్నారు. ఆయనకు చర్చాంశం తాలూకు నిత్య నైమిత్తిక సమస్యలు బాగా తెలుసు. పై పేర్కొన్నవారి చర్చా వ్యాసాలు చర్చలో పాల్గొంటున్న పలువురి అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించేవిగా కూడా ఉన్నాయి.

ఇందులో రెండుపక్షా లున్నట్లు స్పష్టం. ఒక వైపు యువతరానికి చెందిన రచయిత, తత్వవేత్త, సాహిత్యవేత్త, ఉపాధ్యాయుడు. రెండవవైపు అనుభవంగల ప్రచారకుడూ, చరిత్రవేత్తా. స్థూలంగా చూస్తే ఒక వైపు ఉద్రిక్త యౌవనమూ, మరొక వైపు వివేక పూరితమైన నిదానమూ. కాని యిది పైకి కనిపించేది మాత్రమే. నిజానికి యిది రెండు తరాలమధ్య జరుగుతున్న చర్చకాదు. ఇది ఆధ్యాత్మిక పునర్వికాసాన్ని అన్వేషిస్తూ, ఉద్ఘాతమౌతున్న ప్రజానీకపు భావ చైతన్యం కావటంతో రెండు పక్షాలూ సమంజసమూ సాధ్యమూ అయిన సమన్వయంకోసం, హక్కులూ,సాధ్యా సాధ్యాలూ, విధులూ అనే మూడింటి సామరస్యంకోసం చేస్తున్న అన్వేషణే అని చెప్పాలి. వీళ్లు దేన్ని త్రోసి పుచ్చినా లేక స్వీకరించినా లక్ష్యం మాత్రం ఒకటే : ఈ యుగంలో అవసరమౌతూన్న ధర్మ సూత్రాల నేవిధంగా కొత్తగా నిర్వచించుకోవాలి? అందులో నిలుపుకోవాల్సిన సంప్రదాయం ఎంత మేర?

చర్చలోవిషయినిష్ఠమైన భాగం(Subjective) యువజనంలోనుంచి వచ్చింది. వారిలో జీవితమే వ్యక్తిగతమైన అన్వేషణగా బ్రతుకుతున్నవారి దృక్పథంనుంచీ వచ్చింది. వాళ్ల హృదయానురాగాలు యింకా పరిణామ దశలోవుంటూ, వాళ్ల జీవితాలు రూపు రేఖలు దిద్దుకోవటం పూర్తికాలేదు. అందువల్ల వీలైనంత స్వేచ్ఛ ఉండాలి అనే భావాన్ని వాళ్ళు సమర్థించి నిరూపించటానికి ప్రయత్నిస్తున్నారు. పోతే రెండవ పక్షంవారు అందుకు భిన్నంగా, గతంలో రూపొందిన నైతిక దృక్పథంమీదే ఆధారపడుతున్నారు. "సెక్సు" ప్రవర్తన తాలూకు ధర్మ నిర్ణయంలో ప్రధానంగానూ, హృదయానురాగాల విషయంలో సామాన్యంగానూ, వీళ్లు యిదివరకూ అంగీకరింపబడిన పాత ప్రమాణాలపైనే మొగ్గుతున్నారు. వీరి దృక్పథంలో వ్యక్తిగతమూ సొంతమూ అయిన అక్కర అవశ్యకతకంటే మాతా పితృ సహజమైన భయాందోళనలే ఎక్కువగా కన్పిస్తున్నాయి.

చర్చ ఒక ప్రత్యేక విషయ విభాగాన్ని గూర్చి జరుగుతున్నప్పటికీ పై చెప్పిన వివరణవల్ల ఒక మార్క్స్ సూత్రాన్ని ఋజువు చేస్తున్నది—"అభిప్రాయాల స్వరూపం, మనిషి అస్తిత్వం తాలూకు సత్యం ద్వారా నిర్ణయమౌతూ ఉంటుంది."

లాసెల్లో జెరోక్ తన ప్రారంభ వ్యాసంలో పై ప్రతిపాదనకు తత్వశాస్త్రంలో పూర్వరాశిగా (Philosophical Antecedent) గా వున్న స్పినోజా వాక్యాలను ఉల్లేఖించారు: "మనం ఒకదాని కోసం యత్నిస్తున్నాం, కోరుతున్నాం, ఆశిస్తున్నాం అంటే అది మంచిది అని మనం భావించటం కారణం కాదు. మనం ఒక దానిని మంచిది అని భావిస్తున్నాం అంటే దాన్ని మనం కోరుతూ, ఆశిస్తూ, అన్వేషిస్తూ ఉండటమే కారణం."

పై ఉల్లేఖనం ద్వారా జెరోక్ విషయి నిష్ఠమైన (Subjective) చర్చగా రూపొందవలసిన విషయాన్ని తాత్త్విక చర్చస్థాయికి లేవనెత్తారు. తర్వాత ఆయన యీ ఆరోపణ చేశారు—లాసెల్లో డెజరీ వ్రాసిన పుస్తకాల్లో ధర్మసూత్రాలు, ముఖ్యంగా "సెక్సు" ప్రవర్తనకు అన్వయించేవి, ఆధునిక కాలానికి అనుగుణంగానూ భౌతిక వాదానుసరణంగానూ లేవు. గతంలో భావ వాదానికీ, మతానికీ చెందిన నైతిక సూత్రాలనే సోషలిజం దుస్తులువేసి ముంచో బెట్టడానికి డెజరీ ప్రయత్నిస్తున్నారు. అలా చెయ్యటం ప్రగతిని నిరోధించటం; ఈ తరం వారి జీవితాన్ని ఆనందదాయకంగానూ కల్మష రహితంగానూ చేసే సూత్రాలని, యదార్థంలో సత్ఫలితాల్ని ప్రసాదించగలవాటిని విజయం పొందకుండా నిరోధించటం అన్నారు.

లాసెల్లో జెరోక్ మాటల్నే కొంచెం దీర్ఘంగా వున్నా క్రింద ఉల్లేఖిస్తున్నాను. చర్చలో అతి ముఖ్యమూ, కీలకమూ అయిన అంశాలను గూర్చినవి ఈ వాక్యాలు; వీటిలోని భావాన్ని మనం అవగాహన చేసుకోవటం ముఖ్యం.

"భావ వాదానికి చెందిన ధర్మం అనుభవాతీతమే (Transcendental) అయినా దాని ప్రతి

పాదనలు మాత్రం వట్టి నిరాధారమైన కల్పనలు కావు; మంచి వాస్తవికతమీద ఆధార పడినవే. ఏమంటే మానవుని ధ్యేయం సంతుష్టి అయినప్పటికీ చాలమంది విషయంలో అది నెరవేరేది కాదు. అందుకు కారణం ప్రతి సంఘ వ్యవస్థలోనూ మెజారిటీని అదుపులో పెట్టుకొని మైనారిటీ అధికారం చెలాయించే పరిస్థితి ఉండటం. అటువంటి వ్యవస్థకు సంబంధించి అధిగమించరాని అవరోధాలు ఎన్నో సామాన్య మానవుణ్ణి తను కోరే సంతుష్టి సాధించకుండా అడ్డు తగిలేవి. ఈ వైరుధ్యం పైకి రాకుండా భావవాదం తాలూకు ధర్మవన్నాలు, మానవుని ధ్యేయం సంతుష్టి కాదనీ, విధి లేక కర్తవ్యం (Duty) అనీ బోధించాయి.

దీనికి భావవాదంయొక్క మూలతత్త్వంతో చక్కని సమన్వయం ఉన్నది. ఏమంటే అసలు ప్రమాణం 'మానవుడు' బదులు 'ఆదర్శప్రాయమైన మంచితనం' అయినప్పుడు ధ్యేయం కూడా 'సంతుష్టి' బదులు 'ఆదర్శాన్ని అనుగమించటమే' అవుతుంది కదా! దీన్నుంచి పుట్టేదే అసహజమూ, అర్థంలేనిదీ అయిన ప్రతిపాదన—నైతికంగా అత్యంత ఉత్తముడైన వ్యక్తి కూడా మానవుడుగా ఎంతో అసంతుష్టిని అనుభవించవచ్చునట! కారణం ఆ వ్యక్తి తన 'సంతుష్టి' ని 'ఆదర్శం' కోసం త్యాగం చేస్తాడట! డెజరీ యీ అభిప్రాయాన్నే యిప్పుడు ప్రచారం చేస్తున్నారు. అందువల్ల ఈయన చెప్పే ధర్మసూత్రం మౌలికంగా, భావ వాదానికి చెందినదే. 'ధర్మాన్ని అవలంబించటమంటే అందుకు నియమం, సంకల్పబలం కావాలి. ధర్మావలంబనం మానవుణ్ణి ఉదాత్తుణ్ణి చేస్తుంది, అతని శక్తిని పరీక్షిస్తుంది.....ధార్మికుడైన వ్యక్తి ఎప్పుడూ ధర్మపథం తప్పడు. సమాజంలో అతని ధార్మిక జీవనానికి సవ్యమైన మార్గం, అనుకూలమైన పరిస్థితులు లేకపోయినప్పటికీ అతను ధర్మం తప్పడు.' అంటే ధర్మం కోసమే ధర్మాన్ని అవలంబించాలన్నమాట.

ఈ సిద్ధాంతం యుగ యుగాలుగా మానవుడు మోస్తున్న, రూఢిపడ్డ భారం. ఈ ప్రబోధం మూలాన్నే నేటికీ చాలమందికి ధర్మం, నీతి అనగానే కష్టతరమైన బ్రహ్మచర్యం వైరాగ్యం 'అనే అభిప్రాయం కలుగుతుందంటే ఆశ్చర్యపడనక్కరలేదు. ధర్మం అంటే అదేదో తన యిష్టానికి విరుద్ధంగా బలాత్కారమనీ, దానికి ఏ కారణాలవల్లనైతేనేమి, అర్థమైనా కాకపోయినా, లొంగక తప్పదనీ అభిప్రాయం. జీవిత యాథార్థ్యంతో సంబంధంలేని ధర్మసూత్రాలూ, ధర్మంకోసమే ధర్మావలంబనం అనే ప్రబోధమూ, అమానుషమైన ధర్మాన్నీ, కపటంతో నటనతో బూటకంతో కలుషితమైన వ్యవస్థనీ సృష్టిస్తాయి. అది ఏ ధర్మమైనాసరే మానవుని అభిలాషనూ, ఆసక్తినీ, అతని యిష్టాన్ని మొదటి మెట్టుగా తీసుకోకపోతే,ధర్మమంటే వైరాగ్యం అనే అభిప్రాయం కల్గిస్తే తప్పకుండా మనుష్యుల్లో ఆ ధర్మంపట్ల వ్యతిరేక దృష్టి ఏర్పడుతుంది. అది సహజమే.

ధర్మ వ్యవస్థలో విధి నిర్వహణ, కర్తవ్యపాలన అనేది ముఖ్య భాగం అనే సత్యాన్ని త్రోసిపుచ్చటం మా అభిమతం కాదు. మానవ సహజమైన ధ్యేయానికి అంటే అతని 'ఇష్టా'నికి ప్రథమ స్థానం ఉండాలని నొక్కి చెప్పటమే మా ఉద్దేశం. ('ఏ సూత్రమైనా దానికి మానవుని యిష్టంతో సంబంధం లేకపోయినప్పుడు అది కేవలం హాస్యం పాలవుతుంది' అన్నాడు మార్క్స్.) మానవునిలో 'సంతుష్టి' కీ 'విధి నిర్వహణ'కూ మధ్య గల తీవ్ర వైరుధ్యాన్ని, ఏ సోషలిస్టు లేక కమ్యూనిస్టు సమాజమైనా, నిత్యానుభవంలోనూ, మార్క్సిస్టు దృక్పథం ద్వారానూ తొలగించుకోవటం సాధ్యమనటంలో సందేహం లేదు. తాత్త్వికార్థంలో—లెనిన్ ప్రవచించినట్లు—వ్యక్తి అంటే జన సామాన్యం, జన సామాన్యం అంటే వ్యక్తి; సమాజంలోని వారు వ్యక్తులూ, వ్యక్తుల కలయిక ద్వారా ఏర్పడేది సమాజమూ అన్నట్లు. దీన్నుంచి గ్రహించవలసిందేమిటంటే అసలు వైరుధ్యం వ్యక్తికీ సమాజానికీకాదు; వ్యక్తికీ పీడనశక్తిమీద నిర్మితమైన సమాజానికీ. ఆ పీడనశక్తి అంత మొందగానే, వ్యక్తి ఇష్టానికీ, సమాజంయొక్క లక్ష్యాలకూ మధ్య సంఘర్షణ కూడా అంత మొందుతుంది. అంటే 'సంతుష్టి' కి 'విధి నిర్వహణ'కూ మధ్య వైరుధ్యం క్రమంగా తొలగిపోతుంది.

అయినప్పటికీ దీన్ని గురించి ఒక అపోహ ఉండవచ్చు—అటువంటివి యిదివరకు పుట్టాయి కూడా—కమ్యూనిస్టు ధర్మం అంటే ఒక రకం విధి నిర్వహణే అనీ, ఈ ధర్మావలంబనం సుదూరంగా అందుబాటులో లేని భవితవ్యాన్ని, ఎప్పుడో రాబోయే కమ్యూనిస్టు

యుగాన్ని మాత్రమే ఆశగా చూపుతున్నదనీ, ఈ విషయంలో మతం స్వర్గాన్ని గూర్చి ఆశ పెట్టటం లాగే ఇదీ ఉందనీ చెప్పటంకద్దు. కాని (మార్క్స్) ప్రాథమిక సూత్రాలని నిత్య జీవితంలోకి అనువదించినప్పుడు, అలా అనుకోవటం ఎంత పొరపాటో వెంటనే తెలిసి వస్తుంది. కారణం అనుభవంలో సామాజిక లక్ష్యమూ, వ్యక్తి ధ్యేయమూ చాలవరకు ఏకీభవిస్తాయి. ఊహలోనేకాదు యథార్థంలో కూడా.

సమాజంయొక్క ప్రధాన లక్ష్యం విలువగల ఇతోధికమైన కృషి. అలాగే మానవుడికి సంతుష్టిని ఇవ్వగలిగిన వాటిలోనూ ప్రధానమైనది కృషే. అంటే ఏ కృషి అయినా ఒకటే అని చెప్పటం లేదు. అది ఒక ప్రయోజనాత్మకమైన, ప్రత్యేకమైన వృత్తిగా, ఆనందాన్నీ, తృప్తినీ కలిగించేదిగా ఉండాలి. కారణం కృషియొక్క ఉదాత్తతను బట్టి అది ప్రసాదించే స్వేచ్ఛ ఉంటుంది. ఆ స్వేచ్ఛే గీటురాయిగా ప్రకృతికీ సమాజానికీ తప్పని సరియైన కర్మ తంత్రాన్ని గుర్తించటమూ, నిర్వహించటమూ సులువౌతుంది. కృషి అంటే చేసేపని మాత్రమే అని అర్థం చెప్పుకోరాదు. దానికి అనుబంధమైన విలువలు కూడా అందులో చేరుతవి—పనిచేసేచోట అందరూ కలసి మెలసి ఉండే పరస్పరత, పనిలో కౌశలం, నేర్పు చూపటం ద్వారా పొందే గౌరవ ప్రతిష్ఠలూ, తద్ద్వారా ఆశయ పరితృప్తి వంటివి. అందువల్లే కృషిని అత్యంత ప్రధానమైన లక్ష్యంగానూ, సాధనంగానూ పేర్కొంటూ, ఈ యుగపు ధర్మ వ్యవస్థకు దాన్ని మూల ద్రవ్యంగా పరిగణించవలసి వస్తున్నది.

ఇలా చెప్పటంలో కృషి ఒక్కటే లక్ష్యమనీ, కేవలం కృషి ద్వారానే సంతుష్టి లభిస్తుందనీ అర్థం చేసుకోరాదు. అలా స్థూలంగా అపార్థం చేసుకోవటం, ప్రకృతినుంచీ సమాజంనుంచీ మానవునికి లభించే సహజ సంపదని కించపరచటమే అవుతుంది. వ్యక్తి పరిపూర్ణ వికాసానికీ, మానవ పురోగతికీ అది అవరోధం అవుతుంది. మానవుని సంతుష్టికి కృషి ఒక్కటే మార్గం అని నిర్వచించటంలో అంతరార్థం ధర్మ వ్యవస్థ పరిధిని నిర్వచించటం మాత్రమే. అది ధర్మ వ్యవస్థలో అన్ని భాగాలకూ అన్వయించే ఒక సామాన్య సూత్రం. తద్ద్వారానే మనం ధర్మవ్యవస్థని నిర్మించుకోవాలి; మానవుణ్ణి ప్రయోజనాత్మకమైన విలువైన కృషికి అభిముఖుణ్ణి చేసేందుకు ఆ వ్యవస్థ మనకు తోడ్పడాలి. డెజరీ "సెక్సు" నీతిని గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయాల్ని తీసుకుని భావ వాదం తాలూకు నీతి సూత్రాలు ఎలా అసహజమూ హానికరమూ అనేది యిదివరకే నిరూపించాను. ఇప్పుడు మార్క్సిస్టు ధర్మాన్ని చర్యాంశానికి ("సెక్సు" ప్రవృత్తికి) అన్వయిస్తూ కొన్ని ముఖ్య సూచనలు చేస్తాను.

మొట్ట మొదటిది : "సెక్సు" ప్రవృత్తి పాప భూయిష్టం అనే పాతుకుపోయిన అభిప్రాయాన్ని నిష్కర్షగా తొలగించుకోవాలి. ఈ అభిప్రాయం సామాజిక పరిణామ మార్గంలో ఫలితంగా ఏర్పడిన ఒక లక్షణం. అందుకు హేతువులు అందరికీ తెలిసినవే—ఉదాహరణకు ఆస్తి హక్కులూ, తండ్రికి ప్రధాన స్థానం యిచ్చే కుటుంబ వ్యవస్థ; జమీందారీ బూర్జువా ఆర్థిక వ్యవస్థ; వారసత్వాన్ని నిర్ణయించే ఒక న్యాయ వ్యవస్థ. పోతే, ఈ ప్రాతిపదిక కంతటికీ మద్దతుగా రక్షగా ప్రపంచ పరివ్యాప్తమైన ప్రబలమైన క్రైస్తవ మతం, అది బోధించే బ్రహ్మచర్యమూ, ప్రపంచ పరాఙ్ముఖత్వమూ.

ఏ ధర్మ వ్యవస్థకూ శాశ్వతత్వం అంటూ ఏమీలేదు; లేనప్పుడు లైంగిక ప్రవృత్తి యథాతథంగా పాపం కాజాలదు. ఆ ప్రవృత్తి దుర్వినియోగం చెందుతూ హానికరం అవుతున్నప్పుడే పాపం అవుతుంది. కాబట్టి స్త్రీ పురుషుల "సెక్సు" సంబంధానికి ఎక్కడలేని ప్రాధాన్యం యివ్వటంకాని, జీవితం మొత్తాన్నీ నడిపే చోదకశక్తి నిర్ణయాధికారమూ దానికి కట్టబెట్టటం కాని తప్పకుండా నిరసింపదగిన విషయమే—అంటే అధర్మం, అవినీతి—అవుతుంది.

అయితే యింతదాకా చెప్పింది "సెక్సు" ప్రవృత్తిని గురించేకాని ప్రేమను గురించికాదు. రెండింటికీ మధ్య విభేదం గుర్తించాలి. "ప్రేమ అనేది సంకీర్ణమైన ప్రవృత్తి. అందులోని ఒక్క పాయ మాత్రమే-చాల ముఖ్యమైన పాయ-"సెక్సు" ప్రవృత్తి. దాని ప్రభావమూ, శక్తీ అంచనా కట్టటానికి వీల్లేనివి. జీవన ధర్మం రీత్యా, మనోధర్మం రీత్యా, అది సంతుష్టికి అత్యంత ప్రధానమైన అంశం. ప్రేమ కోరే సంతృప్తి ఎప్పుడుకానీ అదుపులోలేని రోగ లక్షణం స్థాయికి దిగజారిపోదు. జీవితానికి ప్రేమ సర్వథా నిండుదనాన్నే యిస్తుంది. జీవితంపట్ల ఆసక్తినీ,

ఉత్సాహాన్నీ వర్ధిల్లజేస్తుంది. ప్రేమ ప్రసాదానికి నోచుకున్నవారి సద్గుణాలు పెంపొందుతవి. ఇంతటి మహత్తర శక్తిని నిరుపయోగంగా త్రోసిరాజనటం కాని, అణచిపెట్టటంకాని, అర్థ రహితమైన మూఢపు కట్టుబాట్లతో క్షీణింప జేయటంకాని నేరమని వేరుగా చెప్పనక్కరలేదు. అలా చెయ్యటం వ్యక్తి సంతుష్టిమీద దెబ్బ తియ్యటమే కాదు, ఆ సంతుష్టి ద్వారా సమాజానికి కలిగే ప్రయోజనాన్ని కూడా నశింప జెయ్యటమే అవుతుంది.''

చర్చను ప్రారంభించిన ఈ వ్యాసం యింకా యిలా నొక్కి చెబుతోంది: లాసెలో డెజెరీ ''సెక్సు'' సంబంధం దంపతుల మధ్య మాత్రమే ధర్మమని చెబుతూండటం రియాక్షనరీ ఛాందసత్వంతప్ప వేరు కాదు. అలా ధర్మాన్ని అనుశాసించటం వాస్తవ పరిస్థితికి మానవ స్వభావానికీ విరుద్ధం. ఏమంటే అప్పుడు రెండే మార్గాలు సాధ్యం. పెళ్లికి అనుకూల పరిస్థితులేర్పడేదాకా (వృత్తి విద్య నేర్చుకోవటం, చదువు ముగించుకోవటం వంటివి) స్త్రీ పురుషులు సహజ ప్రవృత్తికి, మనో భావాలకు విరుద్ధంగా ప్రవర్తించాలి. లేక ముందరే పెళ్లి చేసుకుని కూర్చోవాలి. రెండో విధమైన పరిష్కారం(ముందరే పెళ్లి)ఏమాత్రం సబబు కాదన్న సంగతి దేశంమీద సేకరించిన లెక్కల్నిబట్టి చూస్తే తెలుస్తుంది. అటువంటి పెళ్లిళ్ళ, యవ్వన ప్రథమావస్థలో జరిగినవి, మూడింట ఒకటి విడాకుల్తోనే ముగుస్తున్నాయి. ఇలా అన్న తర్వాత వ్యాసకర్త మొదటి పరిష్కారాన్ని గూర్చి వ్రాస్తూ, అందులో నిర్దేశితమైన బ్రహ్మచర్యపు బూటకాన్ని గూర్చి కొంత ఘాటుగా విమర్శించారు. ఆ సందర్భంలోనే, యీ తరం పెద్ద వారికి సుపరిచితుడైన టిహామర్ టౌత్ అనే జెసూట్ మత గురువునూ, ఆయన 1920—30 మధ్య కామ ప్రవృత్తిని నిషేధిస్తూ ప్రకటించిన పుస్తకాలనూ పేర్కొని, అందువల్ల కలిగిన విపరీత ఫలితాలను సూచించారు.

ఈ ప్రథమ వ్యాసకర్తకు డెజెరీలోనూ, తదితర ఛాందసులలోనూ కనిపించే దోషం వీళ్ళ టిహామర్ టౌత్ మతస్థులయారని కాదు; అస్వాభావికమూ, బూటకమూ అయిన ధర్మ సూత్రాలను చర్చివలెనే, గట్టిగా పట్టుకు కూర్చున్నారని: చర్చి దేవుణ్ణి నిలిపిన స్థానంలో వీళ్ళు సమాజాన్ని నిలుపుతూ, బ్రహ్మచర్యమూ, వైరాగ్యమూ సమాజానికి ప్రయోజనకారిగా ఉంటాయి అనటం.

ఈ సందర్భంలో—అంటే ఛాందసులు సామాజిక ప్రయోజనాన్నీ మతం దేవుణ్ణీ ఒకే మోస్తరుగా వాడుకోవటం జరిగిందని చెప్పటంలో—ప్రస్తుత చర్చ మరికొంత విస్తరించింది. సోషలిజం అభివృద్ధి కోసం, మతం ఉపయోగించే పద్ధతుల్నే ఉపయోగించటం ఎటువంటి ఫలితాల్నిస్తుందో నిరూపించటానికి దృష్టాంతాలుగా స్టాలిన్ కాలంలో జరిగిన ఉదంతాలను పేర్కొన్నారు.

చర్చలో యీ ధోరణిని కొనసాగించినవారు బైబర్ హుజార్. చక్కని తత్వ శాస్త్ర పాండిత్యంతో జెర్కో చెప్పిన విషయాల్లో శాస్త్రీయ పరిశీలనకు నిలవని వాటిని సవరిస్తూ, తన అభిప్రాయం ఏమిటో ఈయన ఈ క్రింది వాక్యాల్లో చెప్పాడు.

''గతంలో ఎన్నో ధర్మ శాస్త్రాలూ, ప్రశ్నోత్తర రూపంలోవుండే నీతి సూత్ర గ్రంథాలూ, మానవ ప్రవర్తనను ప్రతి విషయంలోనూ నియమబద్ధం చేసేందుకు ప్రయత్నించాయి. జీవితంలో వివిధ పరిస్థితుల్లో, పుణ్య పాపాలనూ, ధర్మాధర్మాలనూ నిర్దేశించాయి. ఆ నిషేధాలూ, అనుశాసనాలూ మానవ సంబంధాల్లో కొన్నింటిని మాత్రమే స్థూలంగా గుర్తించగలిగాయి. వ్యక్తియొక్క స్వయం నిర్ణయాధికారానికి ప్రవేశం లేకుండా చేశాయి.

నేడు ధర్మశాసనాల్ని నిర్మించే కాలం దాటి పోయిందనే నా దృఢాభిప్రాయం. కమ్యూనిస్టు ధర్మాన్ని అనుశాసిస్తూ, దాన్ని సరికొత్తదయిన ఆజ్ఞాపన దశకంగా (New ten commandments) అమల్లో పెట్టినవారు తప్పుదారి పట్టారనే నా అభిప్రాయం. ఈనాటి సమాజాల్లో మానవ సంబంధాలు సంకీర్ణంగా అనంత వైవిధ్యంతో రూపొందాయి. 'ఆజ్ఞాపనం' యిరుకు గోడల్ని ఛేదిస్తూ జీవితం బహు ముఖాల విస్తరిల్లింది. నీతులుచెప్పే ప్రశ్నోత్తరావళికాదు నేడు కావలసింది. ప్రవర్తనకూ, పరస్పర సంబంధాలకూ అన్వయించే ప్రధాన సూత్రాల సంఖ్యకు పరిమితంచేస్తూ, వాటిని విస్పష్టం చేయటం అవసరం. వాటినిబట్టి వ్యక్తీ— ఆ వ్యక్తి గుణదోషాల్ని పరిశీలించే సమాజమూ—ఆ యా పరిస్థి

తుల్లో ఆ వ్యక్తి ఆవిధంగా వ్యవహరించటం తప్పొ ఒప్పొ అనే నిర్ణయాన్ని స్వయంగా చేసుకునేందుకు వీలుగా ఆ సూత్రాలు అమరాలి. తద్వారా భవిష్యత్తులో వ్యక్తి స్వయంనిర్ణయశక్తి, బాధ్యతా యితోధికంగా అభివృద్ధి చెందుతవి.

ఈ విషయంలోనూ కమ్యూనిజమే, మానవాళి చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయాన్ని ప్రారంభించ గలదు. 'అవసరాన్ని గుర్తించటం' అనే ప్రాతిపదిక మీద నిర్మితమయ్యే సమాజంలో, మానవ సంబంధాలను గూర్చిన కనీసపు ప్రమాణాలు మాత్రమే నియమబద్ధమూ, సాంప్రదాయికమూ అవుతవి. మానవానుబంధాల్లో పై స్థాయికి వెళ్లే కొద్దీ భావచైతన్యమే ధర్మ నిర్ణయాధికారాన్ని చేపట్టుతుంది—విలువ కట్టడానికి, నిర్ణయించటానికి, ఎన్నిక చేయటానికి, దానికి పరిస్థితుల్ను గూర్చిన పరిజ్ఞానంతో పాటు సంపూర్ణమయిన స్వాతంత్ర్యం ఉంటుంది. తద్వారా వ్యక్తియొక్క ధార్మిక స్వేచ్ఛ తరగదు సరిగదా, అవసరాల్ని గుర్తించటంతో మొట్ట మొదటిసారిగా పరిపూర్ణత్వాన్ని పొందుతుంది. అప్పుడు కమ్యూనిజం సృష్టించేది ధర్మాన్ని యాంత్రికంగా అనుసరించే వారి సమాజం కాదు, ధర్మాన్ని స్వేచ్ఛగా నిర్ణయించుకొనేవారి సమాజం. దీనికీ, విషయినిష్ఠంగా ఆలోచించే భావవాదులు 'ధర్మం వ్యక్తి సాపేక్షమైన' దని చెబుతున్న భావాలకూ ఏమీ సంబంధంలేదని వేరుగా చెప్పనక్కరలేదు. కారణం మౌలికమైన సూత్రాలు ఎలా అంటే అలా ఉండటానికి వీల్లేదు. వ్యక్తిలోని ప్రేరణలూ (Instincts) స్వార్థంనిండిన లోభత్వమూ పోయే తలతిక్కపోకడలకి అవకాశం కలిగించేవిగా కాదు, సూత్రాలు, కమ్యూనిజంయొక్క సామాజిక—ధార్మిక స్థితి గతుల మూల తత్త్వాన్ని చక్కగా వ్యక్తీకరించేటట్లు రూపొందాలి—అంటే కీలకమైన అంశం అవసరాన్ని గుర్తించటం; బాహ్య శక్తుల్ని గూర్చి అవి అసలు లేవని అనుకోవటం కాదు.

వ్యక్తిగతమైన బాధ్యత యినుమడిస్తుందనీ, ధర్మ నిర్ణయాధికారం వ్యక్తికి పూర్తిగా ఉంటుందనీ—ఈ రెండు విషయాల్నీ బాగా నొక్కి చెప్పవలసిన అవసరం వుంది. ఎందుకంటే నాయకుని ఆరాధన (Personality cult) ప్రాబల్యం వహించిన కాలంలో, పై చెప్పిన వాటికి భిన్నమైన ధోరణి అమల్లోకి వచ్చింది. వ్యక్తిగా వ్యవహరించే స్వేచ్ఛ విపరీతంగా సంకుచితమై పోయింది. మూల తత్త్వం రీత్యా, అటువంటి 'ఆరాధన' కమ్యూనిజానికి బొత్తిగా వ్యతిరేకం. దాని మూలంగా కమ్యూనిస్టు ధర్మం రూపొంధటంలో అభివృద్ధి చెందటంలో ఎన్నో వికారాలు పొడసూపినవి, అంటే అది అర్థం లేని సంగతి కాదు. మార్క్సిస్టు ధర్మ వ్యవస్థ ఇంచుమించు రెండు దశాబ్దాలు పెరుగుదల లేకుండా స్తంభించి పోవటానికీ, యిటీవల ధర్మాన్ని గూర్చిన పరిశీలనం నూతనోత్సాహంతో మళ్లీ ప్రారంభం అవుతూ ఉండటానికీ అదే కారణమని గ్రహించాలి.

జరుగవలసిందెంతో ఉన్నది. పరిష్కారం కాని సమస్యలు చాలా ఉన్నాయి. తత్త్వవేత్తలూ, ఉపాధ్యాయులూ, మనస్తత్వజ్ఞులూ సహకరించి పరిశీలించటం ద్వారానే మన కార్యభారం నిర్వహింపబడగలదు. సృజనాత్మకమైన చర్చలు తప్పనిసరి. లాసెలో జెర్కోయీ చర్చను ప్రారంభించే సాహసం చేసినందుకు అభినందనీయుడు.

తర్వాత జోసెఫ్ యస్. నీరో, కొన్సత్ పబ్లిషర్సు సంస్థలో ప్రచురణకు వచ్చే వ్రాత ప్రతుల్ని చదివి, మార్క్సిస్టు దృక్పథంనుంచీ పరిశీలించే ఉద్యోగం చేస్తున్న చరిత్రవేత్త, డెజరీ తరపున చర్చలో ప్రవేశించారు. ఇతరులు ఏ అంశంలో చర్చ ప్రారంభించారో దాన్ని తడవలేదీయన. అంటే నేటి సామాజిక పరిస్థితుల్లో ధార్మిక ప్రమాణాలను పునఃపరిశీలించే అవసరం తప్పక ఏర్పడింది అనే అంశాన్ని స్పృశించలేదు. జెర్కో వెలిబుచ్చిన అభిప్రాయాల్ని, వాటి పరిణామం ఫలితాలు భవిష్యత్తులో ఎలా ఉంటాయి అనే కోణం నుంచీ విమర్శించాడు. ఈయన దృష్టిలో, జెర్కో అభిప్రాయాలు మానవ హృదయానుబంధాల్లో, ధార్మిక ప్రవర్తనలో నియమరాహిత్యాన్ని, కల్లోలాన్ని తెచ్చిపెడతాయి. ధార్మిక నియమాల్లో కాఠిన్యాన్ని సడలించటమంటే ఎటువంటి దారుణ పరిణామాలు ఏర్పడతాయో ఆ విషయాన్ని గూర్చి జెర్కో అసలు ఆలోచించక పోవటమే లోపమంటా డీయన.

''కాని జెర్కో యిలా సమాధానం చెప్పవచ్చు. తను 'దారుణ పరిణామాల' దృష్ట్యా ఆలోచించటం

లేదనీ, ఏకనిష్ఠమైన ప్రేమ ఆధారంగా, పోషితమయ్యే లైంగిక అనుభూతి మాత్రమే తన ఉద్దేశమనీ అనవచ్చు. దీన్ని ఒక రకం నియమంగా లేక పరిమితిగా మేమూ అంగీకరిస్తాం. కాని "ఇరవైయేళ్లు నిండని వారి ప్రేమ' అనే మాట ఆయనే అన్నారు. అంటే అలాంటి దొకటి వాస్తవంలో ఉన్నదనే కదా! అలాంటప్పుడు 'స్వచ్ఛమైన ప్రేమ' ఎప్పుడు ప్రారంభమయ్యేట్లు? ఎక్కడ సరిహద్దు? అంతే కాదు, అనుభవంలేని ఒక యువకుడూ లేక యువతి (అనుభవంలేని అంటే ఎక్కడో అక్కడ ఎప్పుడో ఒకసారి ప్రారంభించేంత దాకా అందరూ అనుభవంలేని వారే) ఏ చిహ్నాలను లేక ఉపాధులను బట్టి తను సరిహద్దు' దాటినట్లు అర్థం చేసుకోవాలి? తను అలా సరిహద్దు దాటినట్లు, తనకు "సెక్సు" అనుభూతి పొందే అధికారం ఉన్నట్లు నిర్ణయించుకునే పక్షంలో దాని ఫలితంగా సంతానాన్ని పొందే అధికారం ఉన్నట్లా లేనట్లా? లేకపోతే సంతాన నిరోధక సాధనాల్ని ఉపయోగించే సంయోగానికే అర్హత ఉన్నట్లా? అటువంటి ఏకనిష్ఠమైన అనురాగానికి పాత్రమైన అబ్బాయి కాని అమ్మాయికాని ఎన్నిసార్లు జంట మార్చుకోవచ్చు? తత్ఫలితమైన సంతానాన్ని పెంచి పోషించే బాధ్యత ఎవరిది? ఆ అబ్బాయి లేక అమ్మాయి తల్లిదండ్రులదా? లేక దేశానిదా? గర్భవతులైన బాలికల మాటేమిటి? ఎన్నో మాసం దాకా వాళ్లు బడికి వెళ్లవచ్చు? వాళ్లకు కాన్పుకోసం యిచ్చే సెలవు ఎంత? ప్రొద్దుటి క్లాసులికీ, మధ్యాహ్నం క్లాసులికీ మధ్య విరామంలో వాళ్లని యింటికి పరుగెత్తుక వెళ్లి బిడ్డకు పాలిచ్చి రమ్మని ఏర్పాటు చేస్తారా? అలా బాలెంతలుగావుండే మాతృ విద్యార్థినులకు, వాళ్ల కష్టం చూచి డిఫరెన్షియల్ ఇంటెగ్రల్ కాల్క్యులస్ వంటి పాఠ్యభాగాలు నేర్చుకో నక్కర లేకుండా మినహాయింపు యిస్తారా?

అసంఖ్యాకమైన ప్రశ్నలూ సమస్యలూ— జెర్కో వీటినిగూర్చి తలపెట్టనైనాలేదు; కారణం ఆయనకు 'రియాక్షనరీ ఛాందసత్వాన్ని' వదిలించుకోవటమే అన్నింటికంటే ముఖ్యాంశంగా కనిపించటం. పోతే, ఆగ్నెస్ హెల్లర్ వ్యాసంనుంచి కొన్ని భాగాల్ని ఉదహరిస్తాను.

"సెక్సు" ప్రవృత్తికి అన్వయించే ధర్మం కొన్ని యుగాల్లో ఎలా ఉండేదో పరిశీలిస్తే, మనకు కనిపించేది తాత్కాలికమైన ఆచారాలూ, వాడుకలూ కలిసి సంకీర్ణమైన పరిస్థితి. సొంత చెల్లెల్ని విధిగా వివాహం చేసుకోవటం అనే ఆచారంనుంచి, వధువు తప్పక అనాఘ్రాతపుష్పంగా ఉండాలి అనే నియమాన్ని దాటి, చివరకు వివాహితుల్లో చీకటి తప్పు ఆడదిచేస్తే పాపమనీ, మగవాడుచేస్తే పౌరుషమనీ అభిప్రాయపడేదాకా, ఆచారమూ, సంప్రదాయమూ ఎప్పుడూ మారుతూనే వచ్చింది. మొదటినుంచీ వాటి మూలతత్త్వం మాత్రం ఒక్కటే, అది 'ఈ ఆస్తిమీద హక్కు నాది' అనే భావం. కొన్ని వేల సంవత్సరాల చరిత్రలో రెండే రెండు, శాశ్వతమైనవిగా . చెప్పుకోదగ్గ ఫలితాలు ఏర్పడ్డాయి, "సెక్సు" నీతి పథంలో. అందులో మొదటిది: మాతాపితలతోనూ, సోదరీసోదరులతోనూ లైంగిక సంబంధం నిషేధం కావటం—ఇది మానవాళియొక్క జాతి—సంఘ శ్రేయస్సు దృష్ట్యా జరిగింది. రెండవది: దాంపత్య జీవనము ప్రేమమీద ఆధారపడి ఉండాలి అనే విధి—ఇది మానవాళి నైతిక—సాంఘిక శ్రేయస్సు దృష్ట్యా జరిగింది. ఆ యా కాలాల్లో మారుతూ వచ్చిన లైంగికనీతివ్యవస్థయొక్క వైవిధ్యంలో పై రెండూ మానవుని ధార్మిక పరిణామంలో గట్టిగా నిలిచినవి. అంటే తాత్కాలికమైన ఆచారాల్లో అంతర్భాగంగా ఎప్పటి కప్పుడు వ్యక్తం అవుతూనే ఉన్నాయని అర్థం. ఈనాటికీ మార్గరెట్ ను చెరచినందుకు ఫాస్ట్‌ను అందరూ తప్పుపట్టుకుంటారు. మార్గరెట్ కన్యాత్వం కోల్పోవటంగాని,సంతానవతి కావటంగాని పాపమనే అభిప్రాయం నేడు లేదు.కాని ఫాస్ట్ ఆమెను మోసం చేశాడనీ, ఆమెను దైన్యానికీ హత్యకూ పాల్పడజేశాడనీ, ఆమెను హింసించాడనీ నేటికీ దోష నిర్ణయం చేస్తారు. ఆవిధంగా అది ఒక శాశ్వతమైన విలువనూ ప్రమాణాన్నీ ఉల్లంఘించటం అయింది.

నా అభిప్రాయంలో కమ్యూనిస్టు సమాజంలో లైంగిక ప్రవృత్తికి ప్రత్యేకించి ఒక వ్యవస్థ ఉండజాలదు. ఇవాళ ఆ సమస్యనే మనం తీసుకున్నప్పటికీ పై చెప్పిన దృక్పథం జ్ఞాపకంపెట్టుకునే దాన్ని పరిశీలించాలి. "సెక్సు" సంబంధాలలో అవినీతిని' సమర్థిస్తున్నామంటూ ఆగ్రహిస్తున్నవారి కేకలు అప్పుడే వినవస్తున్నాయి. అటువంటి దేమీ జరగటం లేదు. సమాజంలో తదితర వ్యవహారాలకు అన్వయించే నైతిక ప్రమాణాలను—వాటినే తూచా తప్పకుండా—"సెక్సు"

సంబంధాలకు కూడా అన్వయించవచ్చు అనేదే మా విశ్వాసం. హింసాత్మక చర్యలూ, అవతలి వ్యక్తి సంకల్పాన్ని బలవంతాన భగ్నం చెయ్యటమూ, శీలాన్ని అపహరించటం, ధనమూ, వస్తువులూ ఎర చూపి మనస్సుల్ని బేరం చెయ్యటం, యివి ఒక "సెక్సు" ప్రవృత్తి విషయంలోనే అధర్మమూ నీచమూ అయి మిగతా వ్యవహారాల్లో కాకపోతాయా?

"సెక్సు" ప్రవృత్తికీ, మిగతా సహజ ప్రేరణలకీ (Instincts) మూలంలో భేదం లేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చినందుకు జెర్కోను నీరో విమర్శించారు. కాని జెర్కో అభిప్రాయమే సరియైనది. ఉదాహరణకు "సెక్సు" ప్రేరణకీ, ఆత్మరక్షణ ప్రేరణకీ (Instinct ot self–Preservation) విభేదం చెయ్యటం ఎలా సాధ్యం? జీవన ధర్మం రీత్యా, మనస్తత్వం రీత్యా, సామాజిక పరిస్థితుల రీత్యా అలా చెయ్యటానికి సమర్థన మేమీ లేదు. నీరో చేస్తున్న విభేదం డెజరీ చేస్తున్న విభేదం రెండింటికీ మూలం ఒకటే—అది "సెక్సు" ప్రేరణ 'పాప భూయిష్టం' మిగతా ప్రేరణలుకావు అని. ఈ విభేదం అచ్చంగా భావనాత్మకమూ, మతసంబంధమూ అయినది. దీని పర్యవసానం యధార్థంలో ఎలా ఉంటుంది? చావుకు బెదిరి తన సహచరుల రహస్యాన్ని బయట పెట్టిన మనిషియొక్క దోషం, ఒక రాత్రి తన ప్రేయసితో గడిపిన కుర్రవాని దోషంకంటే తక్కువగా నిర్ణయించి తక్కువ కాఠిన్యంతో నిరసించాలా?

నీరో దృష్టిలో ఏకనిష్ఠమైన దాంపత్యం తప్పితే పాశవికమైన సంప్రయోగం యీ రెండే ఉన్నాయి. కాని వాస్తవ జగత్తులో ఆ రెండే కావు ప్రత్యామ్నాయాలు.జెర్కో "సెక్సు" ప్రేమపాపంకాదని అనటంతో, నీరో అభిప్రాయంలో, ఆయన పసివాళ్లం దర్నీ 'కానివ్వండి, ప్రేమ కలాపాలు ప్రారంభించండి' అంటూ సలహా యిస్తున్నారట. ఈ కాలపు పసివాళ్లకు కల్లబొల్లి మాటలు చెప్పి నమ్మించవచ్చుననీ వాళ్లు అవే నమ్ముతారనీ నీరో సులువుగా అభిప్రాయపడుతున్నారు. గత సంవత్సరం, నలభైమంది ఉండే క్లాసులు రెండింటిలో నేను పదహారేళ్ల అమ్మాయిలని ప్రశ్నించాను: మీకు మంచి సామరస్యంతో జీవించే దంపతులెవరైనా తెలుసా? అని. సామరస్యం అంటే నిత్యమూ ఏవో పోట్లాటలు ఉంటే వున్నా, ప్రధానమైన విషయా

లను గూర్చి చిరకాలంగా వస్తూవున్న అభిప్రాయ భేదం ఏదీ లేకపోవటం, అని కూడా వివరించాను. ఒక క్లాసులో అరుగురూ, మరో క్లాసులో నలుగురూ మాత్రమే అలాంటి దాంపత్యం తమకు తెలుసునని చెప్పారు. ఈ బాలికలకు నేను ఏమని బోధించాలి? ఏకనిష్ఠమైన దాంపత్యం (Monogomous Marriage) సంపూర్ణ సామరస్యాన్ని గ్యారంటీగా యివ్వగలదనీ, అందుకోసం వాళ్ళు తమ కన్యాత్వాన్ని జాగ్రత్తగా రక్షించుకోవాలనీ బోధించనా? వాళ్ళు నా మాటలకి నవ్వుకొంటారు. న్యాయమే. కాని, అంత మాత్రాన, నేను బోధించేందుకు ఏమీ లేదా? వాళ్ళకు వున్న నిజం చెపితే ఏం? ఉదాహరణకి పదు నాలుగేళ్ల బాలికలతో "సెక్సు" జీవితాన్ని గూర్చి నే నిలా చెప్పగూడదా? ఆ వయస్సులో అది ఆరోగ్యానికి భంగకరమనీ, మనస్సుని ఆకట్టి చదువు నుంచీ, పొందవలసిన శిక్షణనుంచీ తప్పించి వేస్తుందనీ, అలా పోయిన అవకాశం మళ్లీ రాదనీ, అనవసరమైన మానసిక సంఘర్షణలు తెచ్చి పెట్టుకుంటారనీ, "సెక్సు" సుఖం దృష్ట్యా చూచినా పరిణతమైన వయస్సులో భవిష్యత్తులో పొందబోయే దాని గొప్ప విలువని ప్రకృతంలో పాడు చేసుకుంటారనీ, యిలా ఎన్నో విషయాలు బోధించరాదా? అప్పుడు వాళ్ళు మాట వినటానికి ఎక్కువ అవకాశం ఉండదా? ఎప్పుడూ పురాతన పద్ధతినే బోధిస్తూ, ప్రబోధిస్తూ ఉండటం తప్పితే వేరు గతి లేదా? ఇక్కడ మళ్లీ మరొక పెద్ద ప్రశ్న ఎదురౌతున్నది. అది ఈ చర్చాంశంకంటే ఎక్కువ ప్రస్తుతం కూడా. ప్రేమను గూర్చిన ఈ ధర్మ విచారణ ఒక పెద్ద యుద్ధ క్షేత్రంలో ఒకా నొక రంగం మాత్రమే. ఆయుద్ధం సత్యాన్ని మొహమోటం లేకుండా చెప్పాలి అనే విషయంమీద ఎన్నో రంగాలలో జరుగుతున్నది. ఇక్కడ ఘర్షణ పడుతున్న అభిప్రాయాల్ని విశ్లేషిస్తే, చర్చలో పాల్గొంటున్న యీ వ్యక్తుల అభిప్రాయాలు యితరత్ర ఎలా, ఉంటాయో స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. చాలవరకు ధర్మం విషయంలో ఛాందసత్వం చూపేవారే యితర సామాజిక సమస్యలలోనూ ఛాందసపు భావాల్ని వ్యక్తం చేస్తుంటారు. మెహెలీ వారో తన వ్యాసథలో యీ విషయమే ప్రస్తావించారు. లాసెలో, డెజరీ యిచ్చిన సమాధానం కూడా, లెనిన్ వంటి కార్మికోద్యమపు మహా నాయకుల వాక్యాలతో స్వీయాభిప్రాయాలను సమర్థించుకుంటూ వున్నా, పై సత్యాన్నే రుజువు చేస్తున్నవి. సమాజం మారినప్పుడు తత్కారణంగా ధర్మ వ్యవస్థ కూడా మారుతుంది అనే సూత్రాన్ని డెజరీ అంగీకరించినా అది "సెక్సు" నీతివ్యవస్థకు మాత్రం అన్వయించదనే అంటున్నారు. కారణం ఆ వ్యవస్థను మార్చితే కల్లోల పరిస్థితి ఏర్పడుతుందట. దానితోబాటు ఆయన తను సోషలిస్టు సమాజం తరఫున మాట్లాడుతున్నట్లూ, ఆ సమాజం ఏమి కోరుతున్నదో అదే తను చెబుతున్నట్లూ ఉద్ఘాటిస్తున్నారు."

ఇలా సమాజం తరఫున మాట్లాడే హక్కుని డెజరీ సొంతం చేసుకోవటం చూచి జెర్కో ప్రత్యుత్తరం యివ్వవలసి వచ్చింది. ఇస్తూ ప్రతిపక్షంవారిని ఆయన 'న్యూ కన్సర్వేటివ్స్' అన్నారు—అంటే కన్సర్వేటివ్స్ అయినా యింకా సోషలిజం పేరిట మాట్లాడుతున్నారనే వ్యంగ్యం. ఇందులో ఎంతో అతిశయోక్తి వుంది,ఎంతో నిజమూ వుంది. హంగెరీలో నేడు చర్చలో గెలుపొందాలంటే, సోషలిస్టు సమాజానికి అంగీకార యోగ్యంగా ఉండే నిర్ణయాలకే ఎవరైనా చివరకు దారి తీయాలి. ఇది ప్రభుత్వంనుంచీ ఒత్తిడి కాదు. ప్రజలనుంచీ. ఇలా ఉన్నప్పటికీ ధర్మ వివేచన ప్రగతి సాధిస్తూనే వుంది. పై చెప్పిన ఒత్తిడికూడా ప్రజాభిప్రాయంలో ఎంత ప్రధానమైన మార్పు వచ్చిందో నిరూపించటానికి, ఒక సాక్ష్యం.

నేను సంగ్రహించిన పై చర్చ తప్పకుండా యింకా ముందుకు సాగుతుంది. ఆ విషయం కూడా వచ్చిన మార్పునే సూచిస్తుంది. ఇన్నాళ్లకు సున్నితమైన సమస్యలని బాహాటంగా చర్చించుకో గలుగుతున్నాం. రెండు పకాల వారికీ యిది ముదావహమైన పరిణామమే. యౌవనంలో ఉన్నవాళ్ళు తమ ప్రేమ సమస్యలను గూర్చి సలహాలకోసం తాత్త్వికుల దగ్గరికి వెళ్లటం జరగకపోవచ్చు, కాని యీ చర్చలకు మాత్రం ప్రయోజనం ఉన్నది. మానవుల మనిస్తిష్కాల్లో భావ విప్లవం సాధించేందుకు జరుగుతున్న నేటి మహా సమరంలో అవి ఒక భాగం.

---

# సాక్షాత్కారమ్

## శ్రీమతి ఆర్. కమలమ్మ

ఓహోహోహో యే మానందము
ఏమాశ్చర్యము ఏమి మహాద్భుత
మేమి మనోహర మేమి విలాసమ్
సురలోకమ్మున చూడలేని యా
సుందర మణిమయ విశాల మంటప
మది సువర్ణ సంఘటితోన్నత ఘన
స్తంభ విరాజిత విమలాంచిత మది
లోకాలను దిగ్కాంతిని నింపెడి
దే కాలంబున నెందును లేనిద
దెవరూహింప నసాధ్య మలేఖ్యమ్
ఏక ద్వితీయ తృతీయ చతుర్థమ
పంచమ షష్ఠి సప్తవర్ణసం
దీప్తిమదుజ్జ్వల దివ్యారామమ్
సురలకు మునులకు దిగ్వరులకు సువి
శాల ధరాతల రాజవరాళికి
చూడనశక్యమ్ చేరనశక్యమై
తేజరిల్లు నొక దివ్య ధామమది
చూడఁగల్గె నా సుకృత ఫలమ్మది
వజ్రస్థగిత మహోజ్జ్వల విశాల
మణిమండిత సోపాన సముజ్జ్వల
మాసనమది నా మానసదైవ సు
ఖాసనమగు సింహాసన రాజము
భాసిలుఁ దన్మంటపమధ్యస్థలి
నభ్యున్నతిమెయి నత్యున్నతమయి
సత్య ప్రకాశము సాక్షిభూతము
క్షీరసాగరాంచిత నవనీతము
ప్రతీక్షించుచున్నది ప్రభురాకకు॥ ఏమానందం
ఓహోహోహో ఏమానందమ్॥

*   *   *

వీక్షా కౌతుక దీక్షాళతి నే
నీక్షించుచు నుండెడి యాక్షణమున
గండరించె నొక ఘంటారావము
కడలు కొన్నదొక ఘంటానాదమ్
ఓంకారాంచిత విపుల నినాదమ్
క్షణ క్షణాతిశయమ్మై యొప్పుచు
భువనమ్ముల కభయమ్మని చాటెడి
దివ్యనాదమది నివ్వటిల్లినది
ఝణ ఝణ ఝణ ఝణ ఝణం ఝణాంచిత
మణినూపురముల మనోహరార్భటి
మేళవించె నచ్చెరువుఁ ఘటింపుచు
ఏమిది! యేమిది! ఎక్కడిదీ చ
క్కని చిక్కని వేగాతిశయమ్మున
నొప్పెడి మృదు పద లాస్యమ్మని నే
దిక్కు దోపకే దిక్కుల దృక్కుల
వెదజల్లుచు వేడుకపడి చూడఁగ
వేంచేసిన దొక వరసుందరి తా
కోటి చంద్రులకుఁ గాంతులఁ బంచెడి
కాంతుల ఝరి యది కాంతల మిన్నయు
లలిత మనోహర లావణ్య నిధి
కలాపసుందరి కళాపయోనిధి
సుందర చంద్రకళామయమై వెలుఁ
గొందు చలచ్చల విమలాంబరధర
చక చక చక చక చక చక రత్నా
సనసోపానశ్రేణుల పదార
విందమ్ముల నందమ్ముగ నానుచు
శిరోధార్యమై శుభ్రతుషార స
మాన చంద్రికావిరాజమానము
నై వెలుఁగొందెడి శుభ్రపటము జఘ
నమును స్పృశింపుచు భువిఁ గదలాడుచు
రాజలాంఛనోదంచిత వికాస
విభవస్ఫూర్తిని విశద మొనర్పఁగ
సురుచిరవేగ సముజ్జ్వలయానము
నమ్మిన భక్తులఁ గ్రమ్మిన యిమ్మను
గడువేగమ్మునఁ గడఁద్రోచి కటా

# సాక్షాత్కారమ్

క్షించుటకను నిశ్చయమును చాటఁగ
వేంచేసెను సామ్రాజ్ఞి దయానిధి ॥ఏమానందం॥

*　　　*　　　*

రాజపీఠమున కభిముఖమగు ముఖ
రాజీవము నా కభిముఖమయ్యెను
దివ్యదర్శనము దివ్య స్వరూపము
సత్యసుందరం శివం సుందరమ్
భక్తుల నిత్యానంద మందిరమ్
కన్నుల కింపగు కమనీయాకృతి
వర్ణించుటకే వశముగానిదై
వాగ్బంధము వాటిల్లఁజేయునది
ఆత్మానందము నాదర మదితో
నంది యిచ్చు నిటు రమ్మది కొమ్మని
ఏమని వ్రాసెడి దేమని పొగడెడి
దెంతని చెప్పుదు నంతేలేనిది.
ఏమానందము ఏమానందమ్॥

*　　　*　　　*

ముఖారవిందము నవారవిందము
చెంపకుఁ జేరెడు కన్నుల చెలువము
లోకాలను శాసించెడి గరువము
శాంతగంభీరము సంజ్ఞామాత్రము
మౌనముద్ర సల్లక్షణ తేజము
తల మొదలుఁగ పద తామరసంబుల
పర్యంతము కనుపండువుఁ గూర్చెడి
శాంతిధామ మది సత్యధామమది
భక్తి ధామమది ముక్తిధామమది
శక్తిధామమది శివనిధాన మది
రక్షణధామము రమ్యధామ మది
సుఖముఁ గూర్చు నవసుందరరూపము
అమ్మరూపమది యపూర్వ రూపము
ఓహోహోహో ఏమానందమ్॥

*　　*　　*　　*

పద్మరాగమణి ముద్రాలంకృత
వామ హస్తమున వరత్రిశూలము
దక్షిణ హస్తము రక్షణ చిహ్నము
ధగ ధగ ధగ ధగ ధగద గాంచిత
పుష్యరాగమణి భూషణ పుంజము
నిగనిగ మెఱసెడి నిస్తుల తేజము
ఇందు కిరణములఁ గ్రిందుసేయఁగల
సందడి కాంతులు దందడిఁ గొనగా
పరమంబగు సంకల్ప భాసితము
సుహాస వికాస సుందర వదనము
సవ్యంబున కపసవ్యంబున క
ల్గన లీలా గతి నటు నిటు కదలగ
ఓహోహోహో యేమానంద మ
దేమాశ్చర్య మదేమి మనోహర
మేమి విలాస మదేమి విభవము
కోటి దేవతా బోటి సంఘములు
జంభారీపుర బంభర వేణులు
అమ్మ మేనునం దొలికిన యందపు
సుందర పరాగ రేణువు లందొక
పరమాణువు సరి పరిఢవిల్లఁగల
రే పదిరూపులు పరగఁ దాల్చినా
అంత మనోహర మంత విలాసమ
దంతవిశుద్ధ మదంత విశేషమ
దంత విభవమది యనుపమానమది
మహామోహినీ మంజుల రూపము
మహామాయ మహిమాన్విత రూపము
బ్రహ్మ విష్ణు మహేశ్వరమూర్తుల
కదటుఁ జూపఁగల దాదిశక్తి యది
కనఁబడవలెనని కనఁబడెనేమో
కనుఁగొనవలెననఁగాఁగనవచ్చునె
అమ్మరూపమును అపూర్వ రూపము

# సాక్షాత్కారమ్

నోహ 'హోహో పరమానందము
పరమాశ్చర్యము పరమాద్భుతమో
పరాశక్తి! పరమేశ్వరి! పార్వతి!
భవాని! శంకరి! భాగ్యదేవతా!
కృపాఝరీ నీ కపార ముదమున
నా వాగ్ఝరి యిది నీ ప్రసాదమది
నీ సుందర పాదార విందముల
కందమ్ముగ నాడెందమ్మున కా
నందమ్ముగ నర్చన కుసుమమ్ముగ
అంకితమమ్మా దుర్గమ్మా
ఆదటం గొనుమా దుర్గమ్మా
అఖిలాండేశ్వరి మా యమ్మా!!



# రెండవ అమ్మరాజ విజయాదిత్యుని సిరియూరు (కడలి) తామ్రశాసనము

శ్రీ మునునూరి సాంబశివరామమూర్తి

రాజోలు తాలూకా, కడలి గ్రామ కాపురస్థులు పంచాయితీ బోర్డు ప్రెసిడెంటుగారున్ను అయిన శ్రీ కాశీభట్ల సూర్యనారాయణమూర్తిగారు తమ నివేశన స్థలమందుగల పాటిమట్టిలో నిలువులోతున దొరకిన యీ తామ్ర శాసనమును తూర్పు గోదావరి జిల్లా పరిషత్ సెకండ్రీ సెక్షన్ తెలుగు పండితులు శ్రీ చెఱుకుమిల్లి సీతా రామచంద్రమూర్తిగారి ద్వారా నాకు 1964 అక్టోబరు మాసమున యిచ్చి యున్నారు. అయితే యీ శాసనములోని అన్ని తేకులును అదివరలోనే(మహాద్రావక సంపర్కమున గాబోలు) శైథిల్యావస్థను బొంది అక్షర స్వరూప నిర్ణయమున కాటంకము గలుగుటచేతను, అదివరలో నాచేతనున్న "వరణ ఏస్డి" తామ్ర శాసనమును ముందుగా ప్రకటింపవలసిన బాధ్యత యున్నందునను ఆ సమయమందే (సుగర్ ఫ్యాక్టరీలోని) నా యుద్యోగ ధర్మమును నిర్వహింపవలసిన వాడనగుట చేతను ఈ శాసనము ప్రకటనమున నాలసించినందులకు మన్నింతురుగాక యను మనవితో పై వారిరువురకును నా కృతజ్ఞతాభి వందనముల దెల్పుకొనుచున్నాను.

## శాసన స్వరూపము

అయిదు రాగి తేకులు గల శాసనము. అందు మొదటి తేకు మొదటి ప్రక్కను అయిదవ తేకు రెండు ప్రక్కలను ఎట్టి శాసనాక్షరములుగాని, గుర్తులుగాని లేవు. మిగిలిన ఏడు ప్రక్కలలోను గల మొదటి ఆరింటను ఒక్కొక్క ప్రక్కకు 8 పంక్తుల వంతున 6×8=48 పంక్తులును ఏడవ ప్రక్క 7 పంక్తులును మొత్తము 48+7=55 పంక్తుల శాసనము. ఈ అయిదు తేకులును రాజ ముద్రికగల కడియముచే బంధింపబడియుండి తాళ పత్ర గ్రంథమువలె పుటల త్రిప్పి చదువుకొనుట కనువుగా నున్నవి. ప్రతి తేకును 23×9.3 సెం. మీ కొలత గలిగియుండి ఎడమ ప్రక్కను 3.5 to 5.5 సె. మీ. మధ్య రంధ్రము గలిగి రాజముద్రికగల కడియమును పైకి క్రిందికిని త్రిప్పు వీలు కలిగించు చున్నది. ప్రతి తేకునకు చుట్టు నూలువాసి జవ 2 నూళ్ల ఎత్తు గలిగి శాసనాక్షరముల భద్రపఱచుచున్నది. కడియము వెలుపల 11 సెం. మీ. లో 9 సెం.మీ వ్యాసము గలిగియున్నది. ఆ తేకులు మొత్తము 1300 గ్రాములు, కడియము రాజముద్రికతో సహా 1,000 గ్రా. ను మొత్తము 2,300 గ్రాములు బరువు. కడియము రాజముద్రిక మాత్రము పోతపోయబడిన మిశ్రమ లోహము.

## రాజముద్రిక

కడియమునంటియున్న 2 సెం. మీ. ఎత్తు గల కర్ణికాగ్రముపై. 7 సెం. మీ. వ్యాసముగల రాజముద్రిక. అందు మధ్య భాగమున అడ్డుగ "శ్రీ త్రిభువనాంకుశ" అను అక్షర శ్రేణియు, పై భాగమున కుడి మొగమైయున్న వరాహ రాజమును, దాని కెదురుగా నెలవంకయు, వెనుకవైపు అంకుశమును, ఆ అక్షర శ్రేణికి దిగువను అష్ట దళాంచిత పద్మమును, చుట్టును నూలువాసి జవయు ఉబ్బెత్తుగా పోత పోయబడిన్నవి. కర్ణిక దిగువ భాగమున కడియము నతికియున్నచోట 2 నూళ్లవాసి

(జవ) కడియమును; దానిక్రింద కడియము పైకి నాలుగు వైపుల నాలుగు పెద్ద దళములు, పర స్థలముల నాలుగు చిన్న దళములు మొత్తము ఎనిమిది దళములు అధోముఖముగా నున్నవి.

## శా స న లి పి

శాసనాక్షరములు చాళుక్య కాలపు (సంధి కాలపు) వేంగీ లిపియే. అందుచే పూర్తిగ "వరణ ఏన్డి" తామ్రశాసన లిపినే బోలియున్నది. అక్షరములు వరుస, గుండ్రకత్తి, లోతు సమానమే. పూర్వపు శాసనాక్షరమైన "ఱ" యను యక్షరము గూడ యున్నది. గుణిత ప్రకటితము వ్రాయవలెనన్న ఈ యొక్క శాసనమందలి 55 పంక్తులను విశదీకరించి ఆ యా గుణితాలు వాడుక విధాన భేదములు వివరించుటకు వంద పంక్తులు దాటియుండుటచే విస్తర భీతికి జంకి వదలియుంటిని. ఆ గుణిత ప్రకరణమును వివిధ కాలములందలి శాసనము లనేక ముఖమున పరిశీలించి వేరుగా వ్రాయుటకు బూనుకొంటిని.

## లే ఖ నా దో ష ము లు

ఈ శాసనమందును ("వరణ ఏన్డి" తామ్ర శాసన మందువలెనే) లేఖాచార్యుని పేరు లేదు. సర్వసాధారణముగా ప్రతి శాసనమందును, ఆజ్ఞప్తి, నిర్మిత, లేఖకుల నామములుల్లేఖితము గావలయును. వాటికి ప్రత్యేకాధికారులు ప్రతి రాజు కాలమునను గలరు. అట్టివి లోపించినచో ఆ కాలమందలి రాజ్య విద్వరముల బాగుగా పరిశీలింపవలసిన యవసరము పూర్తిగా నున్నది. అంతేగాక ఈ శాసనము పరిశుభ్రత కొఱకు పరహస్తగతమగుటచే వారి ప్రభావమున మొదలుకే మోసము దెచ్చినది. రాగిఱేకులు తాటాకు లగుటయేగాక రంధ్రములుగూడ బడియున్నవి. అందువలన గొన్నిచోట్ల అక్షరముల బోల్చుటకైనను వీలుగా కున్నది. 1 ఱేకు 2 వైపున ఒక రంధ్రము పలు తావుల గుంట్లును గలవు. 2—1 పూర్తిగా అరిగి అక్షరపు లోతు పూర్తిగా తగ్గెను. రెండు రంధ్రములు ముఖ్యమైన తావున రంధ్రములైనవి. 2—2 ముఖ్యమైనచోట రెండు రంధ్రములును పలు తావులు పూర్తిగా శిథిలమవుటచే 1,2,3,4,5 పంక్తులు అక్షరముల గుర్తించుట చాల కష్టమగుచున్నది. 3.1. చాలవరకు సగము వరకు ప్రతి పంక్తి యందున మధ్యమున పూర్తిగా శిథిలమై యొక్క యక్షరమైనను గుర్తించుటకు లేనేలేదు. అందువలన దాన గృహీత వంశ వర్ణనయు వారి ప్రతిభయు పూర్తిగా దెబ్బతిన్నవి. దానస్థల నిర్ణయమును విషయము లేకనాడు పూర్తిగా బోయినది. 3, 2 న గూడ రెండు రంధ్రములు గలవు. ఈ కారణములచే లేఖన దోషములు గుర్తించుట కష్టమైనను నిల్చియున్న ప్రదేశ మందలి అక్షర లేఖన దోషముల వివరించెద. వర్గ యుక్కులకు బదులు సరళముల వాడెను. ఉ. "అవభృథ" అనుటకు అవభృత్థ అనియు; క్రాముడు విడుచుట ఇన్ద్ర= ఇన్ద; "రకార సంయుక్తము విడచుటః ఉ. తన్నిజ్జిత్యా—తన్నిజ్జిత్యా; అక్షరముల మార్పు : ఉ. నృపః=నృమః; దుష్టాంభోద=దుష్టాంభోజ; విద్విగ్వాపతి=విద్విగ్వామితి; స్వాదాంగ్గ = స్వాగాంగ్గ; భూభృచ్ఛృంగ్గ= భూభృచ్ఛింగ; నమస్క్రియాం= నమస్కృయాం; వేదాంర్థ=వేదాత్థ, క్రిమిః= కృమిః; అక్షరముల పెంపుదలః ఉ. గన్ధరగన్ధ=గన్ధర గన్ధర; అక్షర విలోపముః ఉ. ఏకాకినం హన్తి= ఏకాకినహన్తి; ఆజ్ఞప్తిః కటరాజస్య = ఆజ్ఞప్తిః కటకరాజస్య. తుడుపులు, సవరణలు : ఉ. 4—1—4 "అస్యో" వ్రాసి దానిపైన "సీమా" అని వ్రాసెను. 4—2—4 "పాపాదపేత" అని వ్రాయుటలో "పాపా" పిదప "పే" వ్రాసి తిరిగి సవరించుటలో కుడివైపునగల పూర్ణ్వ రేఖను అక్షరముపై గల "ఏ" ను చెక్కివేసెను. 1—2—5 'భ్రాతా' వ్రాసిన పిదప "వి" వ్రాసి దానిని "కు" గా మార్చుటకై అక్షర శిరోభాగమందలి "ఇ" కారపు గుఱుతును చెక్కివేయ బ్రయత్నించెను. 2—2—3 "విద్విగ్వాపతి" యనుచోట "మి" వ్రాసి దానిపైననే "ప" వ్రాసెను. అందువల్ల ఆ తావున గల యక్షరము స్థిరము గావింప గష్టము.

## శా స న భా ష

పూర్తిగా సంస్కృతము. గద్య పద్యాత్మకము. దానము చేయబడిన గ్రామము సరిహద్దులు మాత్రమే తెలుగు. ఇది మనోహరమైన కావ్య రూపముగ వర్ణింపబడినది. ఇందు గద్య, చూర్ణికలు, ఆర్యా, శార్దూల, రథోద్ధత, అనుష్టుభ, శాలినీ, వసంత తిలకాది

వృత్తములేగాక చతుష్షష్టి మాత్రాత్మకమైన ఆర్యా వృత్తములు నుపయోగింపబడినవి. ఉపజాతి వృత్తమును వాడెను.

## శాసన విషయములు

(i) 1—2—1 మొదలు 1—2—4 వరకును గల 4 పంక్తులు చాళుక్య వంశ ప్రశస్తి. (1965 ఏప్రియల్ నెలలో భారతి 31 పేజీలో ప్రచురించిన) "వరణ ఏన్డి" తామ్ర శాసనమందలి 1—6 పంక్తుల కేమాత్రమును భేదములేదు.

(ii) 1—2—4 మొదలు 3—1—5 వరకునుగల 10 పంక్తులున్ను చాళుక్య వంశానుక్రమణిక. ఇందు వర్ణనలుగాని శ్లోకములుగాని లేవు. సులభ గ్రాహ్యమైన గద్య. ఇందు ప్రతి రాజునకును అంతకు ముందేలిన రాజుతో గల పితా—పుత్ర సంబంధము పూర్తిగా దెలుపబడెను.

సత్యాశ్రయవల్లభేన్ద్రుని సోదరుడైన కుబ్జ విష్ణువర్ధనుడు పదునెనిమిదేండ్లు వేంగీ మన్డలమును పాలించెను. ఆతని కుమారుడు ముప్పదిమూడు వత్సరములు; ఆతని తమ్ముడు ఇన్ద్ర రాజు ఏడు దినములు, ఆతని కుమారుడు (రెండవ) విష్ణువర్ధనుడు తొమ్మిదేండ్లును; అతని పుత్రుడు మంగి యువరాజిరువదియైదు సంవత్సరములు; అతని కుమారుడు (రెండవ) జయసింహుడు పదమూడేండ్లును; అతని సవతి తమ్ముడు కొక్కిలి ఆఱు మాసములు; ఆతని పెద్దన్న గారైన (మూడవ) విష్ణువర్ధనుడు ఆతని తఱిమివేసి ముప్పదియేడేండ్లు; అతని కుమారుడు విజయాదిత్య భట్టారకుడు పదునెనిమిదేండ్లు; ఆతని నిజ పుత్రుడు (నాలుగవ) విష్ణువర్ధనుడు ముప్పదియారేండ్లును, వాని కుమారుడు (రెండవ విజయాదిత్యుడు) నరేంద్ర మృగరాజు నలుబది యెనిమిది సంవత్సరములును; ఆతని పుత్రుడు కలి విష్ణువర్ధనుడు సంవత్సరమున్నరయు; ఆతని కుమారుడు గుణాంక నల్ల విజయాదిత్యుడు నలువది· నాలుగు వత్సరములు; ఆతని తమ్ముడైన (యువరాజ) విక్రమాదిత్య పుత్రుడైన చాలుక్య భీముడు ముప్పదేండ్లును; వాని కుమారుడు (కొల్లభిగండ) విజయాదిత్యుడు ఆఱు మాసములును; ఆతని పుత్రుడు అమ్మరాజ (విష్ణువర్ధనుడు) ఏడేండ్లును; ఆతని కుమారుడు బేట విజయాదిత్యుడు ఒక పక్షము రోజులును; ఆపిదప తాడప రాజొక మాసమును; వానిని జయించి చాలుక్య భీమ తనయుడైన రెండవ విక్రమాదిత్యుడు ఒక్క సంవత్సరమును వేంగీ దేశమును పాలించిరి. అంతలో సామంతులు, శబర నాయకులు, దన్డనాయకులు మొదలైన వారెల్లరును ఈ రాజ్యము మాది మాది యని కలహించి యల్ల కల్లోలము గావించిరి. ఏడేండ్ల రాజరికముగావించిరి. ఆ సమయమున పట్టాభిషిక్తుడైన యుద్ధమల్లు నవమానించి అంతకుముందే (కొల్లభిగండ భాస్కర, నాలుగవ) విజయాదిత్యుని కుమారుడును, (అమ్మరాజ విష్ణువర్ధనుని సవతి తమ్ముడు) అగు (రెండవ చాలుక్య) భీమ (విష్ణువర్ధనుడు) రాజు ఆ సామన్తాదుల రాజ విప్లవమునుండి "పదునెనిమిది" సంవత్సరములు రాజ్యమును కాపాడెను. శాలివాహన శకాబ్దము 867 సం. పుష్య కృష్ణ త్రయోదశీ అనూరాధా నక్షత్రమున శుక్రవారమునందు ఆచంద్రార్కముగా అమ్మరాజునకు (రెండవ అమ్మరాజు) ఆఱవ విజయాదిత్యుడు) పట్టము గట్టబడెను.

(iii) దాత గుణ గణ వర్ణన— 2—2—1 మొదలు 3—1—3 వరకు, 11 పంక్తులు. గద్య, పద్యాత్మకము—"లతాంగి నీకాంక్షయేవ" యనుటచే అనుకూలనాయక సంగమకాంక్షతో నాయకుని కలియునట్లే విద్యాభ్యాస కాలమందే (రాజ్య) లక్ష్మి స్వయముగా అర్హరీతుల నభిషిక్తుడై పట్టము గట్టబడిన "**రాజమహేంద్రుని**" పొందెను. ఛేదింపబడిన మత్త గజ కుంభ స్థలములనుండి జాఱెడి మంచిముత్యముల సరములతో నలంకరింపబడినట్టియు, శత్రు రాజుల రక్తంపు టెఱుపు జాయ గల మైపూతతో నిండియున్నట్టియు, శత్రువులచే దిగన్తముల వఱకును (ధైర్య, శౌర్య, సాహసోపేత గుణ గణ కీర్తనీయమై) యింపైన కీర్తిచే నిండిన మంచి (నిండు) మనసుగల జయలక్ష్మి యుద్ధ రంగమందు "**గండర గండుని**" కుల స్త్రీవలె స్వీకరించెను. దాయాదులనెడి చిదుగులకు దావాగ్ని జిహ్వాలవంటివాడు, చోరులకు నిలయమై ప్రవేశింపరాని తావుల మొత్తమునకు వాడియైన అంపపు కోతవంటివాడును, దోషులైన విద్రోహులకు

ప్రచండ మార్తాండునివంటివాడు, పర్వత శిఖరాగ్రము లందలి గుహలయందు దాగియున్న కాఱు మబ్బులకు ప్రళయకాలమందలి ఝంఝూనిలము వంటివాడును ఏ **"రాజమహేన్ద్రి భూతలపతి"** యొక్క కోప మధికముగా విజృంభించునో అట్టి యతడు సమస్త శత్రురాజుల శిరముల నెలకొన్న (నవ) రత్న సంచయము, తుమ్మెదల గుంపు పద్మముల జేరునట్లు దాకుచున్న పాద పద్మ యుగళము కలవాడును, అందర (శత్రు రాజుల) నేత్రద్వయమును తుమ్మెద జంటలు పద్మముల జేరునటుల తమ విలోకనముల నా కమల చరణముల జేర్చువారగుచున్నారో అట్టి **సమస్త భువనాశ్రయ** శ్రీ విజయాదిత్య (మహారాజాధిరాజ రాజ మహేన్ద్ర పరమ) భట్టారక పరబ్రహ్మణ్యుడు మాతా పితృ పాదాను ధ్యాతుడై (పాగుణార విషయ వాసులైన) రాష్ట్రకూట ప్రముఖ కుటుంబములవారి (గ్రామాధికారులను) అందరను బిలిపించి యిట్లాజ్ఞాపించెను.

(iv) ప్రతి గృహీత వంశోన్నతి-గుణ గణ వర్ణన: 3—1—3 మొదలు 4—1—1 వరకును 15 పంక్తులు. పద్యాత్మకము............ సత్యమును పలుకువాడును, బ్రాహ్మణ వంశమం దుత్తముడను పేరు గాంచిన వాడును......... ... ...వేద విదులలో గొప్పవాడును, ... ... ... ... ...లోకములో చక్రపాణి యను పేరున పేరు కెక్కిన వాడును, భట్ట శాస్త్రము (ఉత్తర మీమాంస యందలి జ్ఞానకాండను) పూర్తిగా దెలిసినవాడును........వాదించువాడును శ్రీ చక్రపాణి భట్టుడను పేరు గలవాడును, (పూర్వ) మీమాంసా శాస్త్రమును తెలిసినవాడును, ఋగ్వేదియు,..... ఆశ్రయము గలవాడు. ఆతని భార్య భవానీదేవివలె శుభ్రపదురాలైన దోనమాంబ. . . . . సత్యమునే పలుకునది. వారి పుత్రుడు దారియభట్టు అను పేరుగలవాడు. దీనులగు బ్రాహ్మణులకు కల్ప వృక్షమువంటివాడును, వేద వేదాంగ శాస్త్ర విదుల యందు సత్యధనుడను కీర్తిచే ప్రసిద్ధి కెక్కిన వాడును, బ్రహ్మతో సమానుడు, అర్థ శాస్త్ర నైపుణ్యమునందు శుక్రునివంటివాడును, నీతి నిపుణుడును, శంఖము, మల్లిక, చంద్రులవంటి నిర్మలమైన కీర్తి గలవాడును, ఎప్పుడు అనేక గుణములచే శుభ్రపదుడగు భగవంతుడైన, శ్రీ మహా విష్ణువునకు శ్రేష్ఠుడును, బ్రహ్మను మించినవాడును, ఇతరులైన పెద్దలకు మనసార నమస్కరించువాడును, సమస్త రాక్షసులను జయించిన ఇంద్రునివద్దనున్న దేవగురుని బృహస్పతివలె నీ రాజమహేంద్రుని వద్ద మంత్రిశ్రేష్ఠుడును, అయిన దారియభట్టశర్మ. వేదార్థమును తెలిసి వేదకర్మలాచరించువాడును, భూదేవులయందు బ్రహ్మవలె సమన్త్రకమైన స్మార్త కర్మల నెరవేర్చువాడును, ఆపస్తంబ సూత్రానుసారమైన నిర్దిష్ట కర్మల నెరవేర్చువాడునైన దారియభట్టు కొరకు ఉత్తరాయణ పుణ్యకాలమున "సిరియూరు" అనుపేర గల గ్రామమును అన్ని పన్నుల ను పరిహరించునటుల అగ్రహారము జేసి నాచే నీయబడినదని తెలుపుడు జేయబడినది.

(V) దానస్థల నిర్ణయము:—4—1—1 మొదలు 4—3—3 వఱకు 3 పంక్తులు (పావునార విషయ మందలి **"సిరియూరు"** గ్రామమునకు) తూర్పున విప్పత్తి; దక్షిణమున దేవ; పడమర మోఱంబత్తి; ఉత్తరమున **నొడలి** సరిహద్దులు.

## ఫ ల శ్రు తి

4—1—4 మొదలు 4—2—6 వఱకు 11 పంక్తులు. గద్య పద్యాత్మకము. వ్యాసాది శ్లోకములచే సర్వ శాసన సామాన్య శ్లోకములే.

## శా స న క ర్త

కటకరాజు. 4—2—6, 4—9—7 పంక్తులలో.

## శా స న వి శే ష ము లు

(i) చాళుక్య వంశానుక్రమణికలో పూర్వ పర రాజుల పరస్పర సంబంధములు (పితా—పుత్ర; అనుజ, ద్వైమాతురాదులు) పూర్తిగా దెలియబఱచుట. (ii) ఈతని కాలమునుండియు క్రీ. శ. 927—928 లో వేంగీదేశమును పరిపాలించిన చాలుక్య మూడవ భీమ విష్ణువర్ధనుని (ఎనిమిది మాసములు రాజ్యపాలన) లోపింప జేయుట. (ఈతని రాజ్య పాలనను చారిత్రకులును, J. A. H. R. S. Vol. 16. P. 131—136 లోని 8 పంక్తియు స్పష్టముగా నంగీకరించియున్నవి.

కాని ఈ ఆలోచన కూడా నాకు తృప్తినిచ్చే బాపతు కాదు.

పిచ్చివాళ్ల లోకంలో భిన్నమైనవాణ్ణిగా ఉండటం, పిచ్చి లేని లోకంలో భిన్నమైన వాణ్ణిగా ఉండటం చివరికి ఒకటే కదా?

నే నొక్కణ్ణే పిచ్చివాళ్ల లోకంలో చిత్త స్వాధీనంతో వున్నవాణ్ణి అనుకుంటే, అదీ తప్పే కదా అని నన్ను నేను మంద లించుకునేవాణ్ణి.

## 17

ఏడున్నర కొట్టగానే, ఏదో మాయలోంచి విడి వడ్డ షాడిలాగ లేచి నిల్చబడ్డాను.

గోడ గడియారమే గదా మన కాల జ్ఞాని. కలియుగంలో ఇదే పట్నవాసులకు ఆధారం.

"విశ్వనాథంగారు రావడానికి ఆలస్యమయ్యేలావుంది, నేను వస్తా. తిరువళిక్కేణికి నడచి వెళ్ళాలి" అన్నాను.

తల్లీ కూతురూ లేచి నిలబడ్డారు.

"అప్పుడే వెళ్ళిపోతారా?......సాధారణంగా పార్కు వరకూ వెళ్ళి ఏడు గంటలకల్లా వచ్చేసేవాడు. ఈ వేళెటు పోయాడో!" అన్నది హేమ తల్లి.

"దయచేసి రేపు పొద్దున్న వార్ని మా ఇంటికి రమ్మ నండి", అని అడ్రసు చెప్పాను.

"మరచి పోతుందేమో!" అని హేమ కాగితం తీసు కొచ్చి గోల్డు కాప్ పెన్నుతో వ్రాసి పెట్టుకుంది. పెన్ను రవి కెలో గుచ్చుకుంది.

నాకూ ఒక బంగారపు కిరీటం వుంటే బాగుండేది.... అనేలాంటిదేదో ఆలోచన తోచింది నాకు!

ఐదో ఏట బళ్ళో వేసినప్పుడు, నాకు నల్లటి వెల్‌వెట్ టోపీ ఒకటి పెట్టారు. అందులో ఒక అంగుళం మేర జరీ అంచు కుట్టి ఉంది. దాన్ని గురించి హేమతో చెప్పాలి అనిపిం చింది.

అదీ పిచ్చి ఆలోచనే!

మరి, ఇటువంటి పిచ్చి ఆలోచనలక్కూడా విశేషార్థాలు చాలా ఉన్నాయి అని ఫ్రాయిడ్ అనుయాయులు ఇప్పుడు మనకు బోధిస్తున్నారు. ఆ ధోరణిలో ఆలోచించటానికి మాత్రం, మన వాళ్ళల్లో ఆట్టే ఉత్సాహం కనిపించటంలేదు.

వరండాలోంచి మెట్లుదిగి, బయటి గేటు వరకూ అంద మైన చెట్లున్న బాట పొడగునా నాతో వచ్చింది హేమ.

మొల్లపూల పొదరిళ్లు కనపడలేదు; కాని పూల వాసన పసిగట్టాను నేను.

జవ్వంతి పూల చిరు చేదు కూడా చుట్టూ కమ్మింది. లోపలికి వచ్చేటప్పుడు నేను తోటను గమనించనే లేదు.

"నడచి వెళతారా?" అన్నది హేమ గేటు దగ్గిర.

"అవును" అన్నాను ముక్తసరిగా.

"చిల్లర తీసుకురాకపోతే.... ..." జంకుతూ అంది హేమ.

నేను నవ్వాను. "నడవటం నాకు ఇష్టం. అందుకే చిల్లర తీసుకుని రాలేదు" అన్నాను.

"నువ్వు కూడా నాతో దారి పొడగునా నడిస్తే ఇంకా చాలా ఇష్టం" అని కూడా అనాలనిపించింది. ధైర్యం చాలలేదు. ఏమనుకుంటుందో అని భయం.

గేటు తెరచింది హేమ. "వెన్నెలగా ఉందే! నడవటానికి బాగానే ఉంటుంది. నేనూ రాగలిగితే.....!" అన్నది హేమ.

"వస్తాను మరి", అని బయలుదేరాను, అభివాద ప్రత్యభి వాదాలు ముగించి.

గబ గబా నడిచాను.

## 18

నా నడక చాలా తొందర; నా ఆలోచనా అంతే!

రెండు కాళ్లే ఉన్నాయి నడవటానికి. మెదడులో ఆలో చనా యంత్రానికి ఎన్ని కాళ్ళున్నాయో కనిపెట్టి చెప్పినవాళ్ళు లేరు.

ఎనిమిది కాళ్ళ సాలీడు లాంటి దది. నూరు కాళ్ళ జల జంతువు అది. కాదంటే వెయ్యి కాళ్ల జెర్రి......ఏదైతే ఏం? అదొక విష జంతువని అందరికీ తెలుసు. ఆలోచన అన్న చీడ పురుగు పట్టుకుందంటే మానవుడు ఆ పట్టులోంచి తప్పించు కోవటం కష్టమే.

ఇతరులందరూ ప్రయత్నించకుండానే దాని పట్టు లోంచి తప్పించుకుంటారనుకుంటాను. నేను తప్పించుకో డానికే ప్రయత్నించను.

తప్పించుకోడానికి ప్రయత్నించడం ఇష్టంలేదు నాకు. ప్రయోజకుణ్ణిగా బ్రతకటం నా కిష్టంలేదు. ఆలో చనా పరుణ్ణిగా బ్రతకడమే నాకు ఇష్టం. కొన్ని సమయాల్లో కార్యరంగంలోకి దిగవలసి వస్తూంటుందే—అప్పుడే తకరార్లు ఏర్పడు తున్నాయి. ఏ పని చెయ్యవలసిన అవసరమే కలగకుండా నేనీ ప్రపంచాన్నే జయించగలను. తనకు తానే ఒకసారి ప్రదక్షిణం చేసి, పందెం గెలిచి, లక్ష్మ్యాన్ని, అహల్యను కైవశం చేసుకొన్న గౌతముడు నా లక్ష్య పురుషుడు. ఇంద్రుడిలాగా ఐరావతం ఎక్కి ప్రపంచం చుట్టూ తిరిగి రావాల్సిన అవసరం మానవు డుగా జన్మించిన వాడికి కలుగుతూందే!—ఇదే మానవ జాతికి "శాపం" అని చెప్పాలి.

అహల్యలాంటి వాళ్లకేమో ప్రయోజకులమీదే, ఐరా వతం అధిరోహించి, గప్పాలు కొడుతూ, డాబుగా పూసేగే ఇంద్రుడిలాంటి వాళ్ళమీదే మోజు. ఇదీ న్యాయంలాగే తోస్తూంది.

ప్రయోజకత్వం వ్యర్థమని తెలిస్తే, దాంతోపాటే కార్య శూన్యత్వం తాలూకు బలహీనత కూడా తప్పకుండా తెలుస్తుంది.

మాంబళంలో వెంకట నారాయణా రోడ్డుకు ఆ నంబరు ఇంటికి పోవటం ఒక కార్యం—తిరిగి రావటం ఒక కార్యం. హేమను కలుసుకోటం కూడా ఒక కార్యమే. కాని ఆమె నొక ఊహలాగ ఉంచుకోటమే ఇష్టం నాకు.

ఆలా ఊహగా ఉంచుకోడాని క్కూడా పూర్వాపరాల్లో చేసిన పనులు రెండూ కావలసి వస్తూండటం దురదృష్టమే. అదే మరీ దౌర్భాగ్యం అనిపిస్తుంది, నాకు.

## 19

లోకంలో గొప్పవాళ్లకు గొప్పఆలోచనలన్నీ వాళ్ళు నడిచే టప్పుడే తోస్తుంటాయనిపిస్తుంది ఎప్పుడూ నాకు.

సోక్రటీసు మొదలు నేటివరకూ, ఉపనిషత్ప్రవక్తలు మొదలు జాక్వయిన్ మారిటైన్ వరకూ, పండితులందరికీ నడవటమంటే ఇష్టమయి ఉండాలి. "నడక" చరిత్రను, దాన్ని గురించి లోగడ ఎవరెవరేమి చెప్పిందీ ఎవరైనా దీర్ఘదర్శకుడైన తత్త్వవేత్త పరిశోధనచేసి గ్రంథం రాస్తే, అది ప్రపంచంలో శాశ్వతంగా ఉండే గ్రంథం అవుతుందని నా నమ్మకం.

అవుతుందో కాదో విడవకుండా కొనసాగించవలసిన ఆలోచనే ఇది! నేనే ఈ గ్రంథం రచించాలన్న కాంక్ష లేకపోలేదు. ఆ గ్రంథం టాయెన్‌బీ ప్రపంచచరిత్రకన్నా గొప్ప, చాలా గంభీరమైన, ఎంతో ఉపయోగకరమైన గ్రంథంగా తయారవుతుందనే నా నమ్మకం.

రాయాలన్న ఆశ అయితే వుందికాని, ఇప్పుడు చూడండి నా అనుభవాన్నే చెప్పదలచుకొన్న నేను ఎన్నెన్ని రకాలుగానో తడబడుతున్నా!

కాని హేమను గురించిన అనుభవాన్ని, హేమతల్లిని గూర్చిన అనుభవాన్నీ చెప్పడంలో ఈ తడబాటు న్యాయమనే తోస్తుంది.

నేను విచిత్రమైన వాణ్ణి అనటంవల్లనే కాదు. ఆ అనుభవం, నాక్కూడా కొంచెం విచిత్రమైనది.

"నువ్వా!" అన్న నా మాట వెంటనే ఆ విచిత్రానుభవం ఆరంభమై వృద్ధిపొంది, వలవేసి నన్ను పట్టుకుంది. ఇక నేను తప్పించుకొనే దారిలేదు.

ఈ జన్మానికే కాదు......

వెనుకటి ఏడేడు జన్మల్లోనూ నేను తప్పించుకోలేదు. రాబోయే ఏడేడు జన్మల్లో కూడా తప్పించుకోలేను.

తప్పించుకోటానికి వీలుపడదు. ఎంతవేగంగా నడిచినా తప్పించుకు పోటానికి వీలుపడదు.

మవుంట్ రోడ్డు వచ్చిందని గమనించకుండానే, అటు తిరిగాను. "ఇంట్లో చెప్పొచ్చావా?" పెద్ద టాక్సీవాడు నన్ను ఒరుసుకుంటూ కారు తోలి, నాలుగు అడుగులు ముందుకువెళ్ళి, కారాపి కిటికీగుండా తొంగి చూస్తూ అడిగాడు.

"చెప్పేసి మళ్ళీ వస్తానయ్యా!" అని మర్యాదగానే బదులు చెప్పాను.

దానికి కొంచెం కటువుగానే "పేవ్‌మెంటుమీద నడవ్వోయ్, తమ్ముడూ!" అంటూ వెళ్ళిపోయాడు టాక్సీవాడు.

## 20

జీవితంలో అందరూ రాచబాట మీదుగా నడచి వెళ్ళడం సాధ్యం కాదు. పేవ్‌మెంటుమీద ప్రక్కకు ఒదిగి, ఒదిగి నడిచేందుకు కూడా కొంతమందికే అవకాశం దొరుకుతూందని చెప్పాలి.

నాకు రాముడు అని పేరు పెట్టినప్పుడే, నన్ను రాచబాటకూ, కాలిబాటకూ కూడా తగనివాణ్ణిగా చేసేశారని ఆలోచిస్తుంటే అనిపిస్తుంది.

రాముడనేది ఎంతగొప్పపేరు! ఎన్నో గూఢార్థాలుగల, ఎంతో శ్రేష్ఠమైన పేరది. ఎన్నో కావ్యాల, నాటకాల పుట్టుకకు ఆధారమైన పేరు.

ఆ పదానికే అర్థం "నేను" అనుకుంటూ కొన్ని సమయాల్లో, నేను మోసపొయ్యేవాణ్ణి.

ఆరోజుల్లో రావణునిఅసురగణం సీతనుమట్టుకే వెంటాడింది. రాముడు సీతామ్మవారిని తనదిగా భావించి, వెతుక్కుంటూ వెళ్ళి రావణునితో పోరాడాడు.

రామరావణయుద్ధం కావ్యాల్లో ఉన్నట్టు, జరిగి చాలా కాలం అయిపోయింది. రాముడనే అవతారపురుషుడు, మనిషిలోనుంచి అంతటికీ చిహ్నంగా, మంచిని కాపాడేటందుకు వచ్చినవాడు-రావణుణ్ణి, అతని కుటుంబాన్ని నిర్మూలించాడనే కావ్యాలు చెబుతున్నయి.

అంతమాత్రాన లోకంలో అసురగణమంతా నశించి పోయింది అనటం సబబు కాదు.

అసురగణాన్ని నిర్మూలించటానికి, రాముడు ఎంతటి వీరపురుషుడైనా, ఒక్కడు చాలడు.

నేనూ రాముణ్ణే.

నేనూ పోట్లాడవలసిన అవసరం వుంది.

హేమతల్లి వెనుక కదలుతూన్న నీడలో—

—అహో! ఎంతమంది రాక్షసులు దాక్కొని, మారీచుడు, సుబాహువు ఆనాడు విశ్వామిత్రుని యాగశాలలో అశుద్ధాన్ని కురిపించి యజ్ఞం జరగకుండా అడ్డుపడినట్లు హేమ అనే నా తపస్సుకి అడ్డుపెట్టారు!

విల్లెత్తి, నారి బిగించి, బాణం ఎక్కుపెట్టి.......

మవుంట్‌రోడ్డులో పేవ్‌మెంట్‌మీద కోదండరాముడులాగా, గట్టిగా కాలూనుకొని, ఆలాగే నిలబడిపోయాను. వెనుకనించివచ్చి నామీదపడిన గంపనెత్తుకున్న ముసలమ్మ "నడవ్వేం సామీ!" అన్న తర్వాత జ్ఞాపకం వచ్చింది —నే నెక్కడున్నదీ.

విల్లులేని కోదండరాముణ్ణే నేను. కోదండంలేని వట్టి రాముణ్ణి నేను.

అసురగణం అని నేను అనుకుంటూన్న, మేఘాలలాగ ముసురుకుంటూన్న ఆ నీడ, అసురగణం కాదేమో?

కాని హేమతల్లి........?

## 21

మొదట టాక్సీవాడు, తర్వాత గంప నెత్తుకొన్న ముసిల్ది —ఇద్దరూ నన్ను మందలించారు.

ఇంటికిపోతే నాన్నగారు "ఏం చేస్తున్నావు ఇంతసేపు" అంటారు. ఏడున్నరకి పోయినా అదే ప్రశ్న — పండ్రెండు గంటలకు పోయినా అదే ప్రశ్న. కనుక నేను పండ్రెండుగంటలకు పోవటమే అలవాటు చేసుకున్నాను.

రుక్కు ఒక్కతె మాత్రం ఇలాంటి ప్రశ్న అడగదు. అయితే, రుక్కుకి హేమని గురించి ఒక్కమాట చెబితేచాలు. ఇంక, వెయ్యి ప్రశ్న లడిగి నా ప్రాణం తినేస్తుంది. ఏం చీర కట్టుకుంది? ఏం రవికె తొడుక్కుంది? ఎంత ఎత్తు? బొట్టు పెట్టుకుందా? ఏం బొట్టు? ఏ రంగు? నుదుటి మధ్యగానా? కనుబొమల మధ్యా? తల ఏలా దువ్వుకొంది? నగలు? చెవికి? మెడలో? పళ్ళు వరుసగా వున్నాయా, తిన్నగా వున్నాయా? చిన్నవా? కంటి కొలకుల్లోంచి కాటుక రేఖలు లాగి పెడు తూందా? పై పెదవిమీద కనపడేలా చిరు నెంట్రుకలు మొలి చయ్యా?, లేదా? మోచేళ్ళిచిప్ప నల్లబడిందా? చేయికన్నా ముఖం రంగు తక్కువా, ఎక్కువా?......అంటూ ప్రశ్నమీద ప్రశ్న...... ప్రశ్నల వర్షం కురిపించేస్తుంది.

ఇప్పటివరకు, ఈనాటిదాకా ఇలా ఎప్పుడూ జరగ లేదు నాకు. అయినా రుక్కు, దాని పక్కింటి స్నేహితురాలు— ఆమె పేరు జగదాంబాళ్ —నేను వాళ్ళిద్దర్నీ రుక్కు, జగ్గు అని పిలవడం మామూలు—మాట్లాడుకోవటం విన్నప్పట్నించీ, వాళ్ళని గురించి నా అభిప్రాయం ఇది.

హేమను గురించి రుక్కు, నన్ను ఇలాంటి ప్రశ్నలు వేసిందంటే, జవాబు చెప్పటం నిస్సందేహంగా నా వల్లకాదు. ప్రతి ప్రశ్నకీ "తెలియదు" అనే జవాబు చెప్పాలి.

అవేమీ నేను గమనించలేదు.

హేమ అందంగా ఉంటుంది అని మొత్తంగా, ఒక అభిప్రాయం మట్టుకు కలిగింది నాకు. అంతేకాని, ఆమె అందచందాల హేతువు లేవీ నాకు జ్ఞాపకం రావటంలేదు. ఇప్పుడు ఆలోచించి చూస్తే కూడా ఆమె ముఖాన్ని నా మనస్సులో రూపు కట్టుకోలేకపోతున్నాను.

పేవ్‌మెంటుమీదుగా థౌజెండ్‌లైట్స్ మలుపులో తిరువళిక్కేణికి మళ్ళేముందు, నిలబడి ఆలోచించాను.

ఆమె ముఖం జ్ఞాపకం చేసుకోలేక పోతున్నాను. ఏం చీర కట్టుకుంది? బొట్టు ఎలా పెట్టుకుంది? రవికె ఏ రంగుది— ఏదీ జ్ఞాపకం రావటంలేదు.

ప్రయత్నించి చూడగా, చూడగా, ఒక్కటిమాత్రం స్పష్టంగా తెలిసింది నాకు.

హేమతల్లి, ఆమె నీడతోసహా, నా మనోనేత్రానికెదురుగా, సాయంత్రం కనిపించినట్టే—అలాగే ప్రత్యక్షమయింది. ఆమెని గూర్చి రుక్కు ఇలాంటి ప్రశ్నలు ఎప్పుడిగినా బదులు చెప్పేయగలను. ఆమె రూపం, పూర్తిగా, సూక్ష్మాతిసూక్ష్మ విషయాలతోసహా నా మనస్సులో ముద్రపడిపోయింది.

అదే! చెప్పాంగా. నేను కాస్త విచిత్రమైన మనిషిని అని!

విచిత్రం ఏమిటి? పిచ్చే!

## 22

ఆరోజు రాత్రి రుక్కు నన్నేమీ అడగలేదు. నేను ఆమెతో హేమను గూర్చి ఏమీ చెప్పలేదు కనుక నాన్న కూడా అలవాటు ప్రకారం కాకుండా, తన స్నేహితుణ్ణి గురించి అడిగారే తప్ప, నే నెందుకు ఆలస్యంగా వచ్చిందీ అడగలేదు.

ఆయనలేరనీ, మర్నాడు పొద్దున్న రమ్మని చెప్పేసి వచ్చాననీ చెప్పాను.

కొడుకు ప్రయోజకుడయాడనుకున్నారో ఏమో, "భేష్" అన్నారు. "వాళ్ళింట్లో వాడి మేనకోడలు ఒకమ్మాయి ఎవరో బి. ఏ. చదువుతూందని చెప్పాడే!" అన్నారు.

ఉలిక్కిపడ్డ నేను "ఇదేం కుట్ర?" అనుకుంటూ, తలెత్తి చూశాను. "ఎవరో వయస్సు మళ్ళినావిడ ఒకర్నిమాత్రం చూశాను. విశ్వనాథంగారు తన తమ్ముడు అందావిడ," అని తెలి విగా బొంకాను.

మా నాన్నగారిని గూర్చి నే నే విధంగామా తీర్మానించుకో లేకపోతున్నాను. ఆయన వట్టి అమాయకులా? వివేకవంతులా? పండితుడా, కార్యశూరుడా, పిచ్చివాడా, పిచ్చిలేనివాడా? ఏదీ, ఎటూ అర్థంచేసుకోటానికి, పద్దెనిమిదేళ్ళగా ప్రయత్నిస్తు న్నాను—ఆయన్ని అర్థం చేసుకోటం సాధ్యంకాకుండావుంది. కొన్ని సమయాల్లో ఆయన మనిషేకాదు అన్న తీర్మానానికి రావాల్సిన అవసరం కూడా ఏర్పడేది నాకు.

"గొప్పవాళ్ళు అని పేరుబడిన వాళ్ళంతా, తమ చిన్న వయస్సులో తమ తండ్రులను మించటానికి ఎంతో ప్రయత్నం చేసినవాళ్ళే, అందులో కొందరు తప్పించుకోవచ్చు; చాలామందికి తప్పించుకోటానికి వీలుపడదు. ఇలా తప్పించుకోనివాళ్ళకు ఆ పోరాటంలోనే, వారి జీవితంలో చాలా భాగం గడచిపోతుంది".

—ఇది ఎక్కడో ఓ పిచ్చివాడి పుస్తకంలో చదివాను. ఎక్కడో, ఎవరు రాసిందో, ఏ సందర్భంలో రాసిందో జ్ఞాపకం రావటంలేదు.

కాని, మా నాన్నగారు నా నోటు పుస్తకంలో ఈ వాక్యాన్ని చదివి, "నిజమే" అన్నారు.

నేను అనుకుంటూవున్నది నిజం అని ఒప్పుక్కునే వాళ్ళంటే నాకు సాధారణంగా పడదని ఇదివరకే చెప్పాను నాన్నగారిని ద్వేషించటానికి ఇంకో కొత్త కారణం దొరికింది.

"నా తండ్రినుంచి తప్పించుకోట్నానికి నేను మొదటిసారి ప్రయత్నం చేశాను—చేత కాలేదు" అన్నా రాయన.

మావాన్నగారు హరిశ్చంద్రుళ్ళాంటివారు కాదు కాని ఆయన చెప్పిన ఆమాట మాత్రం నిజమయ్యే ఉంటుంది.

## 23

మా నాన్నగారి అదుపులోంచి బయటపడి బ్రతకాలి అన్న భావం నాక్కలిగి చాలాకాలమయిందనే చెప్పాలి.

నాకు జ్ఞాపకం ఉంది—నా ఎనిమిదోయేటే మాబామ్మ రాముడు.....అచ్చూ.....వాళ్ళ నాన్నలాగే ఉన్నాడు!" అనేది.

కన్నతల్లి ఆమెకు తన కొడుకు ఎలాంటివాడో తెలుసు గదా? ఆ రోజునుంచే నాకు, మా నాన్నగారిలాగ ఉండకూడదు అన్న పట్టుదల ఏదో కలిగింది. ఈ పదేళ్ళుగా ఈ భావం ఎదుగుతూ వచ్చి, ఇటీవల బాగా ప్రబలమయిందని చెప్పాలి. సడలిపోయే సూచన ఏమీ లేదు.

చూడగా, చూడగా నేనూ క్రమంగా కొంచెం కొంచెంగా నాన్నలాగే అవుతున్నానేకాని, ఆయనకి దూరంగా పోతున్నాననే నమ్మకం నాకూ కలగటంలేదు.

ఆయన ముక్కుపొడుం పీలుస్తారు. అది నాకు అలవాటులేదు. అంతే తేడా. తక్కిన వాటిలో ఎందులోనూ మాలో వ్యత్యాసం కనిపెట్టడానికి వీల్లేదు.

కొన్ని సందర్భాల్లో నేను మా గ్రామానికి వెళ్ళాల్సి వచ్చేది. మూడేళ్ల క్రిందట "వెళ్ళి రామచంద్రం దగ్గర భూముల ఫలసాయం తాలూకు డబ్బు తీసుకురారా!" అని మా నాన్నగారు పంపారు. ఆ రామచంద్రంగారి దగ్గిరికిపోయి, ఆయన ఎదుట నిలబడ్డాను. వెంటనే "రా, నారాయణా రా!" అన్నారు. నా పేరు రాముడు అని చెప్పి చూశాను. కాని ఆయనకి నేను నారాయణుణ్ణే—అంటే మా నాన్ననే.

"నీ వయస్సులో ఇలాగే మీ నాన్న కూడా ఉన్నట్టుండి ఏదేదో మాట్లాడటానికి ప్రారంభించేవాడు. పాడైపోతాడేమో పిచ్చాడు అని మేమంతా భయపడ్డాం" అంది మంగళం బామ్మ.

ఆ పక్కనేవున్న సుబ్బలక్ష్మి మ్మ అమ్మామ్మ "బాగా చెప్పావ్, వాడా పిచ్చాడు! వాడు పదిమందికి పిచ్చ లెత్తించగలడు!" అంది.

నిజంగా, నా ప్రియమైన జనకుడే, మా నాన్నగారే నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నారు. కనుపించిన తన స్నేహితులందరితో వూరికేనాగొప్పలుచెప్పి పొగడుతారు — పొగడేయటంలో ఇలా అలా కాదు—వూరికే తెగ పొగడేసేవారు. వాళ్ళు వెళ్లిపోయింతర్వాత "ఏరా! దద్దమ్మా!" అనేవారు. మరి వాళ్ళ ముందు, అలా పొగిడారేం అంటే, "ఒ ద్ధిమంతుడివే! వెళ్ళు!" అనేవారు.

మా నాన్నగారిలాగే నా కాలేజీ లెక్చరర్లందరూ "రాము డికి సాధారణ లోకజ్ఞానం తక్కువ; కాని చదువుల్లో మట్టుకు చాకులాంటివాడే! అనేవారు.

## 24

నేను చదివేది చాల తక్కువే. ఏదో ఒక్క విషయాన్ని—సార హీనమైన పాఠ్యపుస్తకాల్లోవున్న విషయ మేదో చదివితే—వేరే ఏవో తొమ్మిది రసవద్విషయాలు నా మనస్సులో ఉరుకులు పరుగులు ప్రారంభిస్తాయి: అంచేతే, నేను చదివేది చాల తక్కువే.

పరీక్షల్లోమాత్రం అన్నిసబ్జెక్టుల్లోమా హేమ చెప్పినట్టు నేనే ఫస్టు.

ఎందుకొస్తాయో, ఎలా వస్తాయో నాకే తెలియదు. దీన్ని గురించి గొప్పగా చెప్పుకోవాలని కూడా నాకు లేదు.

విద్యార్థిగా నామీద కాలేజీ లెక్చరర్లందరికీ మంచి అభిప్రాయమే. నాలాంటి విద్యార్థి ఏ పది ఇరవై ఏళ్ళలోనో ఒక్కసారి కనిపిస్తాడని నాకువినబడేటట్టుగా వాళ్ళతో వాళ్లే అనుకునేవాళ్ళు. వాళ్ళు పాఠ్యపుస్తకాల్లో చదివి ఉంటారు—ఎందరో మేధావులు తమ చిన్న తనంలో నాలాగే "లూజ్"గా ఉండేవారని చదివి, జ్ఞాపకం ఉంచుకుని ఉంటారు.

ముఖ్యంగా మా లెక్కల మాష్టారు పాట్రాచారి గారికి నేనంటే ఎంతో నమ్మకం. నే నొక అపరరామానుజాన్ని అని తీర్మానం చేశారు—పాపం! తన పాతచింతకాయపచ్చడి గుర్చి పాతధోరణిలోనే మాట్లాడుతూ తృప్తిపడే రకం మనిషి. తన పాతచింతకాయపచ్చడి వాసన వాళ్ల వూరూ వాడా అంతా, లోకమంతా వ్యాపిస్తుందని, ఆయన కలలుగంటున్నట్టుంది పాపం!.... నాకీ సంగతి స్పష్టంగానే తెలుసు.

పాపం! అని ఎందుకు అంటున్నానంటే

ఆయన ముసలితనపు కలల్ని నేను నాశనం చెయ్యాలనే, నా మనస్సు లోలోపల ఆశిస్తోంది. నే నొక రామానుజాన్ని అయిపోవాలని కోరేందుకు ఆయ నెవరు? ఏమిటా కోరిక?

ఆయన కంటున్న కల లేవీ, నావల్ల నిజం కాకూడదు—ఎన్నటికీ కాకూడదు—అలా కాకుండా చూడటం నా మొట్టమొదటి బాధ్యత అనుకుంటున్నాను.

నన్ను మించిన శక్తి ఏదో నాకీ హెచ్చరిక చేస్తోంది. ఆ బోధను నేను పెడచెవిని పెట్టటం అసాధ్యం.

నామీద అంత ఆశపెట్టుకొన్న మా లెక్కలు మాష్టారు గారికి, నామీద చాలా అసంతృప్తి కూడా ఉంది అని తెలుసుకోటం కూడా నాకు సంతృప్తే.

క్లాసులో తాను చెప్పిందాన్ని నేను వినటమే లేదని ఆయన అసంతృప్తి.

నిజమే. నేను వినటం లేదు.

నేను వినేందుకు వారేమీ అంత గొప్ప విషయాలు చెప్పడం లేదు!—నేనేం చెయ్యను!

## 25

వెంకటనారాయణారోడ్డుకి నేను వెళ్ళివచ్చిన మరుసటి రోజు కాలేజికి సెలవు. ఆ మర్నాడూ సెలవే. మూడోరోజు, కాలేజీలో మొట్టమొదటి క్లాసు లెక్కల క్లాసే.

అంతవరకూ క్లాసులో ఎవరెవరున్నారన్నది కూడా గమనించి చూడని నేను, ఆరోజు ఆమె ఎక్కడ, ఎక్కడ అనుకుంటూ కళ్ళు తెరచి క్లాసంతా గాలించాను.

ఏ పిల్లని చూసినా మొదట నాకు, నా పడుచు కళ్ళకు, ఆమెలాగే కనబడింది. కొంచెంసేపయింతర్వాత, ఆమె కాదని తీర్మానించుకోవలసి వచ్చేది. నా సుదుటిమీద ముడుతలు పడేటట్టు నే నా తీర్మానానికి రావటానికీ, ఆమె ఆరోజున ఆలస్యంగా రావటానికీ, సరిపోయింది.

అసలామె ఏనాడైనా క్లాసుకు సరైన వేళకు వచ్చిందా?

ఇన్ని రోజులూ అంతరంగంలోంచి పెళ్లగించుకొని పైకిరాని ఈ స్మృతి, నాకీ రోజున చటుక్కున కలిగింది.

వచ్చినామె మాష్టర్నీ, విద్యార్థులనీ, ప్రత్యేకంగా నన్నొకరకంటితోచూసి, తన సీటులోకి వెళ్ళి కూచుంది. కాటుక, మత్తు, మత్తూ మైకం కలిగించే శక్తీవున్న కళ్ళామెవి. నీలంగా నల్ల నల్లగా, ప్రాణాల్ని త్రాగి సంతోషించే కళ్లామెవి, అని నా చెల్లెలు రుక్కుకి చెప్పేందుకు శ్రద్ధగా చూశాను.

మహాకవి డాంటేని ఫియాట్రిస్ స్వర్గమంతా త్రిప్పి చూపి, ఏ దైవసాన్నిధ్యంలోకో తీసుకువెళ్లి అతణ్ణి పరవశుణ్ణి చేసిందట. ఈ నా ఫియాట్రిస్ నన్ను బహుశః నరకానికి తీసుకపోవచ్చు. స్వర్గం అంటే నమ్మకంలేని వాళ్ళంగద మనం!

నా ఫియాట్రిస్‌తో మానసికంగా, నరకలోకంలో సంచరిస్తూన్న నేను, లెక్కల మాష్టారు చెబుతున్న ముఖ్యమైన విషయాన్ని గమనించలేదు. ఆయన "రామూ!" అని మొదటిసారి పిలిచింది కూడా నా చెవిని పడలేదు. రెండోసారి "రామూ!.." కొంచెం గట్టిగానే వినబడింది.

"ఏం సార్!" అని లేచి నిలబడ్డాను.

"నిద్రా?" అన్నారు ఆవకాయగారు.

"లేదు, కల" అని వున్నమాటే అన్నాను.

క్లాసంతా గొల్లుమని నవ్వింది.

అందరి నవ్వుల్లోకీ హెచ్చుస్థాయిలో వినబడింది ఆమె నవ్వు. నన్ను తికమక పెట్టడానికి వచ్చిందామె!

లెక్కల మాష్టారికూడా నవ్వే వచ్చింది. మొదట ఎందుకోసం పిలిచారో—ఆ సంగతి మరచిపోయి, "కూచో!" అన్నారు.

## 26

హేమను, నే నామె ఇంటికి వెళ్ళిచూసొచ్చి దెబ్భయి రెండు గంటలసేపు అయిపోయింది. దెబ్భయి రెండు గంటలసేపులో నే నామెను మరచిపోవచ్చును అనుకున్నాను;—నేను పిచ్చివాణ్ణి.

ఈ దెబ్భయి రెండు గంటల్లో ఆమె తల్లిని కూడా మరచిపోలేకపొయ్యానే; ఆమెనా?.....ఎలా మరచిపోగలను!

హేమ క్లాసులోకి వస్తూ, కాటుక కారే కళ్లతో నన్ను చూసిన చూపుకి అర్థమేమిటి?

"నువ్వు తప్పించుకోలేవయ్యా. తప్పించుకోలేవు!" అంటున్నట్లు నేనాచూపులో చదివాను.

ఇందులో ఆమె తప్పు ఒకటుంది. నే నామెనుంచి తప్పించుకోదలచానని ఆమె అనుకుందే, అదే తప్పు.

తప్పించుకోవాలనుకోలేదుగా నేను!

నా ముఖాన 'ఆమె'. వ్రాసి ఉంటే, తప్పించుకోటానికి నే నెందుకు ప్రయత్నించాలి?

తప్పించుకోటానికి దారిలేదు అని ఎక్కడో, పూర్వజన్మ వాసన కూడా కలిసి, హెచ్చరిస్తూన్నప్పుడు, నేను తప్పించుకోటానికి ప్రయత్నించటం ఎందుకు?—ఓడిపోవటం ఎందుకు?

ఆశపడనివాడు గొప్పఅదృష్టవంతుడే. అసలు, నేను తప్పించుకోవాలని అనుకోనూలేదు.

రెండు రోజులు కాలేజీకి సెలవు వచ్చినా తన్నెందుకు చూట్టానికి రాలేదని అడిగిందేమో ఆ చూపులో?

"మీ అమ్మగారూ, ఆమె నీడా నన్ను భయపెడుతున్నారు. అంచేతే నేను రాలేదు" అని వున్నమాట నేను ఆమెతో చెప్పెయ్యగలిగితే బాగుణ్ను.

నా ఆలోచనల్లో ఆమె కూడా భాగం పంచుకొని అవస్థపడితే పడుతుంది.....నష్టమేమిటి?

ప్రేమంటే సుఖంలో మట్టుకు భాగం పంచుకోవటం అని ఎలా అంటాం? కష్టంలో కూడా భాగం పంచుకోవాలి!

నేను రాముణ్ణని గుర్తించినట్టే, తన తల్లిని తాటకి అనో, శూర్పణఖ అనో ఆమెని కూడా భావించుకోనీ!

ఈ ఆలోచనల అంటు వ్యాధి ఆమెకీ సోకనీ, ఆమె సొగసుని కొంత పాడు చేయనీ!

నా ఆలోచన్ను ఆమె అర్థం చేసుకుందంటే, ఆమె కాటుకకళ్ళుత్రిప్పటం, కవ్వించటం కొంచెంతగ్గవచ్చునేమో! కాని, అవి తగ్గాలనేనా నేను కోరుతూంది?

అసురగణాన్ని ఎదిరించి పోరాడటానికి ఆ రాముడికీ, గొప్ప కోదండమూ, లక్ష్మణుడూ అండగా ఉన్నారు. నా వద్ద కోదండమూలేదు. తోడుగా లక్ష్మణుడూ లేడు.

శూర్పణఖ దగ్గిర దగ్గిరకి వస్తూంది—చాలా దగ్గిరికే వచ్చేసింది. నొక్కేస్తూంది.

శూర్పణఖ నీడలో వేనకువేలు రాక్షసులు దాక్కొని ఉన్నారు. నా "రామ" రామణీయకాన్ని నాశనం చేయటానికి కాలు దువ్వుతున్నారు.

లక్ష్మణా!

అయ్యో లక్ష్మణా!

## 27

విద్యార్థుల్లో రెండురకాలవాళ్ళున్నారు. ఒకరకంవాళ్ళు చదివి పాడయే రకం. ఇంకొక్క రకంవారు చదవకుండానే పాడైపోయే రకం.

ఏలాగూ పాడైపోయేరకమేకదా ఈ విద్యార్థి లోక మంతా అనే ధోరణిలోనే ఏడాదియేడాదికీ కొంచెం, కొంచెంగా మనకాలేజీపాఠ్యగ్రంథాలస్థాయి దిగజారుతూ వస్తూంది. ఇలా దిగజారటానికి తోడుగా ఈ రోజుల్లో కళాశాల్లో చదువు చెప్పే రోజుల్ని తగ్గించి తరచు వారానికి మూడు రోజులు, నాలుగు రోజులూ సెలవు ఇచ్చేస్తున్నారు.

ఈ పిల్లలంతా చదువుకొని చెడిపోవటానికి బదులుగా, చదువుకోకుండానే చెడిపోకూడదా అని విద్యాధికారుల ఉద్దేశం అనుకుంటాను.

1950 లో చదివే ఈ చదువు 1940 లో కూడా ఉపయోగపడుండదు. 1960 లో బ్రతకాల్సిన పిల్లవాడు ఈ చదువులు చదివి ఎలా కడతేరగలడు అన్న సందేహ మేదో మన విద్యాధికారులను బాధిస్తున్నట్టుంది!

ఆ ఒక్కరోజు కాలేజీ తర్వాత, మళ్ళా రెండురోజులు ఎవరో పుట్టారు, ఎవరో చచ్చారు—ఇప్పుడు అధికారంలో ఉంటూన్నవారు వాళ్ళని గొప్పవాళ్ళుగా నిర్ణయించారు గనుక—సెలవు.

మొదటి రోజంతా రుక్కుతో కేరం బోర్డు ఆడేస్తూ గడిపాను. ఆమె చూడకుండా ఉన్నప్పుడు బోర్డుమీద రెండు బిళ్ళల్ని దొంగతనంగా పాకెట్టులోకి నెట్టి కూడా చూశాను. అప్పటికీ రుక్కే గెలిచింది.

ధర్మమే ఈ లోకంలో గెలుస్తుందనడానికి ఇదొక సూచనా?

కేరం బోర్డులాంటి సాధారణమైన విషయాల్లో మట్టుకే ధర్మం గెలుస్తుందా?

రుక్కునే అడిగాను.

ఆమె చెప్పిన జవాబు విని చిత్తైపోయాను. "నీకు ఆటూరాదు, టక్కరు చెయ్యటమూ తెలీదు అన్నయ్యా" అంది రుక్కు.

ఆట తెలీదు—ఒప్పుకుంటాను.

టక్కరు చెయ్యటం కూడా తెలీదా?

మోసగించటమైనా తెలిసుండకపోతే ఎల్లాగని నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.

"టక్కరి మాటలు చెప్పటంలో అందరూ రుక్కువద్ద నేర్చుకోవాల్సిందే మామా!" అంది జగ్గు.

ఆ మాట కూడా వింతగానే ఉంది నాకు.

## 28

మర్నాడు పొద్దున్నే ఎవరింట్లోనో ఏదో అయివుంటుంది. సన్నాయిమేళం, డోళ్ళూ, నా చెవినీ, మనస్సునూ అదరగొట్టడం మొదలెట్టాయి. తెల్లవారుజామునే మేల్కొన్న నేను, కొంతసేపు చావుని గురించిన ఆలోచనల్లో సుళ్ళు తిరిగి తిరిగి, లేచి స్నానం చేసి, చొక్కా తొడుక్కుని, వీధి చివరి హోటల్లో ఓ కప్పు నాసిరకం కాఫీ తాగేసి, మనస్సులో బాధ తీరేందుకు కాళ్ళ నొప్పులు తెచ్చుకుందాం అని నడిచాను.

తిరువళిక్కేణినించి, పైక్రాఫ్ట్స్ రోడ్డుమీదుగా మవుంట్‌రోడ్డుకు వెళ్ళాను. మవుంట్‌రోడ్డమ్మట నడుస్తూ, వెంకటనారాయణారోడ్డు ఎదురయ్యేదాకా వచ్చేశాను. పొద్దుటి పూట అలా నడవటం సుఖంగానే ఉంది. రోడ్డుమీద జనం ఎక్కువలేరు.

"ఆమె" ఇంటికి పోవాలనే ఉద్దేశంతో బయలు దేర్లేదు నేను. పొద్దున్న ఏడున్నరే అయ్యుంటుంది. త్యాగరాయ నగర్‌నించి తిరిగి రోడ్డమ్మట వెళ్ళిపోదామనే అనుకున్నాను. కాళ్ళు వాటంతట అవే నన్ను ఆరోడ్డువైపు త్రిప్పినయ్. అటు వెళ్ళాను.

సరిగ్గా ఆ సమయంలో నాలో ఆలోచనల్లో అలజడి ఏమీ లేదు.

ఆమె యింటి ముందుకి వచ్చేసింతర్వాత, కొంచెం ఆగి, అక్కడే నిలబడ్డాను.

నిజానికి నేను స్వయంగా లోపలికి వెళ్ళుండేవాణ్ణి కాననుకుంటాను. గేటుకు దూరంగా గులాబి మొక్కల పక్కన హేమమామగారు నిలబడున్నారు. నేను సమాచారం చెప్ప డానికి వెళ్ళిన మర్నాడే ఆయన మా ఇంటికి రావడం, మా నాన్న గారూ, ఆయనా ఆ రోజు పగలంతా మాటల్లోనే గడిపే యటం—అది పాత కథ.

ఆయన నన్ను చూడగానే "లోపలికి రా బాబూ!" అని పిలిచారు; నా కోసమే ఎదురు చూస్తున్నట్టు. వెంటనే గేటు తెరచుకుని లోపలికి వెళ్ళిపోయాను.

నా మనస్సులో బాధ తీరినట్టే ఉంది. మా వీధిలో విన్న సన్నాయిమేళం, చావులజ్ఞాపకాలూ నాకు దూరమై పోయినయ్.

ఎంత దూరమైనా నడవటానికి సరదాపడేవాణ్ణి నేను. నడిచి, నడిచి నడకకి బాగా అలవాటు పడిపోయినవాణ్ణి నేను. అయినా నాకాళ్ళు కొంచెంగా నొప్పెట్టటం ఆరంభించినయి.

హేమమామగారు ముందునడుస్తూంటే, నేను ఆయన్ని వెంబడించాను. ముందుగదిదాటి హాల్లోకి వెళ్ళాం. హాల్లో ఉయ్యాలమీద కూచుని ఉంది హేమతల్లి.

ఉయ్యాల వేగంగా ఊపుతున్న ఆవిడ, నన్ను చూడ గానే వేగం కొంచెం తగ్గించింది. ఊపటం ఆపేసింది. కాని ఉయ్యాలమీంచి క్రిందికి దిగలేదు.

"కూచోవయ్యా, నేను వెళ్ళి కాఫీ తెమ్మంటాను" అన్నారు విశ్వనాథంగారు.

"కాఫీ వద్దండి. ఇప్పుడే తాగాను," అన్నాను.

## 29

ఎందుకీరోజు ఇక్కడికి వచ్చానా అనిపించటం మొదలెట్టింది నాకు. మాటిమాటికి రేగుతున్న జుట్టు చేతివేళ్ళతో సవరించుకుంటూ, విశ్వనాథంగార్నికాని, హేమతల్లినికాని చూడకుండా, హాల్లో గోడకు తగిలించిన అందమైన పటాల్ని చూస్తూ నిలుచున్నాను.

"కూచోండి" అంటూ ఒక మెత్తని దిండు వేసిన పేము కుర్చీ చూపించింది హేమతల్లి.

"ఆరోజు నే వెళ్ళి చూసొచ్చానే—నారాయణ అనే నా స్నేహితుణ్ణి—ఆయన కుమారుడు ఈ అబ్బాయే! రాముడంటారు. హేమ క్లాసులోనే చదువుతున్నాడు" అని చెప్పుకుంటూపోయారు హేమమామగారు.

"తెలుసులే! ఆరోజు ఈ అబ్బాయే నిన్ను వెదుక్కుంటూ వచ్చింది. 'అరగంటసేపు మనింట్లో నీకోసం ఎదురు చూసి చూసి వెళ్ళిపోయాడు!'' అంది హేమతల్లి.

"నేను ఈ రోజు కూడా తిరువళిక్కేణి వచ్చి మీనాయన్ని చూడాలనుకున్నా.....తోటలో మనిషి పనిచేస్తున్నాడు. ఏమేం చేయాలో వాడికి చెప్పి వచ్చేస్తాను. తర్వాత తాపీగా మాట్లాడుకుందాం. తొందరేంలేదు," అంటూ బయటికి వెళ్ళారు విశ్వనాథంగారు.

నేను హేమతల్లి చూపించిన కుర్చీలో కూచున్నాను.

పూర్తిగా ఆగిపోయిన ఉయ్యాలను మెల్లగా కాలితో నేల తన్ని వూపుతూ హేమ తల్లి తనంత తానుగానే చెప్పింది: "హేమ బాగా పొద్దున్నే, ఎవరో స్నేహితురాల్ని చూడాలని, బండితీసుకునివెళ్ళింది. ఇంకొక అరగంటలో వచ్చేస్తుంది" అని.

మెల్లగా కదులుతూన్న ఉయ్యాల వెనుకపక్క, ఒక రాక్షస స్వరూపం, వట్టి నీడలా నిలబడి, పళ్ళికిలించి, నన్ను గేలి చేస్తున్నట్టు భ్రమ కలిగింది నాకు. అటు చూస్తూనే, దాన్ని చూడకుండా ఉండటానికి ప్రయత్నం చేస్తున్నాను.

హేమతల్లి చూచాయగా రెండు విషయాలు నాకు బోధ పరచింది—ఆ ఒక్క వాక్యంతో. ఒకటి, వాళ్ళకి కారు వుందన్న సంగతి. రెండవది నేను హేమకోసమే వెతుక్కుంటూ వచ్చానని తాను అభిప్రాయపడుతూన్న సంగతి.

నేను హేమను వెదుక్కుంటూ రాలేదు అని చెప్పి ఉండాల్సింది.

అలా చెప్పుంటే, దానికి ఏవిధంగా అర్థంకల్పించుకునేదో ఆవిడ? నేనేమీ బదులు చెప్పలేదు.

వెనుకపక్క రాక్షసిరూపంలో కనబడుతూన్న, నీడ శూర్పణఖకి చెందిందా, తాటకికి చెందిందా అని తేల్చుకోటానికి ప్రయత్నిస్తూవుండిపోయాను.

## 30

హేమను వెతుక్కుంటూ కాకపోతే, నే నెందుకు మళ్ళీ ఆ ఇంటివేపు వెళ్ళటం?

ఆమె మామయ్యని వెతుక్కుంటూనా? లేకపోతే అందమైన కాలుతో ఉయ్యాల మెల్లిగా తోస్తూ కూచుండే, హేమ తల్లి — ఆమెను చూడ్డానికి వచ్చానా?

నేను హేమకోసం రాలేదని చెప్పుంటే హేమ తల్లి కూడా నమ్మేదికాదు. అందేత, చెప్పకుండా ఉండటమే మంచిదయింది.

"మీపేరు రామమా? మంచిపేరు" అంది హేమతల్లి.

ఆమె పేరు శూర్పణఖ. ముక్కూ, చెవీ కోసి ఈమెను అవమానపరచటానికే, నా కింక లక్ష్మణుడు కావాలి.

చుట్టూ చూశాను—లక్ష్మణుడి జాడ ఎక్కడా కనబడలేదు.

అయ్యో! లక్ష్మణా!

"మీరు చాలా గట్టివారని మా హేమ చెబుతూంటుంది" హేమతల్లి అంది.

నేను బదులు చెప్పలేదు. ఏమని బదులు చెప్పడం? గట్టివాణ్ణైన నాకు దీనికేం బదులు చెప్పాలో, తెలియటంలేదు.

ఉయ్యాల వూగే వేగం కొంచెం ఎక్కువైనట్టుంది. దేనిమీదో దూకడానికి దాక్కొని, తోకమాత్రం పైకెత్తి వూపే, పిల్లి జ్ఞాపకం వచ్చింది. హేమతల్లి గొంతెత్తి "ప్రేమ అంటారే, దాన్ని గురించి మీ అభిప్రాయమేమిటి?" అని అడిగేసి, నా వంక సూటిగా, ప్రశ్నార్థకంగా చూసింది.

అయ్యో! లక్ష్మణా!

"ప్రేమను గురించా" అన్నా న్నేను, ఉలిక్కిపడి, ఆశ్చర్యంతో.

అది తాటకి నీడకాదు; శూర్పణఖ నీడే—సందేహం లేదు.

ప్రేమను గురించి నేనేమనుకుంటున్నానో తెలుసుకోగోరుతూందా ఆమె? అయ్యో!

"అవును, 'లవ్', 'లవ్', అంటుంటారే! దాన్ని గురించి" అని ఉయ్యాల వూగే వేగాన్ని కొంచెం తగ్గించుకుంటూ అంది హేమతల్లి. ప్రేమ అని తెలుగులో చెబితే అర్థం కాదేమో అని సందేహించినట్టు, ఇంగ్లీషులో "లవ్" అని కూడా చెప్తూంది.

హేమతల్లిని ఇంగ్లీషు తెలిసినావిడగా గౌరవించలేను నేను. ఇలాంటివి ఒకటో రెండో మాటలుతప్ప, ఆమెకు మూడో ఇంగ్లీషు మాట తెలిసి ఉండదు.

ఉయ్యాల వేగం కొంచెం ఎక్కువైంది. నీడ కదిలింది.

(సశేషం)

# నోబెల్ బహుమతి పొందిన

# మైఖేల్ షోలక్షోవ్



సాహిత్యానికి 1965 నోబెల్ బహుమానాన్ని ప్రసిద్ధ రష్యను రచయిత శ్రీ మైఖేల్ షోలకోవ్‌కు ఇచ్చారు. ఈ బహుమానం 19450 పౌనులు. ఆయన రచనలలో 'And quiet flows the Don' అనే నవలకే ప్రధానంగా ఈ బహుమతి ఇచ్చారు. ఆయన కిప్పుడు 60 సంవత్సరాలు. తన 21 వ సంవత్సరంలో ఈ నవలను వ్రాయటం ఆరంభించాడు. పూర్తి చేయడానికి 14 సం. లు పట్టింది. ఇది మొత్తం నాలుగు సంపుటాలు. మొదటి రెండునవలలు 1928 సం. లో ప్రచురించారు. సమష్టి వ్యవసాయ విధానంలో వ్యక్తి పడేపాట్లను ఈ నవల వర్ణిస్తుంది. అప్పట్లో అధికారుల విమర్శకు గురి అయినది. 1940 లో మిగతా రెండు సంపుటాలు వచ్చాయి. 1957 లో The fate of Man అనే నవలను ఆరంభించారు. అది ఇంకా పూర్తి కాలేదు.

ఈ బహుమతిని 1933 సంవత్సరంలో రష్యాను వదలి రాజకీయ ప్రవాసంలో ఉన్న "అయివాన్" అనే ఆయన కిచ్చారు. 1958 లో బోరిస్ పాస్టర్నాక్‌కు ఇచ్చారు. అయితే ఆయన ఆ బహుమతిని మొదట స్వీకరించి తరువాత త్యజించాడు. మైఖేల్ షోలకోవ్ బహుమానాన్ని స్వీకరిస్తానని ముందే చెప్పియున్నారు. అసలు ఈ బహుమతి ఎప్పుడో రావలసియున్నది. ఆ విషయాన్ని నదని బహుమతి ఇచ్చిన స్వీడిష్ అకాడమీ అంగీకరించినది.

"నేను డాన్ నదీ తీరాన పుట్టాను. అక్కడే పెరిగాను. అక్కడే ప్రథమ పాఠాలు నేర్చుకున్నాను. అక్కడే రచయితగా, మనిషిగా పెంపొందాను.

అక్కడే కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా పెరిగాను'' అని ఆయన వ్రాశారు.

మధ్య తరగతి కుటుంబంలో జన్మించారు· విద్యాలయాలకువెళ్ళి చదువుకోటానికి వీలులేక పోయింది. ఆయన కుర్రవాడుగా వున్నపుడే రషియన్ విప్లవము, అంతర్యుద్ధము అనే తుపానులు విజృంభించాయి. వాటిలో ఈయన చొరబడ్డాడు. అయినప్పటికి ఆయన రచయితగా తన ప్రావీణత్యమును చూపించాడు. మాస్కోలోఉండి యుక్తవయస్సు వచ్చేసరికల్లా The Tales of the Don అనే కథల సంపుటాన్ని వ్రాశాడు. ఆ కథలు అందరి దృష్టిని ఆకర్షించాయి. నవలా రచనకు ఉపక్రమించటానికి ఇవి తోడ్పడియుండవచ్చు. కథను చెప్పడంలో ఆయనది అందెవేసిన చెయ్యి.

ఆయనెపుడూ విషెనిస్కాయా అనే తమ గ్రామంలో ఉంటారు. సాధారణంగా ఆ వూరు విడిచి ఎక్కడికి వెళ్లరు. అంతర్యుద్ధం అప్పటినుంచీ కమ్యూనిస్టులతో కలిసి పని చేసినా 1930 సం. లోనే ఆయన కమ్యూనిస్టుపార్టీలో చేరారు. పార్టీలో నాయకత్వంలో వచ్చిన మార్పులు ఏవీ ఆయనను ఏమీ చేయలేదు. అందరు ఆయనను గౌరవంతోనే చూచారు. సాహిత్యంపట్ల సోవియట్ నిరంకుశ ప్రభుత్వం ప్రదర్శించిన వైఖరిని నిశితంగా విమర్శించారు.

గడచిన యుద్ధంలో ఆయన యుద్ధ విలేఖరిగా వెళ్ళి కథలు వ్రాస్తూ ఉండేవారు. ఆ కథల సంపుటి పేరు They fought for their Country.

''మనం (రచయితలు) వ్యష్టిగాను, సమష్టిగాను ప్రజల అంతఃకరణను ప్రతిబింబింపచేయాలి.'' ఇవి ఆయన 1955 లో రషియా యువ రచయితలకు చేసిన ఉపదేశం.

# అర్థంకాని హిందూజాతి

శ్రీ నీరద సి. చౌధురి

(గతసంచిక తరువాయి)

ఎంతటి క్లిష్ట సమస్యకైనా, పరిష్కారమార్గం సరిఅయిన కీలక సూత్రాలను, ప్రారంభంలో ఎంత అస్పష్టమైనవైనాసరే, గ్రహించి అనుసరించగల్గటంపై ఆధారపడి ఉంటుంది. హిందువులను అర్థం చేసుకోగలిగేందుకు అదృష్టవశాత్తూ అట్టి కీలకసూత్రం అధమం ఒకటైనా మనకు సంసిద్ధంగానే ఉన్నది. కాకుంటే, ఇంతవరకు దీనిని అనుసరించినవారుగాని, అథవా ఊహించినవారుగాని ఎవరూ లేరేమో అనేదే నాకు ఆశ్చర్యం కల్గిస్తుంది. ఆంగ్లేయులు భారతదేశం పాలించిన రోజుల్లో వారి ప్రవర్తనను అర్థం చేసుకొంటే హిందూజాతిని అర్థం చేసుకొనేందుకు కీలకం దొరుకుతుంది. ఇంగ్లాండును గురించి నేను వ్రాసిన గ్రంథంలో ఆంగ్లేయుల నడవడిపై భారతదేశ వాతావరణం, శీతోష్ణ పరిస్థితుల, ప్రభావాన్ని వర్ణించాను. నేను ఇంగ్లాండు వెళ్లినప్పుడు ఇంగ్లాండు వాతావరణం నాపై పరపిన ప్రభావాన్ని చవి చూచాక, తద్విపరీతపరిస్థితి ఎలాఉంటుందో కొంత కొంత గ్రహించగల్గాను. అప్పుడా గ్రంథంలో వ్రాసిన విషయాన్ని ఇచ్చట ఉటంకిస్తున్నాను.

"ఆంగ్లదేశ వాతావరణాన్ని అనుభవించాక, భారతదేశం వచ్చిన ఆంగ్లేయులు తమ సహజ దయాస్వభావాన్ని సర్వసమత్వబుద్ధిని కోల్పోయి, అంత దౌర్జన్యంగా ఎలా తయారౌతారో నాకు అర్థమయింది. వారిలో తారతమ్య విచక్షణా వివేకం భగ్నమయి, సహజ మితభాషిత్వం నశించి, కేవలం పచ్చిగా మొరటుగా కనబడే అత్యంత సంకుచిత అభిప్రాయాలతో, నమ్మజాలనంతగా మూర్ఖత్వం ఆవహించినవారయేవారు. చాలమంది ఎట్టి నీతి నియమాలు లేని నీచులుగా కూడా భ్రష్టత్వం చెందేవారు. ఆంగ్లజీవియానున్నితత్వం, విశిష్టత ఎంత ఎక్కువైతే మనిషి తత్వం అంతగాన్నూ మరింత వికృతమయిపోయినట్లయేది."

అవ్యక్తంగా జరుగుతున్న ఈ మార్పును అరికట్టాలంటే, బుద్ధిపూర్వకంగానే మరొక మార్పును అత్యంత సులభ విధానంలో సాధ్యమయే పద్ధతిలో అనుసరించవలసి వచ్చింది. ఈ విషయాన్ని స్పష్టంగా ప్రతిభావంతంగా అంతర్ దృష్టితో కిప్లింగ్‌వలె దర్శించగలవారెవరూ లేకపోయారు. భారతదేశంలోని తన దేశస్థుల నుద్దేశించి, స్వతస్సిద్ధంగా జన్మవలననూ పెంపకంవలననూ కూడా అలవడ్డ సంక్లిష్టతలను సున్నితత్వాలను అట్టే నిలబెట్టుకొందామని ప్రయత్నించక, అచ్చమైన నికరమైన తోడేళ్లవలె బ్రతకటం నేర్చుకోండని కిప్లింగ్ హెచ్చరించాడు.

Wash daily from nose-tip to tail-tip.

Drink deeply but never too deep;

And remember the night is for hunting.

And forget not the day is for sleep.1

ఆంగ్ల జీవితాన్ని గురించి వ్రాయవలసి వచ్చినప్పుడు కిప్లింగ్ సూక్ష్మాతిసూక్ష్మమైన పరిశీలనా

---

1. భారతదేశంలో పగటిపూట విధాయకంగా నిద్ర పోవాలన్న విషయం, ఈ రోజులలో బ్రిటిష్‌వారేకాక, పాశ్చాత్య దేశాల వారందరూ కూడా నిర్లక్ష్యం చేస్తున్నారు. తత్ఫలితంగా మెదడు మెత్తబడి పోతున్నది. వేరే ముఖ్యప్రవృత్తులతో దాతృత్వ దాంభికాలతో వ్యవహరించటంకాక దేశాన్ని పాలించవలసి వచ్చి ఉంటే పరిస్థితి మరింత ప్రమాదకరంగా తయారయి ఉండేది.

నైపుణ్యంతో అత్యంత సునిశిత ప్రజ్ఞా వైభవం ప్రదర్శిస్తాడు. కాని అది కేవలం స్వదేశానికే పరిమితం చేసుకొన్నాడు. భారతదేశాన్ని గురించి వ్రాయవలసి వచ్చినప్పుడు మాత్రం, తన అంతర్దృష్టి ననుసరించి కఠోర నిసర్గ శైలిని చేపట్టాడు.

కిప్లింగ్ రచించిన 'విండ్ ఇన్ ది విల్లోస్' స్వదేశంలో ఉన్న ఆంగ్లేయుని గూర్చిన కట్టు కథ. ఇక 'జంగిల్ బుక్' భారతదేశం వచ్చిన ఆంగ్లేయుని గురించిన కట్టు కథ. భారతదేశంలోని బ్రిటిష్ సైనిక అధికారులకన్నా సూక్ష్మసిద్ధాంతీకరణలలో ప్రతిభావంతులైనవారు మరి లేరనవచ్చును. చరిత్రలో అపూర్వమైన ప్రతిభా విశేషంతో, భారతదేశంలోని ఆంగ్లేయులజీవితానికి సులభ సూత్రాలను ధర్మాలనూ తేలికగా నిర్వచించివేయగలిగారు. ఆ చెప్పటంలో కూడా నసుగుడు ఏమీ లేకుండా అనుకున్నదేదో నిర్మొగమాటంగా చెప్పగలిగేవారు. భారత దేశంలో బ్రిటిష్ సైనికులు ఎలా ప్రవర్తించాలో ఆదేశిస్తూ సైనికాధికారులు తయారు చేసిన ఒక నిబంధనల గ్రంథంలో ఇలా వ్రాసుకొన్నారు.

"సుఖ వ్యాధులలో మూడురకములు కలవు. ఇవి స్త్రీ సంగమము వలన సంక్రమించును. దాదాపు భారత దేశములోని ప్రతి వీధివేశ్యకు వీనిలో ఏదో ఒకరకమైన వ్యాధి ఉండితీరును. ఇవి రాకుండ జాగ్రత్త పడుటకు ముఖ్య నివారణోపాయములు— 1. స్త్రీ సంగమమును మానివేయుట 2. సంగమానంతరము మేహనమును సబ్బునీళ్లతో పరిశుభ్రముగ ప్రక్షాళనము చేయుట 3. సంగమానంతరము ఒక గంట లోగా 'ప్రొఫిలాక్టిక్ ట్రీట్‌మెంట్ రూమ్' (వ్యాధి నివారణ చికిత్సాలయమున) కేగి మందు జాగ్రత్తలు పడుట 4. వ్యాధి సంక్రమించిన అనుమానము కల్గినచో వెంటనే జబ్బుగా నున్నట్లు అధికారులకు తెలుపుట."

భారతదేశంలో విశృంఖల శృంగారాన్ని చవి చూచిన బ్రిటిష్ సైనికుడు స్వదేశం వెళ్లాక,

"చెల్సియా అంచునుండి స్ట్రాండు వరకూ
ఇండ్లల్లో పనికత్తెలు ఏభైమందితో
చెట్టాపట్టాలు వేసుకొని చెడ తిరిగానే కాని,
వీళ్లేదో ప్రేమలూ శృంగారాలూ అంటారు
అసలు వీళ్లకు ఏమి అర్థమయిందంట!"

అన్నాడంటే అబ్బుర మేమీలేదు.

ఆంగ్లేయులు, ఆంగ్లదేశంలోని తమ గృహజీవిత విధానాలను, సాంప్రదాయపు ఛాందసాలను, అలవాట్లను భారత దేశానికి కూడా వెంట తెచ్చుకొందామన్న ప్రయత్నాలు, కేవలం వైఫల్యాలకు, విచ్ఛిత్తికి, ఒక్కొక్కప్పుడు ఘోర ప్రమాదానికి, మృత్యువుకు కూడ త్రోవ తీసేవి.

అందానికి అందము, సచ్ఛేలానికి సచ్ఛేలం, సకల సల్లక్షణాలు కలిగి ఎంతటి ఛాందసుడైన ఆంగ్లేయుడూ కూడా ఏమాత్రం వంక పెట్టలేనంత లాలిత్యంతో రమ్యంగా ఉండే రోజ్ ఏయిల్మర్, కలకత్తాలో అనాసపండ్లు అతిగా తిని చనిపోయింది.

ఆంగ్లేయుడు భారతదేశంలో ఉన్నప్పుడు త్రాగుడు మొదలుపెడ్తే బానలతో త్రాగటం సాగించేవాడు. ఆంగ్ల జీవితపు టంచులలో రమ్యాతి రమ్యంగా భాసించే పర స్త్రీ సల్లాపాలు కూడా భారత దేశానికి వచ్చేటప్పటికి అతి అపాయకరంగా తయారయేవి. ఇంగ్లాండు నుండి భారత దేశానికి వస్తున్నప్పుడే పి. అండ్ ఓ. స్టీమరు విలాసాలు వీరికి ఉచ్చులు పన్ని ప్రమాదాలకి దించేవి. నౌకాయాత్రలో కేవలం క్షణికంగా అతి లఘువుగా భాసించిన సల్లాపచర్యలు సిమ్లా చేరి రిక్షా ఎక్కేటప్పటికి భావనారథంలో పయనిస్తూ ఉద్రేకంతో ఇంద్రధనస్సు అంచుల వెంటాడుతున్న ఉద్విగ్నతలన్నీ కల్పించేవి. భారత దేశంలో ఆంగ్లేయుల పరస్త్రీ సల్లాపాలు, జాక్కోలోని మర్కటాలకు కూడా అపహాస్య భాజక చేష్టలుగా స్ఫురించేవి. వారిలో ఒకరు వ్రాసినట్లు;

"మరొక మనిషి పల్లకీని నే నెన్నడు వెంటాడను. అది నా జీవితంలో ఎన్నడూలేదు.

పెలిటీలో మరొక కోతిగాడి పెండ్లాంతో నేనేమైనా సల్లాపా లాడానా!"

సుదూర కొండ ప్రాంతాల ఏకాకివాసపు జీవితాల శుష్కప్రేమలను అంతకన్న అధ్వాన్న పరిస్థితులనుండి రక్షించాలంటే కిప్లింగ్ కథ 'విలియం ది కాంకరర్'లో చూపించినట్లు సంకీర్ణ జన పథాలకు ఆ ఉద్యోగులను బదిలీచేసి, వారి ప్రేమకలాపాలను

నిర్వీర్య మొనర్చి కేవలం భావనావీధులకు పరిమితం చేయటం ఒక్కటే మార్గంగా కనపడేది. ప్రేమకు ఇట్టి పరిణామం కల్పించటాన్ని ఇలా వ్యవహరించటాన్ని, సోమర్ సెట్ మామ్ హర్షించలేక పోయాడంటే ఆశ్చర్యమేమీలేదు. భారతదేశంలో బ్రిటీష్ వారి జీవితం సవ్యంగా, సమగ్రంగా నడవాలంటే రైలును పట్టాలమీద నడిపించినట్లు దేశభక్తి, విధ్యుక్తధర్మం అనే రెండు పట్టాలమీద నడిపించాలి. ఈ మార్గంనుంచి ఏ ఒక్కరిని వెంట్రుకవాసి ప్రక్కకు తొలగనిచ్చినా, వ్యక్తి జీవితం సంఘజీవితం కూడా ఛిద్రమయిపోయే ప్రమాదాన్ని చేతులారా తెచ్చిపెట్టుకొన్నట్లే కాగలదు.

భారతదేశంలో బ్రిటిష్‌వారి ఇండ్లలో పని చేసే భారతీయ నౌకర్లు తమ యజమానులు, యజమానురాండ్రు అంటే అంత నీరసంగా ఎందుకు చూస్తారా అని పూర్వపు రోజుల్లో నాలో నేను చాల సార్లు ప్రశ్నించుకొనేవాడిని. ఎంతటి గొప్పవాడైనా తన స్వంత నౌకరుకు వీరపురుషుడుగా కనబడడని అనవచ్చును. కాని ఇది అలా చెప్పి త్రోసివేయగల విషయం కాదు. ఆ యిండ్లలో నౌకర్ల కంటబడరాని అనేక విషయాలు ఆ నౌకర్ల కంటబడేవి. వారి నీతి నియమాలకు అలవాట్లకు ఆ విషయాలు సహించరాని ఘోరాలుగా కనబడేవి. అమ్మగారుగాని, అయ్యగారుగాని, వీరిముందు ఏమాత్రం నిగ్రహంగాని, గోప్యంగాని అవసరం లేదన్నట్లు, అసలు ఆ నౌకర్లు మానవమాత్రులే కాదన్నట్లు విచ్చలవిడిగా సంచరించేవారు. సిగ్గా శిరం లేదని నౌకర్లు చీదరించుకొనే పనులన్నీ బాహాటంగా వారిముందరే చేసేవారు.

ఈ సిగ్గులేనితనానికి ప్రాతిపదికగా కొన్ని కృత్రిమ వ్యసనాలు కూడా ఉండేవి. భారతదేశంలోని చాలమంది ఆంగ్లేయుల కామజీవితం వికృత వ్యసన పూరితమై ఉండేది.ఆ క్షుద్ర వ్యసనాలకువారు దాసులై పోయి ఉండేవారు. 1920—30 దశాబ్దపు చివరి సంవత్సరాలలో కలకత్తాలో ఒక పుస్తకాల అంగడి ముందు వీధి వీధి అంతా ఇంగ్లండునుంచి టపాబోటు వచ్చిన మర్నాడు, ఆంగ్ల సాహేబుల కార్లతో క్రిక్కిరిసి ఉండేది. ఓడ దిగినపుడల్లా, కొత్త కొత్త పచ్చిశృంగారపుగ్రంథాలు దొంతర్లు దొంతర్లుగా ఆ అంగడికి దిగుమతి అవుతూండేవి. ఇట్టి పచ్చి శృంగారపు గ్రంథాల, బూతుబొమ్మల వ్యాపారం కలకత్తాలో చాలా విరివిగా అతిలాభదాయకంగా జరుగుతూ ఉండేది.

ఇక భారతదేశంలో బ్రిటిషర్ల సంఘ ప్రవర్తన చూద్దామా అంటే వ్యక్తుల ప్రవర్తనకన్నా మరింత అధ్వాన్నంగా చెడిపోయింది తప్ప మేలేమీ జరుగలేదు. వ్యక్తి జీవితంలోని సంక్షోభాలు అంతకన్న విస్తృత రంగంలోకి తొణికి వెల్లివిరిసే మాట నిజమే. కాని వ్యక్తిగతంగా భారతదేశంలోని బ్రిటిషర్ల నడవడి అతిశుద్ధంగా గౌరవప్రదంగావున్న సందర్భాలలో కూడా భారతీయులపట్ల వారి నడివడి మాత్రం ఏమాత్రం మెరుగయేది కాదు. బహుశా భారతదేశంలో జీవించటంలో కలిగే ఆంతరంగ సంక్షోభాలను చికాకులను కొంతకు కొంతైనా తగ్గించుకొని సేదతీర్చుకోటానికి బ్రిటిష్ వారికి ఇదొక్కటి రక్షాకవాటంగా ఉండేదేమో. భారతీయులకు భారతీయులకు మధ్య తగవు తీర్చవలసినప్పుడు, ముఖ్యంగా జాతీయోద్యమంవల్ల వారి బుద్ధులు ఇంకా వికృతం కాకముందు, అతి న్యాయ బుద్ధితో నిష్పాక్షికంగా వ్యవహరించగల్గిన భారతదేశంలోని ఆ బ్రిటిష్‌వారే, వారికి మనకూ మధ్య వ్యవహారం వచ్చినప్పుడు మాత్రం, ధర్మా ధర్మాలు, సత్యం అసత్యం, దాక్షిణ్యం క్రోధం, ఇత్యాధి సర్వ విచక్షణాజ్ఞానం కోల్పోయి, కేవలం జాత్యహంకారాన్ని ప్రదర్శిస్తూ విపరీతంగా వ్యవహరించేవారు. ఈ జాత్యహంకారం సరళమైన మందర స్థాయిలో ఉన్నప్పుడు, మౌన ముద్ర తాల్చటమో, లేక విధిగా భారతీయుని కలుసుకోవలసివస్తే ముక్తసరిగా రెండు మాటలతో నమస్కారానికి ప్రతినమస్కారమైనా లేకుండా పంపివేయటంగానో ఉంటూ, హద్దుమీరి తారస్థాయి నందుకొన్నప్పుడు దౌర్జన్య రూపాన్నందు కొనటంగా ఉండేది.

ఆ కథ అంతా జగత్ప్రసిద్ధమై అందరికీ బాగా తెలిసినదే అయినందున నే నిచట తిరిగి వల్లించ నవసరంలేదు. రాను రాను బ్రిటిషర్లు—భారతీయుల మధ్య సంబంధ బాంధవ్యాలకు, ఒకరి నౌకరు ఎంత తక్కువగా కలుసుకొంటే ఉభయులకూ అంత మంచిదన్న భావం ప్రాతిపదికమై పోయింది. ఇలా భావించటంలో అధమం సామాన్య

లోకజ్ఞానం ప్రేరేపక కారణమయిన సుగుణంమాత్రం ఉన్నదని మెచ్చుకోవచ్చును.

భారతదేశంలో బ్రిటిష్‌వారి రాజకీయ వ్యవహారాల్లోనూ, ప్రజా సంబంధ బాంధవ్యాలలోనూ, తాము తప్పుచేసినట్లు ఒప్పుకోటంగాని, పరిహారంగా క్షమాపణలు చెప్పుకోటంగాని ఎన్నడూ ఉండరాదన్న నీతి అంతర్గర్భితమై లిఖితం కానక్కర లేకుండానే ఉండేది. అందులో మూలసూత్రం చాలా సులభగ్రాహ్యమైనదే! భారతదేశంలో పాలకుల సంఖ్యకు పాలితుల సంఖ్యకూ గల అపార వ్యత్యాసం దృష్ట్యా బ్రిటీష్ వారికీ దేశంలో రక్షణ అంటూ ఉండాలంటే తమ కన్న బ్రిటిష్‌వారు వస్తుతః చాల గొప్పవారన్న నమ్మకంలోనే భారతీయులను అట్టేఉంచాలని బ్రిటిష్‌వారు భావించారు. అందుచేత తము తప్పుచేసినట్లుగాని తమలో నీరసగుణం ఉన్నట్లుగాని అభిప్రాయం కల్గించే పని ఏదీ తాము చేయరాదని అనుకొన్నారు. తత్ఫలితంగా భారతీయులలో "బ్రిటీష్ పరిపాలనలో 'హకీం' (ఉత్తరువు ఇచ్చే మేజిస్ట్రేటు) మారుతాడుగాని 'హుకుం' (ఉత్తరువు) మారదని" సామెత ఏర్పడి పోయింది.

ఇట్టి పరిస్థితులలో బ్రిటిష్ జాతికి మహత్తర సుగుణాలుగా గణనకు వచ్చిన సుశిక్షితత్వమూ, తదనుగుణంగా వచ్చే సంఘీభావముకూడా ఈ దేశంలో తరుచు దుర్గుణాలుగానే రూపొందుతూ వచ్చాయి. సుశిక్షితత్వాన్ని మెచ్చుకొంటూ కిప్లింగ్ ఇలా వ్రాశాడు.

* * *

The strength of the pack is the wolf and the strength of the wolf is the pack:—

Now these are the laws of the Jungle,

And many and mighty are they;

But the head and the hoof of the law and the haunch and the hump is—Obey.

ఈ నీతిని మరింత ఘాటుగా చెప్పేందుకు హిందువులను ఉదహరించి చెప్పాడు.

The heathen in his blindness bows down to wood and stone; He don't obey no orders unless they is his own; He keeps his side-arms awful; he leaves them all about; And then up comes the Regiment and pokes the heathen out.

అంతవరకూ బాగానేఉంది. కాని భారతీయ—బ్రిటిష్ సంబంధాల వద్దకు వచ్చేటప్పటికి బ్రిటిష్ వారి సుశిక్షణత్వమూ, సంఘీభావమూ, కేవలం పశుస్థాయికి దిగజారి, ఉభయుల మధ్యా ఏ సమస్య ఉత్పన్నమయినా, భారతదేశంలో బ్రిటిష్ జాతి యావన్మందీ ఒక్కటై తప్పొప్పుల ప్రసక్తి లేకుండా మొత్తం భారతీయ సంఘానికంతకూ ఎదురు తిరిగి అణిచివేయటంగా తయారయింది. స్వదేశస్థుడైన బ్రిటిష్ వాడెవడైనా, ఏం చేసినాసరే, అతనిపై నిందమోపటంగాని, ఏకాకిగా వదలివేయటంగాని ఏనాడూ జరుగరాదు. హంతకునైనాసరే అడ్డుపడి రక్షించవలసిందే. ఈ ధర్మాన్ననుసరించని వాడెవడైనాసరే జాతి ద్రోహిగా లెక్కకు రావలసిందే. అందుచేతనే కర్జన్ ప్రభువు వంటి సర్వాధికారియైన వైస్‌రాయ్ కూడా కించిద్ధర్మ బుద్ధితో ఈ సాంప్రదాయాన్ని ఉల్లంఘించినందుకు ఎన్నో అవమానాలను దిగ్రమింగవలసి వచ్చినప్పుడు అందులో వింత ఏమీ కనబడలేదు. సిమ్లాలో ఒక బీద రిక్షావాలాను ఎవరు హత్య చేశారో ఎవరూ బయల్పెట్టనందుకు ఒక బ్రిటిష్ అశ్వికదళం రెజిమెంటును శిక్షిస్తూ కర్జన్ ప్రభువు మొత్తంగా రెజిమెంటు రెజిమెంటునూ మరొక దూర ప్రాంతానికి బదిలీ చేశాడు. కాని కొన్నాళ్ల తర్వాత ఢిల్లీలో జరిగిన సైనిక ప్రదర్శన సందర్భంలో ఇదే రెజిమెంటు సైనిక విన్యాసధోరణిలో ముందుకు కదులుతూంటే అచట చేరిన బ్రిటిష్ సంఘం యావన్మందీ పురుషులూ, స్త్రీలూ, ఆబాలగోపాలమూ, ఆ రెజిమెంటును ప్రశంసిస్తూ ప్రోత్సహిస్తూ నిలచి జయ జయ ధ్వానాలు చేయసాగారు. కర్జన్ ప్రభువు కోపతాపాలతో నిరసనలతో బిగదీసుకొనిపోయినట్లు అట్టే కూర్చుండిపోయాడు.

# దురహంకారం వెనుకదాగిన మహా భయం

బ్రిటిష్—భారత సంబంధ సర్వస్వాన్ని చుట్టుకొని, బ్రిటిషర్లు కట్టుకొన్న కంచెవలె నిలచి బ్రిటిషు కావలసి అలవాటు చేసికొన్న సునిశ్చిత జాత్యహంకారం మాత్రం కరడు కట్టుకొని తొణకకుండా బెణకకుండా నిత్యం ప్రదర్శితమౌతూనే ఉండేది. బయటికి చూడటానికి ఇందులో పగుళ్లేవీ కనబడేవికావు. కాని మధ్య మధ్య వోటిమోతమాత్రం లోపలి ఖాళీని బయట పెడుతూ అడలుతూ బయట పడుతూనే ఉండేది. బ్రిటిష్ వారి దురహంకారాన్ని తిరగవేసిచూస్తే, అర్థంపర్థంలేని అతినీచభీరుత్వరూపం వంటిది కొంతగోచరించేది. భారతదేశంలోని బ్రిటిష్ సంఘాన్ని నిత్యం ఒక మహా భయం ఆవరించి ఉండేది. వారి మనః ఫలకాలనుండి ఈ భయమేనాడూ తొలగిపోలేదు. బ్రిటిష్ అధికారం భారత దేశంలో ఉచ్చ స్థాయిలో నిరాఘాటమై ఎవ్వరూ ఎదురు తిరుగలేని స్థితిలో ఉన్నప్పుడే, అంటే 19వ శతాబ్దపు చివరి పాతిక సంవత్సరాలలోనే, బ్రిటిష్ సంఘంలో ఈ భయం కూడా అంత గాఢంగానూ ఉండేది. ఇది సిపాయి తిరుగుబాటులో ఉద్భవించింది. ఆ తర్వాత ఆ భయకంపనం, నరాలనీరసం, శాశ్వతంగా భారతదేశంలోని బ్రిటిష్ వారిని పట్టుకొని పీడిస్తూనే వచ్చింది.

భారతదేశంలో ఆంగ్లేయుల ప్రతి ఒక్క అనుభవానికీకూడా అనితర సాధ్యమైన ప్రశస్త సాహిత్య రూపం కల్పించిన కిప్లింగ్ ఈ విషయాన్ని తడుమకుండా వదులుతాడని అనుకోలేముగదా. సిపాయి తిరుగుబాటుపై కిప్లింగ్'రెడ్‌డాగ్' (ఎఱ్ఱకుక్క) అనే కట్టుకథను అల్లాడు. ఆ కథలో తుదిదాకా పగదీర్చుకోటం పవిత్ర ధర్మంగా రూపొందుతుంది. ఏ తోడేళ్ల మందకూ చెందని ఏకాకి తోడేలు ఒకటి మౌగ్లీ పాదాల వద్దకువచ్చి పడుతుంది. ఒడలంతా హూనమయి గాయాలతో రూపరి పడిఉంటుంది.ఎవరు నిన్ను ఇలా చేశారంటే, ఇలా జవాబు చెప్తుంది.

"ధోళీ! దక్కన్‌నుండి వచ్చిన ధోళీ ఎఱ్ఱకుక్క, హంతకి! దక్కన్ అంతా ఖాళీ అయిందని ప్రగల్భాలు కొట్టూ దోవ పొడుగునా , అందరినీ చంపుతూ దక్షిణాదినుండి వాళ్లు ఉత్తర దేశానికి దండు వచ్చారు. క్రిందటి అమావాస్య నాటికి నాతో పాటు నా పెండ్లాం, ముగ్గురు పసికూనలు ఉన్నారు. పచ్చిక బయళ్లలో దాగి ఉండి లేళ్లను తరిమి చంపటం మొదలైన ఆరుబయళ్లలో బ్రతికే మన పద్ధతులను, నా ఆడది పసికూనలకు నేర్పేది. అర్ధరాత్రి వాళ్లు నల్గురూ దేనినో పసిగట్టి గుంపుగా వేటాడుతూన్నప్పుడు నేను విన్నా. కాని తెల్లవారి చల్లగాలి వీచే వేళకు చూస్తే గడ్డిలో కొయ్యబారి పడిఉన్న నల్గురు, అమావాస్యనాటి నల్గురు కళేబరాలను మాత్రం చూడగలిగాను. స్వేచ్ఛాజీవులారా! అంతతో ఇక నారక్తం ఉడుకెత్తి నా జన్మసిదమైన హక్కు పగ దీర్చుకోమని పరవడించింది. పసిగట్టి ధోళీని పట్టి పరిమార్చాను."

ఈవిధంగా కాబూల్‌వి గాని కాన్పూరువి గాని వార్తలు అందచేసేవారు. వేటకుక్కలు ఎన్ని ఉన్నాయన్న ప్రశ్నకు గాయపడ్డ వృకం ఇలా చెప్తుంది.

"ఏమో నాకు తెలియదు. వాటిలో మూడు మాత్రం ఇక వేటినీ చంపలేవు. కాని చివరి చివరిలో లేడిని తరిమినట్లుగా నన్ను తరిమాయి. ముందు కాళ్లమీద పారి వచ్చేటట్లు చేశాయి. చూశారా స్వేచ్ఛా జీవులారా!

కొద్దిగా తిండిపెట్టి సేద దీర్చాక తోడేలు వినయంతో అంటుంది:

"ఇంతమాత్రాన వచ్చిన నష్టంలేదు. స్వేచ్ఛా జీవులారా! నాకు కొంచెం బలం పట్టేటట్లు చేయండి. నేనూ తిరిగి చంపుతాను. అమావాస్యనాడు నిండుగాఉన్న నా నెలవు శూన్యమైపోయింది. నా రక్తరుణం ఇంకా తీరనే లేదు."

కాన్పూరును తిరిగి పట్టుకొన్నాక కర్నల్ నీల్ క్రూరాతిక్రూరంగా ఎలా పగ తీర్చుకొన్నాడో పై మాటలు విశదం చేస్తాయి. ఆ తర్వాత కథ ఇలా ముగుస్తుంది.

అన్ని అడవులూ తమ అడవులేనని తమ ముందు ఏ ప్రాణి నిలవలేదని ప్రగల్భాలు పలికిన రెండువందల వేటకుక్కల మందలోనూ, చావు కబురు చేరవేసేందుకైనా ఒక్కటి కూడా దక్కన్ చేరలేదు.

కిప్లింగ్ ఇంత ఘాటుగా వ్రాసిన ఈ ముగింపు కూడా లక్నో యుద్ధం విషయమై లార్డు రాబర్ట్సు స్వయంగా వ్రాసిన నివేదికను మించదు. "చివరికి తిరుగుబాటుదారుల నందరినీ చంపివేశాము. ఎవరో ముగ్గురు మాత్రం నగరం వైపున గోడ దూకి పారిపోయారు. ఆ నల్గురూ కూడా యుద్ధంలో ధైర్యసాహసాలతో సర్వమూ తుడిచి పెట్టివేసిన వీర శూర ప్రతాపాన్ని లోకానికి వెల్లడించేందుకు బ్రతికారని ఆశిస్తున్నాం". బ్రిటిష్ ధైర్య ప్రతాపమే, నిస్సందేహంగా!

కిప్లింగ్ చెప్పినట్లు, ఈ మారణకాండ కవిత్వ దృష్టితో ఊహించిన స్వజాతీయతా సూత్రాన్ని ప్రత్యక్షంగా ఆచరణలో ఒక ధీర శూర ప్రతాప క్రియాస్థాయికి పెంచ గలిగారని ఒప్పుకోక తప్పదు. కాని చివరికి ప్రమాద పరిస్థితి అంతా తొలగి పోయి పగదీర్చుకోటానికి చంపవలసిన అవసరం పూర్తి అయిపోయినాకకూడా బ్రిటిష్‌వారిలో ఈ భయం కేవలం అర్థహీనమేకాక, వట్టి పిరికితనంగా తయారయింది. ఆ తర్వాత భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన ముగిసేవరకూ అచటి బ్రిటిష్ సంఘం సంఘాన్ని మొత్తంగా ఈ భయం ఆవహించే ఉన్న దనేందుకు సందేహమేమీలేదు.

నేను తొలి జాతీయ ప్రభావాలనాటి ఉద్రేకాల నన్నిటినీ అధిగమించి బ్రిటిష్‌వారిలో ఈ భయానికి మూల కారణమేదో అర్థం చేసుకోగల స్థితికి ఈనాడు రాగలిగాను. తమకు తాము స్వాతంత్ర్యప్రియులుగా స్వేచ్ఛగా బ్రతికిన బ్రిటిష్ జాతికి, ఆ సాంప్రదాయ దృష్ట్యనే, అల్పసంఖ్యాకులగు తాము అధిక సంఖ్యాకులైన భారతీయులను అస్వతంత్రులను చేసి పాలించటం, అంతరాత్మనెప్పుడూ బాధిస్తూనే ఉండేది. భారతీయుల పరిస్థితిలో తాముంటే సహజంగా తిరుగుబాటుచేసే ఆత్రంలో ఉండేవారుకాన, భారతీయులు కూడా అలా తిరుగుబాటు చేయటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉంటారనే వారు భావించారు.

కాని అది ఎలా ఉన్నా, బ్రిటిష్‌వారి ఈ 'భయం' మాత్రం అతి సామాన్య శాంత పరిస్థితుల్లో కూడా భారత—బ్రిటిష్ సంబంధాలకు చాలా హానికరంగా పరిణమించింది. సైనిక రంగంలో ఈ భయంమూలానే తమ ఆత్మరక్షణ విషయం ముందు చూచుకొనే దృష్టి భారత సైన్యాలను సరిగా వినియోగించుకోటానికి కూడా పెద్ద అడ్డంకిగానే తయారయింది. ఉదాహరణకు, మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో మెసొపొటోమియా రంగంలో సైనికుల అవసరం చాలా ఎక్కువ కాజొచ్చింది. కాని స్వదేశంలో తమ పని ఏమౌతుందోనన్న భయంతో భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం, తమ సైన్యాలను తగుమాత్రంగా అచటికి పంపలేదు. అనవసరంగా పెద్ద బ్రిటిష్ సైన్యాన్ని భారతదేశంలోనే కట్టి పడవేసి ఉంచింది. దానితో మెసపొటోమియాలో పెద్ద దెబ్బ తిన్నారు. తర్వాత ఆ అపజయాన్ని గురించి పరిశీలనలు జరిపిన "మెసొపొటోమియా కమిషన్" భారతదేశంలో తమ ఆంతరంగిక భద్రతల విషయమై బ్రిటిష్‌వారి భయాలకు ఎంతమాత్రం అర్థంలేదని వ్యాఖ్యానించింది.

యుద్ధం పూర్తి అయిన తర్వాత మొదటి కొద్దిసంవత్సరాలపాటు భారతదేశంలోని బ్రిటిష్ సైనికాధికారులు, తమలో ఈ భీతాహాన్ని కొంత కొంత తగ్గించుకోగలిగారు. కాని అప్పటికీ దేశంలోని నలభైనాల్గు బ్రిటిష్ పటాలాలలో ఇరవైనాల్గింటిని తమ ఆంతరంగిక భద్రతలకోసం కీలక స్థానాలలో నిలిపి ఉంచారు. దేశంలో తమ ఆంతరంగిక భద్రత వ్యవహారాలప్పచెప్పిన పటాలాలకు 60 పౌండరు ఫిరంగులు, 6 అంగుళాల హొవిట్జర్ ఫిరంగులు ఇచ్చి మధ్యరకం ఫిరంగి దళాలుగా అట్టే ఉంచారు!

శాంతికాలాల్లో కూడా భారతదేశంలోని బ్రిటిష్ సంఘ జీవితంపై ఈ మహా భయం మేఘావృతమైన ఆకాశంవలె నిత్యం ఆవరించుకొనే ఉండేది. తత్ఫలితంగా ఇచటి సామాన్య బ్రిటిష్ పౌరులందరికీ కూడా ఆయుధం పట్టే ఈడు వచ్చేటప్పటికి స్వచ్ఛంద దళాలలో సైనికశిక్షణ నిప్పించేవారు. ఇక కల్లోల పరిస్థితి ఏమాత్రం తయారయినా ఈ భయం ఉన్మాదస్థితికి రెచ్చిపోయి ఘోరమైన హింసాకాండకు ప్రోత్సహించేది. అందుచేతనే జనరల్ డయ్యర్, అమృతసర్‌లో తన దేశసులను కొందరిని హత్యచేసి తమ దేశ స్త్రీ ఒకామెపై అఘాయిత్యాలు జరిపారని విన్నప్పుడు, కేవలం ఆ

# అర్థంకాని హిందూజాతి

చిన్న తిరుగుబాటునణిచేందుకుకాక, ఇకముందు ఎవరూ సాహసించలేనంతగా ఈ ప్రజలలో భీతావహం కల్పించే మారణకాండ సాగించటం అవసరమని నిర్ణయించాడు. జలియన్‌వాలాబాగ్‌లో నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరిపినమీదట ఒక బ్రిటిష్ సైనికుడు మహదానందంతో, చెమటలు కారుకురటూ అట్టు మిట్టాడుతూ దిక్కు తెలియక తిరుగుతున్న ఈ నల్లవారి మూకను మొత్తంగా తుపాకిగుండ్లకు ఎర చేస్తుంటే తన కెంత సంతోషం గల్గిందీ ప్రకటించ టానికి కూడా అజ్ఞాతమైన మూల కారణం ఈ భయమే.

1930 లో బెంగాలులో విప్లవవాదుల భయానకచర్యల అనంతరం బ్రిటిష్‌వారిలోని ఈ భీతావహం మరొకసారి బీభత్సరూపం దాల్చటం నేను స్వయంగా చూచాను. కలకత్తాలోనూ, బెంగాలు జిల్లాలలోనూ ఉన్న ఆంగ్లేయ సంఘం యావత్తూ భీతావహంతో నమ్మజాలనంతటి ఉన్మాద స్థితికి వచ్చేసింది. భారతదేశపు సైనిక ఖర్చులలోనే తమ పోషణకూడా సాగించుకొంటున్న ఆంగ్లమత గురువులూ, పూజారులూ, అందరూ ఉత్తర కుమార ప్రజ్ఞలతో, మాటలలో మహావీరాధివీరులైపోయారు. తలగడక్రింద పిస్తోలు లేకుండా ఒకాయన నిద్రపోయే వాడేకాదు. కలకత్తాలోని బ్రిటిష్ పత్రికా సంపాదకులు బెంగాలీ నెవరినైనా చూడవలసివస్తే మేజా కుడి చేతి సొరుగులో రహస్యంగా ఉంచిన పిస్తోలుపై చేయి ఉంచుకొనే మాట్లాడేవారు. ఆగంత కునికి ఇటూ అటూ ఇద్దరు గూర్ఖా సిపాయిలను కాపలాఉంచితప్ప అసలు లోనికే రానిచ్చేవారుకారు. ఇక ఆంగ్ల స్త్రీలు ''ట్రాం'' కారులలో ప్రయాణం చేయవలసివస్తే, ''ట్రాం'' కార్లలోనే తమకు సుఖవ్యాధులు సంక్రమిస్తవేమో నన్నంత అడలుతో సంచరించేవారు.వారిభయానికి అనుమానాలకు తగ్గట్టు ''ట్రాం''లో సీట్లలో ఎవరో వదలి వెళ్లిన జేబు రుమాళ్లు వారికి కనబడుతూండేది.

ఈ భయంతోపాటు, తమను నిత్యం ఎవరో రక్షించి బుజ్జగించాలన్న అర్థహీనపు ఆత్రం కూడా తోడయి, రెండవ ప్రపంచయుద్ధం వచ్చేటప్పటికి మరింత అసంబద్ధ వికృత రూపంలో బయటి ప్రపంచానికి కూడా ఇవి వ్యాపించాయి. మలయాపై జపాన్ దాడి చేసినప్పుడు, కలకత్తాలోని ఇంతటి నిప్పులుకక్కే బ్రిటిష్ వీరపురుష పుంగవులూ, ధీరోదాత్తులూ, అబలల కన్న కనాకష్టంగా మిన్ను ముట్టే ఆక్రందనలు సాగించారు. ఎంతటి వర్తక సంఘానికి చెందిన జాతి అయినా ఇంత దీనంగా ఆక్రోశిస్తారని నే మెన్నడూ అనుకోలేదు. తమ అజ్ఞానంవల్ల, అహంకారంవల్ల, మొండిపట్టుదల వల్ల భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ధ్వంసం చేసిన ఈ మనుష్యులే తమ అల్ప ప్రాణాల రక్షణ కన్నా అత్యవసరమైన పని ఏదీ బ్రిటన్‌కు లేదన్న భావంతో తమ రక్షణకై స్వయంగా బ్రిటన్ నుండే యుద్ధ విమానదళాలను పంపమంటూ ఆత్ర పెట్టసాగారు. యుద్ధ విమానాలను బ్రిటన్ నుండి మళ్లించ వీలులేదని బీవర్‌బ్రూక్ ప్రభువు వీరి విన్నపాన్ని మరుమాట లేకుండా నిరాకరించి నప్పుడు, ఈ అల్పులలో ఒకడు బీవర్‌బ్రూక్ ప్రభువును విమర్శిస్తుంటే నాకు భారతీయునిగా చూచినా చెప్పలేనంత అసహ్యం వేసుకొని వచ్చింది.

సహజంగా ధైర్యశాలులూ దాక్షిణ్యశీలురూ అయిన ప్రజ, ఉష్ణదేశంలో, ఏనాడైనా తమకు పరమశత్రువులుగా మారగల దేశసుల మధ్య నివసించవలసి రావటంలో ఇంతగా ఇలా మారిపోయారు. ఆంగ్లేయులలో అత్యంత శ్రేష్ఠు లయిన వారు కూడా ఈ దేశంలో ఉండటంలో కొద్దో గొప్పో సహజసద్గుణ ప్రకృతిని కోల్పోకుండా తప్పించుకోలేకపోయారు. ఇక సాంస్కృతికరంగంలో కూడా దాదాపు ఇంతటి వికారమూ ఏర్పడింది. పాలకజాతి పాలితజాతితో తమ ఉన్నత సంస్కృతిని పంచుకోరాదన్న విపరీతభావం దీనికి మూలమయింది. స్వసంస్కృతిని ప్రచారంచేసుకొని ఎక్కువ మందిని తనలో చేర్చుకోకుండా ఏనాడూ ఏ సామ్రాజ్యమూ విజయవంతం కాలేదు. పూర్వ కాలంలో రోమన్లు ఈ విషయం గ్రహించారు. ఈనాడు రష్యన్‌లు గ్రహిస్తున్నారు. కాని భారత దేశంలో బ్రిటిష్‌వారు మాత్రం ఇందుకు ఎంతో అయిష్టతను చూపుతూ వచ్చారు. భారతీయుల మైన మేము ఆంగ్లభాష నలవర్చుకొని వ్రాయటం గాని, పాశ్చాత్య సంస్కృతిని జీర్ణించుకోటంగాని అథవా రాజకీయవిధానమాత్రంగా వాంఛనీయమని ఆమోదించి హర్షించిన ఆంగ్లేయుడు ఒక్కడు

కూడా భారతదేశంలో లేడు. భారతీయులు తమను అనుకరిస్తే తమ సంస్కృతి మైలపడి భ్రష్టమయి పోతుందేమోనన్న భావం వారి కుండేది. బేథూనీవంటి ఉదారుడైన ఆంగ్లేయుడుకూడా ఆంగ్లంలో రచన సాగించిన ఒక బెంగాలీ రచయితకు, బెంగాలీభాషకు మళ్లిపొమ్మని హితవు చెప్పాడు. అయితే దీని ఫలితంగా ఆధునిక వంగ కవిత్వం ఉద్భవించినమాట నిజమేకాని అది భారతదేశంలోని బ్రిటిష్ సామ్రాజ్యానికి ప్రయోజనకారి కాజాలక పోయింది.

సాంస్కృతికంగా ఇట్టి సాంకర్యాన్ని అంత గర్హితంగానూ ఒక్కొక్కప్పుడు బాహాటంగానూ ఖండించిన పద్ధతి చూస్తే నాకు రామాయణంలోని ఒక కథ జ్ఞాపకానికి వస్తుంది. ఒకనాడు ఒక బ్రాహ్మణుని కుమారుడు అకస్మాత్తుగా చనిపోయినట్లు శ్రీరాముడికి వార్త తెలిసింది. ఇట్టి దుస్సంఘటనకు వారికి ఒక్కటే కారణం గోచరించింది. ఎక్కడో ఏదో పాపకార్యం ఒకటి జరిగి ఉండాలి. అదేమో కనుగొనేందుకు రాముడే బయలుదేరాడు. శంబుకుడను శూద్రుడు, కేవలం ద్విజులైన ఆర్యులు మాత్రమే అనుష్ఠించవలసిన తపశ్చర్యకు ఉపక్రమించాడు. వెంటనే రాముడు అతని తల నరికివేశాడు. బ్రాహ్మణ బాలునికి ప్రాణం వచ్చి లేచాడు.ఆర్య సంస్కృతిని రక్షించినందుకు దేవతలంతా రాముని కీర్తించి పుష్పవర్షం కురిపించారు.

రామాయణంలో ఆ కథ ఈ రీతిగా ఉంది. తర్వాత 8 వ శతాబ్దంలో భవభూతి ఈ ఘట్టాన్ని వర్ణించేటప్పటికి ఆర్యమతవర్ణాశ్రమధర్మసాంప్రదాయాలు కొంత సడలి, అధమం ఈ సంఘటనకు జాలి పడగల పరిస్థితి ఏర్పడింది. తద్దీత్యా భవభూతి "ఉత్తరరామచరిత" నాటకంలో, ఇంతటి ఘోరకృత్యానికి పాల్పడవలసివచ్చినందుకు రాముడు కొంత పశ్చాత్తాపపడినట్లు చూపిస్తాడు. అమాయకురాలైన పత్నిని, ప్రజల సంతృప్తి పరిచేందుకై అడవులకు పంపిన రాజుకు జాలిపడగల హక్కే లేదని అంటూ రాముడు కొంత మన స్థిమితం చేకూర్చుకొనచూస్తాడు. కాని అటు శూద్రుడు శంబుకుడు మాత్రం "రాముడే తనను స్వయంగా చంపటానికి రావటంకన్నా తన భక్తికి పరమ ప్రయోజనం వేరేమీ లేదని సంతోషంతో అనేటట్లు చేస్తాడు. ఆర్యునిచే నిహతుడై ఆర్యసంఘాన్ని రక్షించేందుకు తన ప్రాణాన్ని బలి ఇచ్చిన కారణంగా ఆ శూద్రుడు అలా స్వర్గానికి వెళ్తాడు.

భారతదేశంలోని ఆంగ్లేయులలో చాలామంది ఆంగ్లభాష, ఆంగ్లసాహిత్యంపట్ల మాకుగల శ్రద్ధాసక్తులకు మమ్మల్ని అలాగే స్వర్గానికి పంపనిచ్చగించేవారేననీ, ఆంగ్లభాష నేర్చిన బెంగాలీ బాబులెందరెందరుంటే అందరికీ ఒక్కొక్కనికి ఒక్కొక్క ఆంగ్లేయ బాలుడు, అపమృత్యువుపాలు గాకపోయినా, అథవా నల్లగా పుట్టాడని కొందరైనా అనుకొని ఉంటారని నాకు తెలుసును.

కాని అన్నిటికన్నా అసంభవమనిపించేది, అయినా కొంచెం తరచిచూస్తే అతి సహజంగానే కనిపించేది, మరొక మార్పు బ్రిటిష్ తత్వంలో సంభవించింది. ఆంగ్లేయుడు వస్తుతః అత్యంత దృఢచిత్తుడూ, గంభీరుడుగా ఉంటూనే ఆ కాఠిన్యాన్ని సుగుణంగా మార్చే మరొక విశిష్ట గుణం—దీన దయాళుత్వం కల్గిఉండటం మహత్తరశీలవిశేషంగా భాసించేది. కాని పూర్వం మా దేశస్థులపట్ల బ్రిటిష్‌వారి వ్యవహారం భరించజాలనంత నిర్దాక్షిణ్యంతో క్రూరమయి ఉండేదని నిందించేవాళ్లం. నిజానికి జాతిగా ఇది వారిలక్షణం కానేకాదు. సహజ దాక్షిణ్య స్వభావాన్ని వారు కోల్పోలేదు కాని ఈ ఉష్ణదేశానికి వచ్చేటప్పటికి ఆ తమ దాక్షిణ్యానికి గూడా వికృత రూపమే అలవరింప చేశారు. ఇందులో ఒక రకపు వికారాన్ని ఈ. యం. ఫాస్టర్ తన "ఎ పాసేజి టు ఇండియా"లో వెళ్లబోసుకున్నాడు. ఆ పుస్తకం మొత్తం అంతా వడగట్టి చూచుకొంటే అందులో చెప్పే నీతి సారాంశం ఒక్కటే కనబడుతుంది. "భారతీయుడు ఎంతటి అస్తవ్యస్త స్వభావుడైనా, ఎంతగా ఆంగ్లేయుల కోపోద్రేకాలను రెచ్చగొట్టే అవ్యక్తుడైనా తాను క్రైస్తవ సజ్జనుడనన్న విషయం ఆంగ్లేయుడు మరచి పోరాదు".భారత బ్రిటిష్ స్నేహ సంబంధాలు పెంపొందేందుకు ఈయన సిద్ధాంతం చూస్తే నాకు నిత్యం టి. గిస్బర్న్ వ్రాసిన పద్యం జ్ఞాపకం వస్తూంటుంది.

"దిక్కులేని ఆ పుర్వుగుని కాలరాచి చంపాలని ఆత్రపడే పాదాన్ని వెంటనే మళ్లించు. నీ చూపులకు అసహ్యంగా కనబడే ఆ కీటకరూపం సృష్టించటానికి కూడా ఒక భగవంతుడు అవసరమయాడు."

(సశేషం)

# యుద్ధక్రమం

క్రచ్‌కి ముందే ఇది అంతా ప్రారంభమైనట్లుతోస్తుంది. కొన్ని ఏళ్ళుగా పాకిస్తాన్ ''జీహాద్''ను గురించి మాట్లాడుతున్నది. కాశ్మీర్‌కోసం యీ 'జీహాద్' లేక 'మతయుద్ధం' తప్పదంటూ వస్తున్నది. ఇటీవల అల్జీరియా పద్ధతి గెరిల్లా యుద్ధాన్ని గురించి, చైనా పద్ధతి రాజకీయ—సైనిక ఉపాయాలను గురించి అధ్యయనం చేయడం, వాటిని అవలంబించి ఏదో చేస్తాననడం గూడా ప్రారంభమైంది. ఆ తర్వాత నుంచీ రజాకార్లకు శిక్షణ, ముజహీదులకు తరిఫీదు అరంభం అయినాయి. 1963 లో కాశ్మీర్‌లో యుద్ధ విరమణ సరిహద్దులను 448 సార్లు, 1964 లో 1522 సార్లు, 1965 లో ఏడు నెలల కాలంలో 1800 సార్లు పాకిస్తాన్ ఉల్లంఘించింది.

అయితే ఇది అంతా ఒక ఎత్తు. మొన్న ఏప్రిల్‌లో కచ్ మీదకు సేనలను నడిపించడం ఇంకో ఎత్తు. ఈ చర్య మూలంగా పాకిస్తాన్ భారత్‌ను యుద్ధానికి సవాలు చేసినట్లయిపోయింది. భారత్‌తో కూటజూదం ప్రారంభంచేసి మొదటి పాచికను విసిరింది. ఆ పాచిక పారలేదు. ఆ జూదం సాగలేదు. అందువల్ల కాశ్మీర్ సమస్య రచ్చకు రాలేదు. అప్పుడు ఏమి చెయ్యాలి? పాకిస్తాన్ ఇంకో ఎత్తువేసింది. శ్రీనగర్ నుంచి లధక్ రాజధాని ''లే'' దాకా ఒక రోడ్డు వుంది. అది భారత్‌కు ప్రాణం వంటిది. లధక్‌కు అది తప్ప వేరే మార్గం లేదు. ఆ మార్గాన్ని దెబ్బ తీద్దామని పాకిస్తాన్ తలపెట్టింది. అందుకోసం కార్గిల్ దగ్గర విపరీతాన్ని కొనసాగించింది. ఆ విపరీతతమూ సాగలేదు. మే 16 న భారత సైన్యం ఎదురు దెబ్బ తీసి కార్గిల్‌కు ఎదురుగా అవతల ఆక్రమిత ప్రాంతంలో వున్న రెండు పాకిస్తానీ చౌకీలను ఆక్రమించుకొన్నది. అప్పుడు సమితి ముందుకువచ్చి పరిస్థితిని చక్కబరచింది. తనకు కాశ్మీర్‌లో సైనిక పరిశీలకులు ఉన్నారు. వారు యీ ప్రధాన రంగంలో అప్రమత్తులై పర్యవేక్షణ సాగిస్తూ ఉంటారని సమితి భారత్‌కు హామీ ఇచ్చింది. అప్పుడు భారత్ సైన్యాలు తాము అంతకుముందు పట్టుకున్న పాకిస్తాన్ చౌకీలను రెంటిని వదిలి ఇవతలికి వచ్చివేశాయి.

1965 జూన్ 30 వ తేదీనాడు కచ్—సింధు సరిహద్దు ఒప్పందంపై భారత్ పాకిస్తాన్‌లు సంతకాలు చేశాయి. ఆ ఒప్పందంకుదరడంవల్ల ఏ రకమైన ఉద్రేకోపశమనం సంభవం కావచ్చునని, ఆ ఒప్పందపు పీఠికలో ఆశించబడినదో, ఆ ఉపశమన స్థితి ఇక్కడ కుదిరి రాలేదు. పాకిస్తాన్ ఆలోచనాపద్ధతి ఇంకొక విధంగా ఉండిపోయింది.

పాకిస్తాన్ ఆలోచనలు, పథకాలు ఏమిటో తెలియడం కష్టంకాదు. అందుకు సంబంధించిన పత్రాలు పట్టుబడినాయి. వాటివలన పాకిస్తాన్ ఏమి తలపెట్టినది తెలుస్తూనేవుంది. సెప్టెంబరు 7 న పాకిస్తాన్ తాలూకు ''కాంబెర్రా'' విమానం పడకొట్టబడింది. ఆ విమానం పైలట్ దగ్గర 'డైరీ' అంటూ వుంది. అది అతనిది. అయితేఏమి? అందులో కొన్ని ముఖ్య విషయాలు ఉన్నాయి. ఆ విషయాలు 1965 ఏప్రిల్ 20కి సంబంధించినవి. అతను ఏమి చెయ్యాలో ఆ విషయాలు చెబుతున్నాయి. భారతదేశంలో జామ్‌నగర్, ఆదామ్‌పూర్, హల్వారా, అంబాలా, పాలం, ఆగ్రా, భుజ్ మొదలైన విమానాశ్రయాలు, స్థావరాలు ఉన్నాయి. వాటిమీద దాడి చేయడానికి పాకిస్తాన్ వైమానికునికులకు ఇచ్చిన ''తరిఫీదు'' వ్యవహారం ఆ డెయిరీలోని విషయాలలోవుంది. ఆ డెయిరీలో కొన్నిచోట్ల ''టిక్''మార్కులు ఉన్నాయి. ఆ ''మార్కు''లవలన ఆ వైమానికుడు తన విమానంతో పైన పేర్కొనని విమానస్థావరాల సంగతి చూచుకు వచ్చినట్లు విదితం అవుతున్నది.

1965 జూన్‌లో పాకిస్తాన్ అధ్యక్షుడు ఒక 'ఆర్డినెన్సు' జారీ చేశారు. అందులో ''ముజహీద్'' బలం అవతరణకు సంబంధించిన సంగతివుంది. ఆ 'ఆర్డినెన్సు' జూన్ 11 వ తేదీన జారీ చేయబడింది.

హాజీపీర్ కనుమ భారత సేనల వశమైంది. ఆ కనుమ దిగవను ''కహూటా'' అన్న వూరువుంది. అక్కడి పాఠశాలలో ఇంకో పత్రం దొరికింది. అది ఒక ఉత్తర్వు. 1965 జూన్ 15 న జారీ అయింది. అందులోవున్న విషయం ఇది. 15 సంవత్సరాలు పైబడిన అందరు బాలురకు సైనిక శిక్షణ విధి—అని. అది తప్పదు—అని.

''కహూటా'' లోనే మరో పత్రం లభ్యమైంది. అందులో వున్న విషయం ఇంకొకటి. పాకిస్తాన్ ఆక్రమణలో కొంత కాశ్మీర్‌వున్నదికదా. ఆ కాశ్మీర్‌లో సాంకేతిక నైపుణ్యం గలవారంతా తమ పేర్లను రిజిష్టరు చేసుకోవాలి. డ్రైవర్లు, ఎలక్ట్రీషియన్‌లు, వడ్రంగులు మొదలైన లఘుసాంకేతికులు కూడా తప్పించుకునేందుకు వీలులేదు. ''సాంకేతికులు అందరు తమ పేర్లు నమోదు చేయించుకు తీరవలసిందే'' నని ఆ ఉత్తర్వులో ఉంది.

ఆ జూన్ నెలలోనే మరో రెండు ఆర్డినెన్సులు జారీ అయినాయి. పూర్వం యుద్ధంలో పని చేసినవాళ్ళు వుంటారు. రిజర్విష్టులు. ఏ క్షణంలోనైనా సైన్యంలో చేరాలని వారికి కబురు అందవచ్చునని ఒక 'ఆర్డినెన్సు' లో వుంది. ఇటువంటి వాళ్ళు ఎక్కడో పని చేసుకుంటూ ఉండవచ్చు. అందువల్ల ప్రభుత్వం పిలుపు అంటూ రాగానే వారిని వదిలి పెట్టాలని యజమానులను శాసిస్తూ వున్నది ఇంకో ఆర్డినెన్సు.

కాశ్మీర్‌లో దుండగులు ప్రవేశించారు. వారిలో కొందరు పట్టుపడ్డారు. ఆ పట్టుబడినవారిని ప్రశ్నించినమీదట కొన్ని విషయాలు తేలాయి. అవి ఇవి:

కాశ్మీర్‌లో ప్రవేశించిన దుండగులు లేక ''ముజహీదు''లకు 1965 మే 26 నుంచీ శిక్షణ ప్రారంభం అయింది.

పాకిస్తాన్ సైన్యం తాలూకు మలిక్ 12వ డివిజను సేనాని మేజర్ జనరల్ అఖ్తార్ హుస్సేన్ మలిక్ పర్యవేక్షణలో వారికి యీశిక్షణ కరపబడింది. ఆయన ప్రధాన కార్యాలయం ''ముర్రే'' అనే చోట. ఈ 'ముజహీదు'లకు శిక్షణ ఇచ్చేందుకు నాల్గు చోట్ల శిబిరాలు ఏర్పాటు చేయబడినాయి. ముజహీదులను ఎనిమిది భాగాలుచేసి శిక్షణ ఇచ్చారు. మొత్తం ''ముజహీదు'' బలాన్ని ''జిబ్రాల్టర్ బలం'' అన్నారు. ఒక్కొక్క ముజహీద్ సైనిక విభాగంలోను ఆరేసి ''కంపెనీ''లు ఉన్నాయి. ఒక్కొక్క ''కంపెనీలో'' 110 మంది చొప్పున ముజహీదులు ఉన్నారు. ప్రతి కంపెనీకి ఒక పేరు వుంది. ఖలీద్, ఖిల్జీ, సలాహుద్దీన్, కాశిం, గుజ్నవి, బా బ ర్—ఇట్లా. ఇంకో విషయం ఏమిటంటే, ఇందులో ప్రతి ఒక్క కంపెనీ పైనా ఒక పాకిస్తానీ సైనికాధికారిని అధికారిగా పెట్టారు. ఆ అధికారి మేజరు హోదా గలవాడో, కెప్టెన్ హోదా గలవాడో. అంతకు తక్కువ హోదాగలవానిని ఆ అధికారంలో పెట్టలేదు.

ఇట్లా యీ ముజహీదులకు ఆరువారాలపాటు గట్టి శిక్షణ ఇచ్చారు. అప్పుడు వారిని కార్యాచరణకు సిద్ధం చేశారు. జులై రెండవ వారంలో ఈ ముజహీదు బలం అధిపతుల సమావేశం ముర్రేలో జరిగింది. పాకిస్తాన్ అధ్యక్షుడు శ్రీ అయూబ్‌ఖాన్ ఆ సమావేశంలో మాట్లాడారు.

బహుశా జులై నెలలోనే కొంతమంది పాకిస్తాన్ దుండగులు ''పర్యవేక్షణ''కు గాను యుద్ధ విరమణ సరిహద్దులను దాటివుంటారు. అయితే ఆగష్టు 1 వ తేదీన మేజర్ జనరల్ అఖ్తార్ హుస్సేమలిక్ 'కోట్లా'లో ముజహీద్‌సైన్యం తాలూకు అన్ని కంపెనీల అధిపతులను కలుసుకున్నారు. బహుశా ఆ రోజునే దుండగుల 'కాశ్మీర్ ప్రవేశ' కార్యక్రమం ప్రారంభం అయివుంటుంది.

ఈ దుండగులు యుద్ధవిరమణ సరిహద్దును పర్వతాల మీదుగా, అడవుల మార్గాన అతిక్రమిస్తూ వచ్చారు. చీకటిని చాటు చేసుకొని సరిహద్దులను దాటుతూ వచ్చారు. ఒక్క చోటననికాదు అనేకచోట్ల ఆ యుద్ధవిరమణ సరిహద్దులలో ఇట్లా జరిగింది. ఈవిధంగా జమ్మూ—కాశ్మీర్‌పై పాకిస్తాన్ రెండవ దండయాత్ర ప్రారంభమైంది.

ఆగస్టు 4 న జరిగిన సంగతి. మహమ్మద్ దీన్ కుర్రవాడు. గొర్రెలను మేపుకుంటున్నాడు. అది గుల్‌మార్గ్ ప్రాంతంలో. 'దరకాసి' అనేచోట. ఇది ఊరి-పూంచ్ వంపుకు తూర్పుగావుంది. అక్కడ ఒక బీడులో అతను గొర్రెలను మేపుకుంటూ ఉండగా అక్కడికి ఇద్దరు మనుష్యులు వచ్చారు. ఆకుపచ్చని దుస్తులు ధరించి వున్నారు. ఆ దుస్తులు సల్వార్—కమీజు దుస్తులు. వాళ్ల ఆయుధాలు ధరించివున్నారు. ఆ ఇద్దరు మహమ్మద్ దీన్‌ను తమ విడిదికి లేక శిబిరానికి తీసుకుపోయారు. అక్కడ వారి నాయకుడు వున్నాడు. అతనితో పరిచయం చేశారు. ఆ నాయకుడు మహమ్మద్ దీన్‌ను ఒక్క విషయం అర్థించాడు—తమకు దారి చూపెట్టవలసిందని;సంగతిసందర్భాలు చెప్పవలసిందని. ఇది చెప్పి ఆ 'నాయకుడు' ఆ కుర్రవాని చేతిలో 400 రూపాయలు పెట్టాడు. ఎక్కడ ఆహార ధాన్యాల గిడ్డంగులు ఉన్నాయి; ఎక్కడ, ఎక్కడ రవాణా 'డిపో'లు ఉన్నాయి-మొదలైన విషయాలతో తన దగ్గరకు తిరిగి రావాలి అన్నాడు. ఆ దుండగులకు ఆహారం—అవీ—కావాలికదా! ఎక్కడికైనా పోయేందుకు రవాణా జరుగుబాటు అవసరంకదా! అందుచేత ఆ సౌకర్యాల సంగతి కూడా చూడమని చెప్పాడు.

అక్కడ, తన్ను ఆ యిద్దరు తీసుకుపోయిన చోటున ఎంతోమంది ఉన్నారు. అందరి దగ్గరా, ఆయుధాలు ఉన్నాయి. తాను ఎరిగినవాళ్లుకాదు. అంతా ''బయటివాళ్లు.'' అప్పుడు మహమ్మద్ దీన్ ఏమి చేశాడు? మహమ్మద్ దీన్ ''తన్‌మార్గ్'' కు వెళ్లాడు. అక్కడ పోలీసు ఠాణా వుంది. పోలీసులకు ఈ జరిగిన సంగతి అంతా అతను చెప్పాడు.

అక్కడికి దక్షిణంగా 40 మైళ్లదూరంలో ''గలూటి'' అనే గ్రామంవద్ద వజీర్ మొహమ్మద్ అనే అతనికి గూడా ఇటువంటి అనుభవమే—తటస్థమైంది. మహమ్మద్ దీన్‌కు కన్పించినట్లే అతనికి కూడా సాయుధులైన మనుష్యులు కన్పించారు. ఆ ''గులూటి' గ్రామం మెంధార్ రంగంలోవుంది. అక్కడ ఆ గ్రామం సమీపంలో అడవిలో ఈ ''సాయుధులు'' అతనికి తారసిల్లారు. అతను కూడా వెంటనే అధికారులకు ఆ సంగతి తెలియజేశాడు. ఇతను పోలీసులతోగాక భారత సైన్యం తాలూకు గస్తీలకు చెప్పాడు.

ఈ రెండు సంఘటనలూ ఒక్క రోజునే జరిగాయి. రెండు చోట్లనుంచి శ్రీనగర్‌కు కబుర్లు వెళ్లాయి. అక్కడినుంచీ కాశ్మీర్‌లో దుండగులవేట ప్రారంభమైంది.

ఆ తర్వాత అంతా త్వరిత గతిని జరిగిపోయింది. దుండగులతో ఆ రాత్రే పోరాటాలు ప్రారంభమైనాయి. ఇది ఎట్లా జరిగిందా అని ఆ దుండగులు ఆశ్చర్యపోయినారు. ధైర్యభ్రష్టులైనారు. అయినా పోరు ఇచ్చారు. అప్పుడు, ఆ తర్వాత జరిగిన సంఘర్షణలను జనరల్ నిమ్మో సమితి కార్యదర్శికి సమర్పించిన నివేదికలలో ఉదహరించారు. యుద్ధ విరమణ సరిహద్దులను ముజాహీద్ దుండగులు ఏకమొత్తంగా అతిక్రమించడానికి సంబంధించిన కథ అంతా ఆ నివేదికల్లో వుంది. పాకిస్తాన్ సైనికులు ముజహీద్‌లు కూడా యుద్ధవిరమణసరిహద్దులను అతిక్రమించారు. వారి బలం సామాన్యమైనదిగాలేదు. పాకిస్తాన్ ఆర్డినెన్సు ఫ్యాక్టరీలలో ఉత్పత్తి అయిన ఆయుధాలు, ఇంకా ఇతర సామగ్రులు వారివద్ద ఉన్నాయి. బారాముూలారంగంలో ఆగస్టు 7, 8 తేదీలలో జరిగిన సంఘటనలను సమీక్షిస్తూ జనరల్ నిమ్మో తమ నివేదికలో ఇట్లా పేర్కొన్నారు. ''ఈ సంఘటనలలో పట్టుబడిన ఒకనిని సమితి సైనిక పర్యవేక్షకులు ప్రశ్న చేశారు. అతను తాను ''ఆజాద్'' కాశ్మీర్ పదాతి బలానికి చెందిన 16 వ పటాలం తాలూకు సైనికుణ్ణి అని సమాధానం ఇచ్చాడు. ఈ దాడి సాగించిన తన బృందంలో 300 మందిద్దాకా సైనికులు, 100 మంది ''ముజహీదులు'' ఉన్నారని చెప్పాడు''

ఆ ఆగష్టు 7, 8 తేదీలలోనే పూంచ్ రంగంలో కూడా ఇటువంటి సంఘటనలు జరిగాయి. ఈ జరిగిన పోరాటాల సంగతిని సమితి పర్యవేక్షకులు నిర్ధారణ చేశారు. జనరల్ నిమ్మో

నివేదికలో ఈ సంగతి కూడా వుంది. "పూంచ్ రంగంలో జరిగిన దాడిలో దాదాపు వెయ్యిమందికిపైగా దుండగులు పాల్గొన్నారు. లభిస్తున్న సాక్ష్యాన్నిబట్టి యీ వచ్చిన దుండగులలో కొందరు యుద్ధ విరమణ సరిహద్దులకు ఆవలనుంచి వచ్చి ఉండవచ్చునని నిర్ధారణ అవుతున్నది."

ఇట్లా సమితి పాకిస్తాన్ నేరాన్ని ధృవపరచింది.

జమ్మూ—కాశ్మీర్‌లో ముందు ప్రవేశించిన దుండగీండ్రు కాలికి బుద్ధి చెప్పి 'పారకా' చూస్తూ ఉండగా, యుద్ధ విరమణసరిహద్దుల ఆవలనుంచి కొత్తదుండగులు తరంగాలుగా ఈ యుద్ధ విరమణ సరిహద్దులను అతిక్రమించడం మొదలుపెట్టారు. యుద్ధ విరమణ సరిహద్దుల పొడుగునా, పాకిస్తాన్ సైన్యాలు నిల్చి ఉన్నాయి. ఆ సైన్యాలు భారత దేశం చౌకీలమీద, స్థావరాలమీద నిరంతరం కాల్పులు కొనసాగిస్తూ వచ్చాయి. ఆ కాల్పులు అంతులేకుండా అజస్రంగా సాగాయి. ఇది అంతా ఒక అందుకు సాగుతూ వచ్చింది. ఈ కాల్పులతో భారతసైన్యం కదిలేందుకు వీలు ఉండదు. జమ్మూ కాశ్మీర్‌లో యుద్ధ విరమణ సరిహద్దులను అతిక్రమించి ప్రవేశిస్తున్న దుండగులను గూర్చి తెలుసుకునేందుకు, వారి పని పట్టేందుకు వీలు ఉండదు. ఈ యెత్తు పారలేదు. అది పని చేయలేదు. భారతదేశపు పోలీసు బలము, సైన్యము గూడా సర్వ ముఖ్య స్థానాలను సంరక్షించుకుంటూ వచ్చాయి. రవాణా మార్గాలకు రక్షణ చేకూర్చాయి. యుగపత్తుగా దుండగుల పని పట్టడం మొదలు పెట్టాయి. ఈ గాలింపు, ఈ అన్వేషణ, యీవేట కాశ్మీర్ లోయనుండి, శ్రీనగర్—జమ్మూ రోడ్డు మీదుగా యుద్ధ విరమణ సరిహద్దుల దాకా కొనసాగింది.

పాకిస్తాన్ తల పెట్టిన యీ "కాశ్మీర్ ప్రవేశకార్యాచరణం" ఇట్లా వృధా అయి పోవడానికి ప్రధానమైన కారణం ఒక్కటే వుంది. స్థానిక ప్రజలు ఎవ్వరూ పాకిస్తాన్ అనుకున్నట్లు నడవలేదు. ఆ వచ్చిన దుండగుల ముఖం చూచినవాడే ఆ ప్రజలలో లేడు. భారతదేశంనుంచి 'విముక్తి' ఎప్పుడు పొందుతామా అని ఆ జనం తహతహలాడుతున్నట్లు, తాము ఇట్లా జమ్మూ—కాశ్మీర్‌లో ప్రవేశించగానే అక్కడ అట్లా కొంపలు అంటుకు పోగలవన్నట్లు పాకిస్తాన్ భావించింది. కాశ్మీర్‌లో ఆ తహతహ ఎక్కడాలేదు. పాకిస్తాన్ అనుకున్నట్లు కొంపలు అంటుకుపోనూలేదు. తాను ఏమి జరుగుతుందని అనుకున్నదో అది జరగనూలేదు. పాకిస్తాన్ పెట్టుకున్న ఆశ నిరాశ అయిపోయింది.

తాను ఏమి చేసినా భారతదేశం నోరుమూసుకు పడిఉంటుందన్న దుర్భ్రమ పాకిస్తాన్‌లో ప్రబలిపోయింది. భారతదేశం ఎదురు పోరాటం సాగించదు అని పాకిస్తాన్ అనుకుంది. అది దుర్భ్రమ అని తేలిపోయింది.

ఇక్కడ ఇంకోటి జరిగింది. పాకిస్తాన్ వేసిన పెద్ద ఎత్తు సరిగ్గా పారకముందే—అంటే తాను పెట్టుకున్న 'డి' దినం ఇంకా నాల్గు రోజులు ఉన్నదనగానే—దుండగుల కథ, పాకిస్తాన్ బండారం—అన్నీ బయటపడిపోయినాయి. అందువల్ల ఈ దుండగుల ద్వారా సాధించాలని పాకిస్తాన్ వేసుకున్న ఎత్తులన్నీ నేలమట్టం అయినాయి.

పాకిస్తాన్ వేసుకున్న పథకం ఇది. ఆగస్టు 1–5 తారీఖుల మధ్య చిన్న చిన్న ముఠాలుగా దుండగులను ముందుగా తాను ఎంచి పెట్టుకున్న స్థానాలలో సమీకరించడం; తర్వాత ఆ ముఠాలను కాశ్మీర్ లోయలో ప్రవేశపెట్టడం; అప్పుడు జమ్మూ—శ్రీనగర్ రోడ్డును అటకాయించడం. ప్రతి సంవత్సరం ఆగష్టు ఎనిమిదవతేదీరోజున శ్రీనగర్‌లో పీర్‌దస్తగిరి సాహెబ్ 'ఉర్సు' జరుగుతుంది. ఆ 'ఉర్సు'కు అశేషజనం వచ్చి పడుతూ ఉంటారు. పాకిస్తాన్‌నుంచి లోయలో ప్రవేశించిన దుండగులు ఈ యాత్ర చేసే జనంలోచేరి ఇంకొకంటికి తెలియకుండా శ్రీనగర్‌లో ప్రవేశించవలసివుంది. ఆగష్టు 9 న షేక్ అబ్దుల్లా అరెస్టు తాలూకు వార్షికోత్సవం ఏర్పాటైవుంది. ఆరోజున తాను యీ దుండగులచేత ఏమి చేయించాలో అది అంతా పాకిస్తాన్ చేయించదలచుకున్నది. ఆ ఆగష్టు 9 ని "డి" దినంగా నిర్ణయించుకున్నది. కాశ్మీర్ ప్లెబిసైట్ ఫ్రంట్, కార్యాచరణసంఘం పెద్ద ప్రదర్శనలు తలపెట్టాయి. పాకిస్తాన్ దుండగులు ఆ పూరేగింపులో చేరాలి. అంతా సాయుధులు. కాశ్మీర్ "తిరుగుబాటు" ను తెచ్చిపెట్టాలి. ఈ తిరుగుబాటు పద్ధతి కూడా ముందుగానే నిర్ణయం అయివుంది. దుండగులు శ్రీనగర్ రేడియోస్టేషన్‌ను పట్టుకుంటారు. విమానాశ్రయాన్ని వశపరచుకుంటారు. ఇంకా ముఖ్యమైన స్థానాలను తమ చేతుల్లోకి తెచ్చుకుంటారు. ఇది ఇట్లా జరుగుతూ వుండగా, అక్కడికి దక్షిణంగా, యీశాన్యంగా మరికొంత మంది దుండగులు జమ్మూ—శ్రీనగర్ రోడ్డును అటకాయిస్తారు. దాన్ని విచ్ఛేదం చేస్తారు. శ్రీనగర్—కార్గిల్ రోడ్డును పట్టుకుంటారు. అప్పుడు భారత సైన్యానికి అదనపుసహాయాన్ని దూకించడానికివున్న వీళ్లులన్నీ అష్టదిగ్బంధం అయిపోతాయి. ఇది అంతా జరిగితే, అప్పుడు పాకిస్తాన్ కాశ్మీర్‌లో ఒక "విప్లవ మండలి"ని ఏర్పాటు చేద్దామనుకున్నది. కార్యాచరణ సంఘము, ప్లెబిసైట్ ఫ్రంటులలో అందుకు మనుష్యులు లభించవచ్చు. వారిని కూడా కలుపుకొని యీ "విప్లవ మండలి"ని ఏర్పాటు చెయ్యాలని పాకిస్తాన్ సంకల్పం. అప్పుడు ఆ "మండలి"ని చట్టవిహితమైన ప్రభుత్వంగా ప్రకటించవచ్చు. ప్రజలుయొక్క ఇచ్ఛాశక్తికి యీ ప్రభుత్వమే ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు చెప్పవచ్చు. ఈ ప్రభుత్వాన్ని గుర్తించాలని ఆ దేశాన్ని, యీ దేశాన్ని, అన్ని దేశాలను కోరవచ్చు. ఇట్లా ముఖ్యంగా యీ రకమైన విజ్ఞప్తి పాకిస్తాన్ చెవులలో పడుతుంది. పాకిస్తాన్‌ను ఆ విప్లవ మండలి ప్రభుత్వంసహాయం చెయ్యవలసిందిగా కోరుతుంది. ఇంకా ఏమి కావాలి? అప్పుడు పాకిస్తాన్ తన సైన్యాలు యుద్ధ విరమణ సరిహద్దులమీదుగా కాశ్మీర్‌లోనికి ఉరికిస్తుంది. ఒక 'మిత్ర' ప్రాంతపు ప్రభుత్వం తన్ను యీ సహాయంకోసం అర్థిస్తున్నది. ఆ ప్రభుత్వాన్ని తాను, పాకిస్తాన్, ఆదుకొనడం కన్నా ఘనకార్యం ఏమి ఉన్నది? ఇట్లా కాశ్మీర్‌పై పాకిస్తాన్

తన దండయాత్రను ప్రారంభం చేయాలని, అవసరమైతే భారత భద్రతా బలాలతో పోరాటం సాగించాలని సంకల్పించింది.

ఆగష్టు 9 వ తేదీనాడు యీ రకంగా అవతరిస్తుందని పాకిస్తాన్ ఆశపెట్టుకొనివున్న ''విప్లవమండలి'' యొక్క ''విముక్తి యుద్ధ ప్రఖ్యాపనం'' గూడా ఎప్పుడో తయారై పోయి వుంది. అది విచిత్రమైన పత్రం. తాను చేసిన ఈ ఎత్తు అంతా చిత్తు అయిపోయినఅనంతరం పాకిస్తాన్ ఆ ''ప్రఖ్యాపనాన్ని'' కరపత్రాలుగా పంచిపెట్టింది. పోష్టుద్వారా గూడా వెదజల్లించింది. ఆ ప్రఖ్యాపనం ''ధైర్యోపేతులైన కాశ్మీరీలను'' ఉద్దేశించి ఉంది. ''ఇదే సమయం పెల్లుబుకి ముందుకు రండి'' అని ఆ ప్రఖ్యాపనం వారిని ఉద్భోధిస్తుంది. దీనిని ఆగష్టు 9 నాడు కాశ్మీర్ రేడియోనుంచి ప్రసారం చేద్దామనుకున్నారు గనుక, ఆ ప్రఖ్యాపనం ఆ రోజునే ''దేశ భక్తులతో'' ''ఒక విప్లవ మండలి'' ఏర్పడినట్లు, ఆ ''విప్లవ మండలి'' ''జమ్మూ-కాశ్మీర్ జాతీయ ప్రభుత్వాన్ని నిర్మాణం చేసినట్లు'', చెబుతుంది. ఇట్లా ఒక జాతీయ ప్రభుత్వం ఏర్పడి, అది భారత దేశంతో కాశ్మీర్ చేసుకొనివున్న అన్ని ఒప్పందాలను, సంధులను రద్దుచేస్తున్నట్లు యీ ప్రఖ్యాపనంతోనే ప్రకటిస్తుంది. ఇందులో భారతదేశం సామ్రాజ్యవాది దేశంగా అభివర్ణించబడింది.

ఈ ప్రఖ్యాపనంలో ఇంకా చాలా చాలా విషయాలు ఉన్నాయి. ఇట్లా ఏర్పడుతుందని పాకిస్తాన్ ఆశించిన ''ఆ విప్లవమండలి'' ప్రభుత్వమే అసలైన ప్రభుత్వం. చట్టవిహితమైన సర్వాధికారాలు ఆ ప్రభుత్వమునందే నివిష్టం అయి ఉంటాయి. ఆ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేస్తుంది. వానిని ''కాశ్మీర్ నేషనల్ రేడియో'' ప్రసారం చేస్తుంది. అది ''కాశ్మీర్ వాణి''కి ప్రతినిధి స్థానం.

ఇది కాశ్మీర్ విముక్తి ఉద్యమం అని కదా పాకిస్తాన్ తలపెట్టింది. అందుచేత ఈ ప్రఖ్యాపనంలో ప్రపంచం అంతకూ కూడా విజ్ఞప్తులు ఉన్నాయి. ప్రపంచం అంతా యీ ''విముక్తి ఉద్యమాన్ని'' సమర్థించాలని కోరుతుంది.

ఈ ప్రఖ్యాపనంలో పాకిస్తాన్ ప్రజలకు ఒక ప్రత్యేకమైన విజ్ఞాపనం వుంది. ఇప్పుడు ప్రాణంకోసం, జీవితంకోసం, సర్వ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాటం ప్రారంభం అయింది. ఇది మా పోరాటం. ఇందులో మాతో చేతులు కలిపి పాకిస్తాన్ ప్రజలు కూడా యీ పోరాటాన్ని కొనసాగించవలసిన సమయం సంప్రాప్తమైంది. ఇది పాకిస్తాన్ ప్రజలకు యీ ప్రఖ్యాపనంలో కాశ్మీర్ ''విప్లవ మండలి'' ప్రభుత్వం చేయవలసివున్న విజ్ఞప్తి.

అనుకున్న దేదీ అనుకున్నట్లు జరగదు. సర్వం వితథం అయిపోయింది. చెదురు చెదురు ముఠాలుగా పాకిస్తాన్ దుండగులు కాశ్మీర్ లోయలో ప్రవేశించడం అయితే ప్రవేశించారు; కాని వారు ఏమి చేయాలని ఉద్దిష్టం అయిఉన్నదో, ఆ పనిని వారు చేయలేకపోయినారు. వారివలన కాశ్మీర్‌కు జరిగిన చెరుపు బహు కొద్ది. వారివలన నయిన కార్యం ఏమీ లేకపోయింది. శ్రీనగర్‌లో ఆగష్టు 9 వచ్చింది. వెళ్లింది. ప్రశాంత స్థితికి యేవిధమైన భంగము వాటిల్లలేదు. ఒక్కతరంలో రెండుసార్లు జమ్మూ-కాశ్మీర్ ప్రజలు తమకు పాకిస్తాన్ తలపెట్టిన ''విముక్తి'' అక్కరలేదని నొక్కి నిర్ధారణ చేశారు. ఆ ''విముక్తి''ని వారు అధఃకరించారు. తిరస్కరించారు. మొదటి ''విముక్తి''ని వద్దన్నట్లే, యీ రెండవ ''విముక్తి'' ని కూడా వద్దన్నారు. పాకిస్తాన్ తాను తలపెట్టిన సదా—ఏ— కాశ్మీర్ రేడియోను తన ఆక్రమణలోవున్న కాశ్మీర్‌లో నెలకొల్పుకొనవలసి వచ్చింది. ఆ నెలకొల్పబడిన దగ్గరనుంచీ ''కాశ్మీర్ స్వాతంత్ర్య వీరుల వీరగాథలు'' అదే పనిగా ప్రసారం అవుతున్నాయి. ఆ వీరుల విజయాలు నభోనిగదితాలవుతున్నాయి. ఈ రేడియో ముజఫరాబాద్‌కు ఐదారుమైళ్ల దూరంలోవున్న 'కేరి' వద్ద పని చేస్తున్నది. పాకిస్తాన్ రేడియో ప్రసారాలను వీరోచితంగా ప్రసారం చేస్తున్నది. ఈ రేడియో ద్వారా పాకిస్తాన్ ఆశలు పాశాల్లా వ్యాపిస్తున్నాయి. ఏమి జరిగిందో కాక, తాను ఏమి జరగాలని పాకిస్తాన్ ఆశించిందో, అది అంతా యీ రేడియో ముఖంగా కొట్టిపోయబడుతున్నది. ఆ అబద్ధాలకు అంతులేదు. అవి నయగరాఎత్తిపోతల అఖండజలధారాప్రవాహ పతనంలాగా నిపతితమై ప్రశాంతవాయుతరంగాలలో పాకిస్తాన్ పెట్టుకొనివున్న గొంతెమ్మ కోరికలను పూదిపోస్తూ ఉంటాయి. ఆ ధ్వనులను వింటే మనకు పొట్ట చెక్కలవుతూ వుంటుంది. రావల్‌పిండి మాత్రం శ్రీనగర్‌కు పూర్వం ఎంత దూరంలో ఉన్నదో, ఇప్పుడు అంత దూరంలోనే ఉన్నది.

ఆగష్టు 9 ముహూర్తంగా పెట్టుకొని కాశ్మీర్‌లో అధికార పరివర్తనాన్ని తెచ్చిపెట్టాలని పాకిస్తాన్ పెట్టుకున్న ఆశ ఇట్లా నిరాశఅయిపోయింది. యుద్ధ విరమణ సరిహద్దుల మీదుగా దుండగులు మరికొంతమంది ఉరికించబడినారు. అందువల్ల కూడా లాభం లేకపోయింది. సైన్యంతో వచ్చి కాశ్మీర్‌మీద పడటం పాకిస్తాన్‌కు ఇప్పుడు ఆవశ్యకమై పోయింది. ఇది ఈ యుద్ధం చరిత్రలో నూతన అధ్యాయానికి అంకురార్పణం చేసింది.

ఇది ఎట్లా జరిగిందో మనకు మనమై చెప్పవలసింది ఏమీలేదు. చెప్పవలసినదంతా ఐక్యరాజ్యసమితే చెప్పింది. జనరల్ నిమ్మో సమితి కార్యదర్శికి పంపిన ఒక నివేదికలో ఆగష్టు 10 వ తారీఖున కార్గిల్ రంగంలో రెండు వంతెనలమీద, ఒక చౌకీ మీద పాకిస్తానీ సాయుధులు దాడి సాగించిన విషయం పేర్కొన్నారు. ఈ సందర్భంలో జరిగిన సంఘర్షణలో ఒక పాక్ సాయుధుడు వధింపబడగా, అతని దుస్తులు ఎట్టివో పరిశీలన చేయబడినాయి. ఆ దుస్తులు పాకిస్తాన్ సరిహద్దు రక్షక సైన్యం దుస్తులను పోలివుండటం, అచ్చు అట్లాగే ఉండటం. గమనించడం కూడా జరిగింది.

ఆగష్టు 14 న తిరిగి ఇంకో సంఘటన జరిగింది. అది ఛాంబ్ రంగంలో. జనరల్ నిమ్మో ఈ విషయం కూడా సమితికార్యదర్శి దృష్టికి తెచ్చారు. పాకిస్తాన్ సైన్యమే యుద్ధ విరమణ సరిహద్దులను అతిక్రమించి, భారత భూభాగంలోనికి ఒక మైలు చొచ్చుకొని వచ్చినట్లు ఆయన తమ నివేదికలో పేర్కొన్నారు. ఇది దండయాత్ర. ఎందుచేతనంటే, జనరల్ నిమ్మోయే ఈ దాడిలో పాకిస్తాన్ సైన్యం

# యుద్ధక్రమం

భారతదేశం తాలూకు తొమ్మిది స్థానాలను వశపరచుకున్నట్లు తెల్పారు. ఈ సంఘటనలన్నీ ఆగష్టు 14 మొదలు 17 వరకు జరిగాయి. ఆగష్టు 14 న జరిగిన దాడులను భారత ప్రభుత్వ ప్రకటన చాలా "తీవ్రమైన దాడి"గా పేర్కొన్నది. ఒక బెటాలియన్ బలంతో పాకిస్తాన్ ఈ దాడిని సాగించినట్లు కూడా తెల్పింది. పాకిస్తాన్ సైన్యం ఇక్కడ ఈ యుద్ధ విరమణ సరిహద్దులపై కార్యాచరణకు దిగినట్లు యీ ఉదంతంవల్ల విదితం అయిపోయింది.

ముందు పేర్కొన్న కార్గిల్ ఉదంతం, ఆ తర్వాత జరిగిన ఛాంబ్ సంఘటన — ఈ రెండు చాలా ప్రధానమైన విషయాలు. ఎందుచేతనంటే యీ రెండు సంఘటనలవల్లను పాకిస్తాన్ దురంత యుద్ధతంత్రం ఏమిటో తెలుస్తున్నది. అంతేకాదు. యుద్ధ విరమణ సరిహద్దులను భారత సైన్యాలుకాక, పాకిస్తాన్ సైన్యాలే ముందుగా అతిక్రమించినట్లు యీ సంఘటనలు నిర్ధారణపరుస్తున్నాయి. ఆ తర్వాత కార్గిల్, టిత్వాల్, ఊరి—పూంచ్ రంగాలలో భారత సైన్యం యుద్ధ విరమణ సరిహద్దులను అధిగమించినప్పుడు ఒక్క పాకిస్తాన్ మాత్రమేగాక, పాశ్చాత్య రాజ్యాలు కూడా కొన్ని భారతదేశం ఆచర్యను "దురాక్రమణ" క్రింది పరిగణించి, నానా ఆందోళన చేశాయి. కాని సోపపత్తికంగా పైన పేర్కొనబడిన ఉదంతాలవలన యుద్ధ విరమణ సరిహద్దులను ముందు సైన్యాన్ని పెట్టి అతిక్రమించింది, భారత భూభాగంపై దాడి సలిపింది పాకిస్తానేనని నిర్ధారణ కావడంవల్ల, ఈ గందరగోళం వృధా గందరగోళం అని తేలిపోతున్నది.

ఎప్పుడైతే భారత సేనలు కార్గిల్ మొదలైన రంగాలలో యుద్ధ విరమణ సరిహద్దులను ఆత్మ రక్షణ చర్యగా అధిగమించాయో, ఆ తర్వాత పాకిస్తాన్ అధ్యక్షుడు ఆయూబ్‌ఖాన్‌కు ఛాంబ్ రంగం పైకి పెద్ద ఎత్తున సైన్యాన్ని నడిపించడం కన్నా వేరుమార్గం లేకపోయింది. సెప్టెంబరు 1 న పాకిస్తాన్ సైన్యాలు అంతర్జాతీయ సరిహద్దులను కూడా అతిక్రమించి, ఛాంబ్ రంగంమీద పడ్డాయి. పాకిస్తాన్ భారతదేశంపై చెప్పకుండా చెయ్యకుండా యుద్ధానికి దిగింది. మొదట దుండగుల ప్రవేశంతో ఆరంభమైన ఈ యుద్ధపు వాన తుఫానుగా పరిణమించింది. ఆ దొంగచాటు దురాక్రమణలు, తర్వాత ఈ బహిరంగపు యుద్ధము—అన్నీ పాకిస్తాన్ తెచ్చిపెట్టినవే. భారత్ పాకిస్తాన్ సరిహద్దుల్లో యుద్ధాన్ని పాకిస్తాన్ తెచ్చిపెట్టింది. ఇది భారతదేశం ఒక్కటే అంటున్న మాటకాదు.సమితి పరిశీలించి తేల్చిన నిర్ణయం.

అసలు పాకిస్తాన్‌కు శ్రీనగర్—లే రోడ్డును అటకాయించాలని, దాన్ని విచ్ఛిన్నం చెయ్యాలని ఎందుకు పుట్టింది? ఇది చైనాయొక్క మెహమాను కప్పుకొనడం కోసమా? లేక చైనా కోసమేనా? ఏది ఏమైనా భారతదేశం అందుకు గట్టి సమాధానం ఇవ్వక తప్పదు, ఇచ్చింది. ఆగష్టు 15 న భారత సైన్యాలు కార్గిల్ రంగంలో కదిలాయి. మూడు పాకిస్తాన్ స్థావరాలమీద దెబ్బతీశాయి. వానిని వశపరచుకున్నాయి. పాకిస్తాన్ కూడా ఆ రోజున వూరుకోలేదు. జనరల్ నిమ్మో నివేదికే ఇందుకు సాక్ష్యం. ఆరోజున, అనగా ఆగష్టు 15 న పాకిస్తాన్ సైన్యాలు భారతదేశం అంతర్జాతీయ సరిహద్దులను అతిక్రమించాయి. "భారతదేశం అంతర్జాతీయ సరిహద్దులను అతిక్రమించి, పాకిస్తాన్—జమ్మూ సరిహద్దులలో భారత భూభాగంలో 5 మైళ్ళు చొచ్చుకువచ్చి అచ్చటవున్న రాజ్‌పూర్ గ్రామంమీద పాకిస్తాన్ సైన్యాలు దాడి చేసినట్లు" జనరల్ నిమ్మో తమ నివేదికలో పేర్కొన్నారు. దీనితో యీ సంఘర్షణ కొంత ఎత్తు హత్తుకున్నది. ఎందుచేతనంటే, ఇప్పుడు ఇచ్చట పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్‌లోంచిగాక, పాకిస్తాన్ భూభాగంనుండే, భారత భూభాగంపై దెబ్బ తీసింది. అంతర్జాతీయపు సరిహద్దును అతిక్రమించింది.

ఈలోగా కాశ్మీర్‌లో ప్రవేశించిన దుండగుల పని "త్రాహి త్రాహి" కావడం ఆరంభమైంది. అయితే వారి పని పట్టడం తీవ్రతరం అయ్యేలోగా ఆ దుండగులు "బట్మాలు"కు నిప్పు ముట్టించడం మొదలైన పనులు కొన్ని చేశారు. "బట్మాలు" కాశ్మీర్ రాజధాని శ్రీనగర్‌కు శివార్లలోవుంది. దాన్ని యీ దుండగులు తగులబెట్టడం వార్త చేరగానే పాకిస్తాన్ రేడియో ఎంతో ఆనందంతో దానిని ప్రసారం చేసింది. తర్వాత నాలుక కరుచుకున్నది. ఈ శివారును పరశురామప్రీతికి గురి చేసింది పాకిస్తానీలు అని యీ ప్రసారంవల్ల తేలినప్పుడు, ఆ గృహ దాహ సంఘటనలో నిరాశ్రయులు, నిరాలంబులు అయినవారు ఏమనుకుంటారు? అందువల్ల, ఆ పని చేసింది భారత సైన్యమేనని తర్వాత పాకిస్తాన్ రోళ్లను రోకళ్లను కొట్టడం మొదలుపెట్టింది.

ఈ దుండగులు మొదట్లో కొంచెం విజృంభించి జమ్మూలోనుండి, ఠాణామండీలను ముందు పట్టుకున్నారు. ఇవి పూంచ్ ప్రాంతంలో ఉన్నాయి.అవి కొన్ని రోజులు వారి చేతుల్లో ఉన్నాయి. ఆ తర్వాత భారతసైన్యం ఆ రెండు స్థానాలను తిరిగి ఆక్రమించుకున్నది. అయితే పాక్ దుండగులు ఆ తర్వాత కూడా కొంచెం ముందుకు రాగల్గారు. రియాసి జిల్లాలో బుదిల్, గులాబ్ ఘర్‌ల దాకా వచ్చారు. అక్కడ వారి బలం కేంద్రీకృతమైంది. అక్కడినుంచి రామ్‌బాన్ చేరాలని వారి దిలాసా. ఇది జమ్మూ—శ్రీనగర్ హైరోడ్డుమీద వుంది. అక్కడికి వారిని భారత సైన్యం చేరనీయలేదు.

వీరి వ్యవహారం ఇట్లా ఉండగా, పాకిస్తాన్ సైన్యం గూడా యుద్ధ విరమణ సరిహద్దుల మీదుగా అతిక్రమణలు అధికం చేసింది.

ఆగష్టు 16 న ఊరి రంగంలో, 17, 18 తేదీలలో ఛాంబ్ రంగంలో, 21, 22 తారీఖులలో మెంధార్ రంగంలో ఇట్లా పాకిస్తాన్ సైన్యం చెలరేగడం మొదలు పెట్టింది. భారత సైన్యం యీ అన్ని దాడులను తిప్పికొట్టింది. ఆగష్టు 23న పాకిస్తాన్ జెట్ విమానాలు కొన్ని యుద్ధ విరమణ సరిహద్దులను అతిక్రమించాయి. అక్కడా అక్కడా చిక్కుకుపోయిన దుండగులకు ఆహార పదార్థాలు వెదజల్లడంకోసం పాకిస్తాన్ తన యుద్ధవిమానాలను ఇప్పుడు రంగంలోకి దింపింది.

అయితే కాశ్మీర్‌లో ప్రవేశించిన దుండగుల పని ఏమీ బాగుండలేదు. వారి పని కుంపటిలో పెట్టినట్లు అయిపోయింది. స్థానికంగా వారు ఏదో పెద్ద అండ లభిస్తుందనుకున్నారు. అది వట్టిదై పోయింది. వారి దగ్గర ఆహార పదార్థాలు అంతరించిపోవడం మొదలు పెట్టాయి. కాళ్లకి బుద్ధి చెప్పి వెనకకు తిరిగిపోవడంకన్నా వారికి మార్గాంతరం అంటూ లేకపోయింది. ఈ దుండగులు ఇట్లా స్థైర్యం తప్పిన వాళ్లు, నీతి జారినవాళ్లు అయిపోయినారు. అయితే వారు వచ్చిన మార్గాలను అరికట్టనిపక్షంలో మరికొందరు దుండగులు కాశ్మీర్‌లో ప్రవేశించవచ్చు. ఆ కారణంచేత ఆగస్టు 24 వ భారత సైన్యం టిత్వాల్ రంగంలో యుద్ధవిరమణ సరిహద్దులను అధిగమించి పాక్ ఆక్రమిత కాశ్మీర్ భూభాగంలో ప్రవేశించింది. ఆ మరునాటికల్లా శాంజోయ్ ప్రాంతంలో రెండు పాకిస్తానీ స్థావరాలు భారత సైన్యాలచేతుల్లోకి వచ్చాయి. ఈ స్థావరాలలో సాహిబా స్థావరం వుంది. ఇది చాలా ముఖ్యమైంది. అక్కడ తమ ఉనికిని బలపరచుకొని భారత సైన్యాలు ఆ తర్వాత కిషన్ గంగానది వెంబడి ముందుకు పురోగమించాయి. సెప్టెంబరు 11 న పాకిస్తానీలు మీర్‌పూర్ వంతెనను ధ్వంసం చేసుకున్నారు. అప్పటికే భారత సైన్యం ముజఫరాబాద్—కేల్ రోడ్డుమీద బలమైన స్థితిలో ఉనికిగొని ఉండటం జరిగిపోయింది. దుండగులు కాశ్మీర్‌లో ప్రవేశించే ఒక మార్గం బంధింపబడింది.

దుండగులు కాశ్మీర్‌లో ప్రవేశించేందుకుగాను ఉపయోగపడిన ప్రధానమైన మార్గాలు హాజీపీర్ కనుమ దగ్గర, ఊరి—పూంచ్ మలుపు దగ్గర ఉన్నాయి. ఈ మార్గాలను అరికట్టడానికి భారత సైన్యం ఆగస్టు 27 నుంచీ పూనుకున్నది. హాజీపీర్‌మీద భారత సైన్యం ఎట్లాగూ పడుతుందని పాకిస్తాన్ అనుకుంటూనేవుంది. భారత సైన్యం దానిమీద నైతే పడింది కాని, పాకిస్తాన్ అనుకున్న పద్ధతిలో పడలేదు. ఊరి—పూంచ్ రోడ్డు మీదుగా భారత సైన్యం వస్తుందని పాకిస్తాన్ వూహ. అది హాజీపీర్‌కు ఉత్తరంగావుంది. కాని భారత సైన్యం అడ్డదారిని పర్వతాల మీదుగా ముందుకు కదిలింది. ఇది గొప్ప ఎత్తు. ఎంతో నైపుణ్యం అవసరం. అంతటి నైపుణ్యంతోను ఈ కార్యం సాధించబడింది. ఆగస్టు 28 కల్లా హాజీపీర్ ఆక్రమణ పూర్తి అయింది. అక్కడ త్రివర్ణ పతాకం ఎగిరింది. ఆరోజున మన సైన్యం అక్కడ పాకిస్తానీలతో (పట్టుబడినవారు) కలిసి భోజనం చేసింది. ఆ మరునాడు పాకిస్తాన్ ఎదురుదాడి సాగించిందిగాని అది నిష్ఫలమైపోయింది. పూంచ్‌నుంచి బయలుదేరిన ఒక భారత సైన్య నివహం సెప్టెంబరు 10 నాటికి ఊరీనుంచి బయలు దేరిన మరో భారత సైన్య నివహాన్ని కలుసుకున్నది. దీనితో ఊరీ—పూంచ్ వంపు వంపు తీరినదై పోయింది. ఆ వంపు సరళమైంది.

ఇది గొప్ప విజయం.

పాకిస్తానీలకు ఇప్పుడు కంగారు అధికమై పోయింది. వారికి ఏమి చేయడమూ తోచలేదు. జిబ్రాల్టర్ బలాధిపతి జనరల్ అఖ్తార్ హుస్సేన్ మలిక్ ఒక రహస్య ఉత్తర్వును జారీ చేశారు. ఆ ఉత్తర్వు ఖిల్జీ బలగానికి. ఇది ఈ జిబ్రాల్టర్ బలంలో ఒక విభాగం. భారత సైన్యం ముందుకువస్తే వెనకనుంచి రెచ్చతీయడం ఈ ఖిల్జీ బలగం కర్తవ్యం. ఇప్పుడు భారత సైన్యం ముజఫరాబాద్— కేల్ మార్గంమీద ఆధిపత్యాన్ని సంపాదించగల్గడంతో పాకిస్తానీ రవాణా సౌకర్యాలకు ఎన్నరాని ప్రమాదం వాటిల్లింది. ఈ విషయాన్ని జనరల్ హుస్సేన్ మలిక్ తనరహస్య ఉత్తర్వులో పేర్కొని, భారత సైన్యంపై వెనుక తట్టునుండి దెబ్బతీయవలసిందిగా కోరారు. కాని ఖిల్జీ బలగం ఆ పని చేయలేకపోయింది. దెబ్బతింది. ఆ సందర్భంలో ఒక రహస్యపత్రం భారత సైన్యం చేతుల్లో పడింది.

జనరల్ నిమ్మో తన నివేదికలో పాకిస్తాన్ దురంత యుయుత్సు కార్యక్రమాన్ని గూర్చి ఎంతో స్పష్టంగా వివరించి ఉన్నారు. భారతదేశం ఆ నివేదికనూ ప్రకటించవలసిందని కోరింది. శ్రీ థాంట్ గూడా ప్రకటించాలన్నారుకాని భద్రతా మండలిలో పాకిస్తాన్‌కు స్నేహితులు ఉన్నారు. వారు శాంతికోసం ఆ నివేదికను ప్రకటించవద్దన్నారు. అడ్డుపడ్డారు. ఫలితం శాంతికాదు. పాకిస్తాన్ భారత్‌పై యుద్ధాన్ని విస్తరించింది.

సెప్టెంబర్ ఒకటి. తెల్లవారుఝామున నాల్గుగంటలైంది. పాకిస్తాన్‌సైన్యం భారతదేశంమీదకు అంతర్జాతీయపు సరిహద్దుల మీదుగా సైన్యాన్ని నడిపించింది. ఆ సైన్యాలు ఛాంబ్ రంగంలో ప్రవేశించాయి. ఛాంబ్ రంగంమీదను దాడిని ప్రారంభించాయి. ఈదాడికీ, ఈ దండయాత్రకు ఒక రహస్య సంకేత నామధేయం వుంది—''ఆపరేషన్ గ్రాండ్‌స్లామ్' అని. ఆ నామంతో ఈ దురాక్రమణ, యీ యుద్ధం ప్రారంభం చేయబడినాయి. పాకిస్తాన్ ఇటువంటి ఆలోచనలోవున్నట్లు ఆ రంగంలోవున్న సమితి పరిశీలకుడు ముందుగానే గ్రహించారు. భారత సేనాని జనరల్ చౌదరికి ఆయన ఆ సంగతి చెప్పారు. ఆయన చెప్పినట్లు జనరల్ చౌదరే తెలియజేసిన సందర్భం వుంది. పాకిస్తాన్ సైన్యాలు సియాల్‌కోటనుంచి ముందుకు వస్తున్నాయి. యుద్ధవిరమణ సరిహద్దు మీదుగా దాడి ప్రారంభం చేస్తాయి. అంతర్జాతీయ సరిహద్దులను కూడా అతిక్రమిస్తాయి. ఈ విషయం ఆ సమితి పరిశీలకునివలన తెలిసింది. అదే ఇది—సెప్టెంబరు ఒకటి రోజున పాకిస్తాన్ ప్రారంభం చేసిన అఖండ దురాక్రమణం.

ఆగస్టు నెలలోనే పాకిస్తానీలు ఛాంబ్—అఖ్నూర్ రంగంలో భారత సైన్యం యేమాత్రం పటిష్ఠంగా ఉన్నదో ఒకటికి రెండుసార్లు పట్టి చూచారు. ఆగస్టు 14, 16, 17, 18 తారీఖులలో పాకిస్తాన్ సైన్యం ఇందుకోసం యుద్ధ విరమణ సరిహద్దులనేగాక, అంతర్జాతీయ సరిహద్దులనే కూడా అతిక్రమించింది. కాని సెప్టెంబరు 1 వ తేదిన పాకిస్తాన్ సైన్యం సముద్రం తరంగంలాగువచ్చి ఛాంబ్ రంగంమీద పడింది. ఛాంబ్ అన్నది అక్కడ ఒక గ్రామం. సమీపంల్లో బుజేరల్ అన్న వూరు ఉంది. అక్కడ భారత సైన్యం వుంది. పాకిస్తాన్ సైన్యం శతఘ్నుల మోతలతో ఆ స్థావరంమీద పడింది. అదే సమయంలో ఝూన్‌గర్ ప్రాంతంలో ఇంకో స్థావరంపై కూడా పాకిస్తానీలు కాల్పులు మొదలుపెట్టారు. తెల్లవారి 5 గంట

# యుద్ధ క్రమం

లయ్యేవేళకు పాకిస్తానీ పదాతి బలం గుజేరల్ స్థావరంపై పెద్ద ఎత్తు దండయాత్రను ఆరంభం చేసింది. పశ్చిమ పాకిస్తాన్‌లో గుజరాత్ ఒక జిల్లా. ఆ జిల్లాలోని 'శాహు' గ్రామంనుంచి ఇప్పుడు యీ పదాతిబలం అంతర్జాతీయ పరిహద్దులను అతిక్రమించి ఛాంబ్ ప్రాంతంలోని యీ బుజేరల్ స్థావరంమీద పడింది. ఆ దాడి అప్పటికి త్రిప్పికొట్టివేయబడింది. పాకిస్తాన్ యీ ప్రాంతంలోనే రెండవ దాడిని జరిపింది. ఇది 'మేలు' గ్రామంపై జరిగింది. ఇందుకు కూడా పాకిస్తాన్ అంతర్జాతీయ సరిహద్దులను అతిక్రమించి వచ్చింది. ఈ దాడి కూడా త్రిప్పి కొట్టి వేయబడింది.

మూడోదాడి గూడా పాకిస్తాన్ ప్రారంభించింది. అది గూడా విఫలమైంది.

అప్పటికి మధ్యాహ్నం 11—30 గంటలైంది. పాకిస్తాన్ ఇప్పుడు టాంకులతో పదాతిబలంతో ముందుకు త్రోసుకు వచ్చింది.ఇది వట్టి దాడికాదు.దండయాత్ర, యుద్ధం. ఆ టాంకులు పాటాన్ టాంకులు. అమెరికా ఇచ్చినవి. అవి రెండు రెజిమెంట్లు ఇప్పుడు ఛాంబ్ రంగంలో ప్రవేశించాయి. ఒక బ్రిగేడు పదాతిబలం వాటితో వచ్చింది. ఈ దండయాత్ర కూడా అంతర్జాతీయ సరిహద్దులమీదుగానే జరిగింది. యుద్ధ విరమణ సరిహద్దు కూడా అతిక్రమించబడింది. ఈ సైన్యం ఇప్పుడు అర్ధవలయాకారంలో భీమ్‌బేర్‌నుంచి దేవా దాకా వున్న ప్రాంతం మీదుగా ముందుకు తోసుకు వచ్చింది.

ఈ పాటాన్ టాంకులను పాకిస్తాన్ ముందు కచ్ యుద్ధంలో ప్రయోగించింది. అది పాకిస్తాన్‌కు అనుకూలమైన క్షేత్రం. అక్కడ మహా గర్వియైన ఉద్ధత దుర్బుద్ధి కత్తిని ఝళిపించినట్లు పాకిస్తాన్ యీ పాటాన్ టాంకులను చూపించింది. ఇక్కడ కూడా పాకిస్తాన్‌కు క్షేత్రం ఇప్పుడు అనుకూలంగానే ఉంది. పాకిస్తాన్ రవాణా మార్గాలకు ఈ క్షేత్రం అందుబాటులోవుంది. భారీ యుద్ధపరికరాలను మోహరించడం ఇక్కడ పాకిస్తాన్‌కు తేలిక పని. సయాల్‌కోటలో, గుజరాత్‌లో, ఖరియన్‌లో పాకిస్తాన్‌కు స్థావరాలు ఉన్నాయి. ఇది భారత సైన్యానికి అనుకూల క్షేత్రంకాదు. రవాణా మార్గాలు అందుబాటులో లేవు. క్షేత్ర వైశాల్యము, విస్తీర్ణము తక్కువ. సైన్యం కదలడానికి కూడా సరిగ్గా చాలదు. అఖ్నూర్‌దాకా అయితే భారత సైన్యం కూడా తన టాంకులను ఇతర భారీ యుద్ధసామగ్రులను కదపకలదు. దాన్నిమించి కదపడం క్షేమంకూడా కాదు.

అందువల్ల భారత సేనలు ఇక్కడ వెనక్కు తగ్గాయి. ఛాంబ్‌ను వదిలిపెట్టాయి. ఈ వెనక్కు తగ్గడం అంతా లెక్క ప్రకారం జరిగింది. తావి నదీతీరం వెంబడి, నది మీదుగా సాగింది. ఇది వట్టి లోతులేని నది. దీన్ని పాకిస్తాన్ సేనలు జీపులలో, ట్రక్కులలో, ఆ తర్వాత అధిగమించాయి. భారత సైన్యం శత్రు యాత్రావేగాన్ని తగ్గించడానికి, నిలువరించడానికి విమానాలను ప్రయోగించింది.

విమానాలు యుద్ధరంగంలోకి రావాలని ఉత్తర్వు వచ్చే వేళకు మన వైమానికులు ''స్క్వాడ్రన్'' వార్షికోత్సవం జరుపుకుంటున్నారు. అప్పటికి ప్రొద్దు కుంకవస్తున్నది. మన వైమానికులు ఆఉత్సవంలోంచి యీ ఉత్సవంలోకి దూకారు.సాయంత్రం ఐదు-పదిహేను, ఆరుగంటల మధ్య నడిచిన 45 నిమిషాలలో 28 సార్లు పాకిస్తాన్ టాంకులపై మన విమానాలు దాడి చేశాయి. 13 టాంకులను పనికిరాకుండా చేశాయి. భారత సైన్యం శతఘ్ని దెబ్బలకు మరో కొన్ని పాటాన్ టాంకులు పోయినాయి. ఇట్లా ఆ ఒక్క రోజున 18 పాటాన్ టాంకుల అంకెళ్లు నొక్కివేయబడినాయి. పాకిస్తాన్ కూడా తన విమానాలను వదిలింది. పాకిస్తాన్‌కు అమెరికా ఇచ్చిన శాబర్ జెట్‌లు పరుగు పెట్టుకుంటూ ఎగిరి వచ్చాయి. మన విమానాలను ఎదుర్కొని రెండు విమానాలను పడగొట్టాయి. రెండు రోజుల తర్వాత ఇది సరికి సరి చేయబడింది. మన 'నాట్' విమానాలు రెండు శాబర్‌జెట్ విమానాలను కూల్చివేశాయి. ఆ తర్వాత మన విమానాలకు పాక్ విమానాలంటే భయమే పోయింది. మన విమానాలంటే పాకిస్తాన్ విమానాలకు హడలు ఎత్తిపోయింది.

సెప్టెంబరు 1 వ తేదీన సూర్యుడు అస్తమించే వేళకు అఖ్నూర్‌మీద పాకిస్తాన్ సాగిస్తున్నయాత్ర తాత్కాలికంగా నిలువరించబడింది. భారతసైన్యం అక్కడకు ఎగువగా జౌరియన్‌వద్ద పునస్సమీకృతమై సమిత్తుకు సిద్ధమై నిల్చింది. పాకిస్తానీలు ఇప్పుడు ప్రథమ విజయగర్వంతో ఏది ఏమిటో తెలుసుకొనలేని స్థితిలోపడిపోయినారు.విదేశపు పత్రికల విలేఖరులను వెంటబెట్టుకు ముందుకు పరాక్రమించారు. వారి ఎత్తు ఏమిటో తెలుస్తూనేవుంది. వారి లక్ష్యం గోచరిస్తూనేవుంది. వారి నడక అఖ్నూర్ మీదకు. దాన్ని వారు పట్టుకోవాలి. అది భారత్‌కు ఆ ప్రాంతంలో ప్రాణం వంటిది. రవాణా మార్గాలకు కూడలి. మంచి కీలక స్థానం. దాన్ని గనుక పట్టుకుంటే, పాకిస్తాన్ సియాల్‌కోట్‌నుంచి సూటిగా జమ్మూమీద పడవచ్చు. పాకిస్తాన్ అట్లా చెయ్యాలనే అనుకొని ఉంటుంది. జమ్మూను కనుక పాకిస్తాన్ పట్టుకోగల్గితే, అప్పుడు జమ్మూలోవున్న, కాశ్మీర్‌లో వున్న, లదక్‌లోవున్న భారతసైన్యం పని త్రాహి త్రాహి అయిపోతుందని పాకిస్తాన్ అనుకొని ఉంటుంది. ఇది గనుక జరిగితే, భారతదేశం తల దిమ్మెక్కి, సైనిక విషయకంగా తనకు సంప్రాప్తమైన యీ ఘోర విపత్తును తట్టుకోలేక, భయభ్రాంతం అయిపోతుంది; ఢిల్లీలో తగాదాలు వస్తాయి. అప్పుడు కాశ్మీర్‌ను తాను తేలిగ్గా కబళించవచ్చు. అంతర్జాతీయంగా యీ కబళించడానికి కూడా కొన్ని పట్టింపులు వున్నాయి. వాటిని సూక్ష్మంలో తేల్చుకోవచ్చు. నిజంగా ఇట్లా జరిగితే, అది ''గ్రాండ్ స్లాన్'' గానే ఉండేది. కాని అట్లా జరగలేదు. పాకిస్తాన్ తన సైన్యాలను నిల్పిన తీరునుబట్టిచూచినా, ఆ దేశంఆలోచన ఇదేనని స్పష్టంగా కన్పిస్తుంది. సెప్టెంబరు 4 వ పాకిస్తానీ జెట్ విమానాలు రణబీర్‌సింగ్‌పూర్‌మీద దాడి చేశాయి. రాకెట్లు ప్రయోగించాయి. ఇది సియాల్‌కోట్—జమ్మూ రోడ్డుమీద వుంది. ఇప్పుడు యుద్ధం జరుగుతున్న చోటునకు 50 మైళ్ల దూరంలో జౌరియన్‌కు, అఖ్నూర్‌కు మధ్యగావుంది. ఇది ఏదో జరిగింది అనుకుందాము. కాని పాకిస్తాన్ తన సైన్యాలలో ఒక సాయుధబలాన్ని, డివిజన్ శక్తితో సియాల్‌కోట్—పస్రూర్ ప్రాంతంలో నిల్పి వుంచింది. అక్కడే

రెండు డివిజన్‌ల సదాతిబలాన్ని ఉంచింది. లాహోర్ ప్రాంతంలో ఒక డివిజన్ సాయుధబలము, రెండు డివిజన్‌ల పదాతిబలమూ ఉన్నాయి. ఇప్పుడు యీ ప్రథమ విజృంభణంలో పాకిస్తాన్ బలాలు గనుక అఖ్నూర్‌ను, జమ్మూను పట్టుకుంటే, అప్పుడు పాకిస్తాన్ భారత సైన్యంమీద ఒత్తిడి తెచ్చేందుకు ఇంకో రెండు దాడులను ప్రారంభించి ఉండేది. కాశ్మీర్‌పై పాకిస్తాన్ ముట్టడిని ఏమి చేయడానికి భారతదేశానికి వీలు ఉండేదికాదు. ఈ తలపెట్టిన దాడులలో ఒక దాడిని రావీ నదిమీదుగా గుర్‌దాస్‌పూర్, పఠాన్‌కోటలమీదకు, రెండవ దాడిని కసూర్—ఖేమ్‌కరణ్ ప్రాంతం మీదుగాను నడిపి ఉండేది. ఇది జరిగితే అప్పుడు పాకిస్తాన్ సైన్యాలు హరికే, తరణ్ తరణ్, బియాస్ నదులను అంటి మూడు ముఖాలుగా భారత్‌పై దెబ్బతీయ గల్గివుండేవి. అప్పుడు ఆ సైన్యంలో కొంతసైన్యం అమృత్‌సర్‌ను చుట్టు ముట్టగా మరో పాకిస్తాన్ సైన్యం గ్రాండ్ ట్రంకు రోడ్డుమీదుగా ఢిల్లీకి ప్రమాదాన్ని తెచ్చిపెట్ట గల్గివుండేది.

ఈ పరిస్థితిలో సెప్టెంబరు 2 వ తేదీనాడు సమితి కార్యదర్శి శ్రీ థాంట్ భారత్—పాకిస్తాన్‌లకు కాల్పులు విరమించవలసిందిగా విజ్ఞప్తి చేశారు. ఆ మరునాడు కాశ్మీర్ వ్యవహారంపై తాను చేస్తానని చెబుతూ వచ్చిన ప్రకటనను భద్రతా మండలి సభ్యులకు అందజేశారు. యుద్ధవిరమణ కావించగలనని గాని, యుద్ధవిరమణ సరిహద్దులను మర్యాదగా చూస్తానని గాని పాకిస్తాన్ శ్రీ థాంట్‌కు మాట ఇవ్వలేదు. ఈ విషయంలో తన అశక్తతను శ్రీ థాంట్ అంగీకరించారు. సెప్టెంబరు నాల్గున భద్రతామండలి ఒక యుద్ధవిరమణ తీర్మానాన్ని ఆమోదించింది. పాకిస్తాన్ పెంకితనంవల్ల అది ఎందుకూ కొరగాలేదు. భారతదేశం కాల్పులవిరమణకు సుముఖతను ప్రదర్శించింది. కాని ఛాంబ్‌నుంచి పాకిస్తాన్ తన బలాలను ఉపసంహరిస్తే తప్ప యుద్ధ విరమణ సాధ్యంకాదని స్పష్టం చేసింది. అంతేగాక కాశ్మీర్‌లో ప్రవేశపెట్టిన దుండగులను పాకిస్తాన్ ఉపసంహరించితీరాలని గూడా విశదం చేసింది. ఇది చాలదు. ఇంతా జరిగినా భారతదేశంమీద పాకిస్తాన్ తిరిగి దండయాత్రను తలపెట్టవచ్చు. అట్లా జరగదని హామీ కావాలని భారతదేశం కోరింది.

సెప్టెంబరు 4 వ తేదీనాడే చైనా విదేశాంగమంత్రి మార్షల్ చెన్‌యీ కరాచీ చేరుకున్నారు. పాకిస్తాన్ విదేశాంగ మంత్రి శ్రీ భుట్టోతో మంతనాలు సాగించారు. వీరి ఉభయుల మధ్యను యీ మంతనాలు దాదాపు ఆరు గంటలసేపు జరిగాయి. ఆ క్రితం రోజున అనగా సెప్టెంబరు మూడవ తేదీన పెకింగ్‌లోని పాకిస్తాన్ రాయబారి చైనా ప్రధాని శ్రీ చౌ ఎన్ లేను కలుసుకు మాట్లాడారు. "కాశ్మీరులో భారతదేశం ఉద్రేకాలు రెచ్చగొట్టినట్లు" నవ చైనా వార్తా సంస్థ ప్రచారం ఆరంభించింది. మార్షల్ చెన్‌యీ ఇంకో అడుగు ముందుకు వేశారు. "భారతదేశం తలపెట్టిన కవ్వింపుపనిని పాకిస్తాన్ ఎదుర్కొనడం న్యాయంగా" ఉన్నదని ఆయన అన్నారు. ఇది అంతా చాలదన్నట్లు ఆగస్టు 5 న పాకిస్తాన్ శాబర్‌జెట్ అమృతసర్‌మీద దాడి చేసింది. అక్కడవున్న మన సైనికానిర్మాణాలమీద దెబ్బ తీసింది.

భారతదేశం ఏదో ఒకటి ఇప్పుడు చేయక తప్పదు. పరిస్థితి అట్లా ముంచుకు వచ్చింది. ఏమి చేసినా ఏమి చేయక పోయినా అఖ్నూర్‌మీద పాకిస్తాన్ సైన్యం ఒత్తిడిని తగ్గించాలి. భారతదేశం యీ పరిస్థితిలో తాను చేయదగు పనిని చేసింది. సెప్టెంబరు 6 వ తేదీనాడు పాకిస్తాన్ సరిహద్దులను అధిగమించి లాహోర్ రంగంలో ప్రవేశించింది. భారత సైన్యాలు రణ భేరి మ్రోగించాయి.

భారత వైమానిక బలం ఆ రోజున పాకిస్తాన్‌లో అనేక సైనిక స్థావరాలపై దెబ్బ తీసింది. అంతవరకు పరమమౌనాన్ని భజిస్తూ వచ్చిన పాశ్చాత్య రాజ్యాలు ఆ రోజున తమ పరమమౌనాన్ని వదిలి పెట్టాయి. పాకిస్తాన్‌మీద భారతదేశం ఆత్మరక్షణ నిమిత్తం అవలంబించిన యీ చర్యను "దండయాత్ర" క్రింద జమకట్టి, ఆ చర్యను ఆదేవిధంగా అభివర్ణించాయి.

ఇప్పుడు పాకిస్తాన్‌పై భారతదేశం ప్రారంభించిన యీ చర్య మూడు ముఖాలుగా సాగింది. ముప్ఫై మైళ్ల నిడివిని యుద్ధ క్షేత్రం వ్యాపించింది. భారత సైన్యాలు గ్రాండ్ ట్రంకు రోడ్డుమీదుగా, వాఘానుంచి డోగ్రాయ్ వరకుగల ప్రాంతం నిడివిని విజృంభించాయి. ఒక వంక ఖాలా—బర్కీ ప్రాంతంలో ముందుకు నడిచాయి. మరో దిక్కున ఖేమ్‌కరణ్—కసూర్ రంగంలో విక్రమించాయి. అక్కడికి ఉత్తరాన రావీ నది వుంది. అక్కడ భారత సైన్యాలు పాకిస్తానీలను వెనక్కు నెట్టాయి. పాకిస్తాన్ సైన్యం ఆ ప్రాంతంలో డేరాబాబా నానక్ వంతెనను స్వయంగా కూల్చివేసుకున్నది. ఆ దిక్కు నుంచి భారత సైన్యానికి పాకిస్తాన్ భయం తీరినట్లు అయింది. ఈ యుద్ధంలో మన సైన్యం కొన్ని పాటాన్ టాంకులను కూడా వశపరచుకో గల్గింది. ఈ టాంకులు మనకు చిక్కడం ఇదే మొదలు.

మొదటిరోజు యుద్ధం ప్రారంభం అయిన సాయంత్రం వేళకు భారత సైన్యాల అగ్రగామి దళాలు ఇచ్ఛోగిల్ కాల్వను రావీనదిని అధిగమించాయి. అయితే అక్కడ సమీకరణం చేసుకోలేకపోయినాయి. అగ్రస్థానాలను నెలకొల్పుకోలేక పోయినాయి. ఇందుకు కారణం వుంది. పాకిస్తానీ సైన్యం తీవ్రమైన ఎదురుదాడులు మొదలు పెట్టింది. భారత సైన్యం తాలూకు యీ దళాలు తిరిగి తూర్పుగా ఇచ్ఛోగిల్ కాలువ తూర్పు ఒడ్డుకు చేరుకోవలసి వచ్చింది. అయితే అంతవరకు జరిగిన యుద్ధం ఏ ఫలితాలను ఆశించి జరుపబడినదో, ఆ ఫలితాలు కుదిరివచ్చాయి. అఖ్నూర్‌మీద శత్రువు ఒత్తిడి తగ్గింది. పూర్తిగా సల్లబడింది. ఆ రంగంనుంచి శత్రువు తన సైన్యాన్ని ఎక్కువభాగం కదిల్చి తన సాయుధ శకటాలలో ఎక్కువభాగం ఉపసంహరించి సియాల్‌కోట్—పసూర్ రంగం చేరుకోవలసి వచ్చింది. భారతదేశం ముందు ఎత్తు ఏమి వేస్తుందా అని విచికిత్స చేసుకుంటూ ఆలోచనాధీనుడు కావలసి వచ్చింది.

# యుద్ధ క్రమం

పాకిస్తాన్ అధ్యక్షుడు ఆయూబ్‌ఖాన్ "మనం యుద్ధంలో పడినాము" అంటూ ఒక ప్రకటన చేశారు. ఆ రాత్రి పాకిస్తానీ గాలిగుమ్మటంబలాలు రంగంలోకి దింపబడినాయి. ఈ గాలి గుమ్మటం బలాలను బృందాలుగా చీల్చి భారతదేశంలో పఠాన్ కోట్, ఆదామ్‌పూర్, హల్వారా విమాన స్థావరాల ప్రాంతాలలో ఆ బృందాలను గాలిలోంచి పాకిస్తాన్ దింపింది. ఇంకా మరికొన్ని చోట్ల కూడా వీరు దిగారు. కాని లాభం లేకపోయింది. ఆ గాలి గుమ్మటం బలాల హఠాదవతరణకార్యంవల్ల ఏమి జరుగు తుందని పాకిస్తాన్ ఆశించిందో అది జరగలేదు. ఆ దిగిన గాలి గుమ్మటం మనుష్యులు నిర్వీర్యులైనారు. ధైర్యం సడలి పోయారు. చిక్కిపోయారు.

గాలిగుమ్మటం బలాలను పాకిస్తాన్ ఎందుకు ఉప యోగించిందో చెప్పవలసివుంది. వారిని ఎట్లా దింపిందో గూడా తెలుసుకోనడం అవసరం. ఈ గాలి గుమ్మటం బలాలను బృందా లుగా దింపిందన్నాముకదా! ఒక్కొక్క బృందంలో 60, 62 మంది దాకా సైనికులు ఉన్నారు. పఠాన్‌కోట దగ్గర 42 మంది దిగారు. వీరిని పాకిస్తాన్ ఒక సి—130 హెర్క్యులస్ విమానంలో తెచ్చి వదిలి పెట్టింది. విమానాశ్రయానికి రెండు మూడు మైళ్లలోపు దూరంలో వీరు నేలమీద దిగారు. సెప్టెం బరు 7 తెల్లవారు ఝామున 3 గంటల వేళ యీ పని జరి గింది. వారికి పాకిస్తాన్ అప్పగించిన పనులు యీ విధంగా ఉన్నాయి. వీరు సమీపంలోని విమాన స్థావరంపై దాడి చెయ్యాలి. అక్కడవున్న నిర్మాణాలను నాశనం చెయ్యాలి. అక్కడ విమానాలు ఉంటాయి. ఆ విమానాలనూ నాశనం చెయ్యాలి. విమా నాశ్రయాన్ని పట్టుకోవాలి. ఇది సాధ్యమైతే చేయవలసిన పని. ఈ కార్యక్రమం అంతా నిర్విఘ్నంగా నెరవేరిన అనంతరం నెర వేరిందన్న సంగతి 'గుర్తు' ద్వారా పాకిస్తాన్‌కు తెలియజేయాలి. అప్పుడు వారిని తీసుకుపోయేందుకు విమానం వస్తుంది. అది యీ గాలి గుమ్మటం బలాలు నాశనంచేయవలసివున్న విమా నాశ్రయంలోనే వాలుతుంది. ఆ విమానం రాకపోతే ఆ గాలి గుమ్మటం మనుష్యులు అడ్డదారులనుబట్టి కాలినడకను పాకిస్తాన్ సరిహద్దులను చేరుకోవలసివుంది.

ఈ కార్యక్రమాన్ని యీ మనుష్యులు ఓగిన కొన్ని గంటల్లో ముగించి వెయ్యాలి.

పాకిస్తాన్ యీ బలాన్ని సాయుధం చేసి పంపించింది. వారివద్ద మధ్య రకం మరతుపాకులు ఉన్నాయి. ఇవి ఆరు చొప్పున మాత్రమే ఇచ్చినట్లు తెలుస్తున్నది. ఇవిగాక తేలిక ఆయుధ విశేషాలను కూడా యీ గాలి గుమ్మటం సైనికులు ధరించారు. ప్రేలుడు సామగ్రులు పట్టుకు వచ్చారు. వైద్యం చేసుకు నేందుకు తగిన మందులు అన్నీ తెచ్చుకున్నారు. ఈ ఒక్కొక్క బృందానికి ఒక్కొక్క 'మేజరు' నాయకత్వం సమకూర్చ బడింది.

అయితే పాకిస్తాన్ వేసిన యీ యెత్తు పారలేదు. ఈ ప్రయత్నం పూర్తిగా విఫలమైపోయింది. పఠాన్‌కోట దగ్గర దిగిన గాలిగుమ్మటం సైనికులు, దిగి కొన్ని గంట లయినా కాకముందే పట్టుబడిపోయారు. పట్టుబడినందుకు వారు దుఃఖించలేదు. సంతోషించారు.

దీనితో యుద్ధప్రగతిలో పెద్ద మార్పు వచ్చింది.

లాహోర్ రంగంలో ఇచ్ఛోగిల్ కాల్వవుంది. ఇది అక్కడ పెద్ద అగడ్త మాదిరిగావుంది. రావీ నదినుంచి సట్లేజ్ దాకా 50 మైళ్ల నిడివిని. ఉత్తర దక్షిణాలుగా వ్యాపించివుంది. దీని వెడల్పు 120 అడుగులు. లోతు 15 అడుగులు. గట్లు గోడలను పోలి ఉన్నాయి. ఈ కాల్వ నిర్మాణం టాంకులకు యమ గండంవతుగా కొనసాగింది. ఆ గట్లమీద తుపాకివేలుస్థావరాలు, శతఘ్నివేదికలు నిర్మింపబడివున్నాయి. లాహోర్ నగరానికి బయలు సంరక్షణవ్యూహంగా దీని నిర్మాణం సాగింది.

సియాల్‌కోటవద్ద రక్షణ వలయం ఇంకోవిధంగా నిర్మాణం చెందివుంది. సియాల్‌కోట అసలే కోట. దాని చుట్టూ పటిష్ఠమైన రక్షణవలయం ఏర్పాటు చేయబడివుంది. భారత సైన్యాలు ఆ తర్వాత అక్కడ రక్షణకోసం ఏమి ఏర్పాట్లు జరిగి ఉన్నాయో తెలుసుకొన గల్గాయి. అక్కడ కొన్ని పటిష్ఠమైన రక్షణ స్థానాలు ఉన్నాయి. పర్యవేక్షణకేంద్రాలు వలల మాది రిగా నిర్మాణం చేయబడినాయి. చుట్టు ప్రక్కల గ్రామాలలో రవాణా సౌకర్యాల విధం అంతా పటాలుగా తయారు చేయబడి, ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఆ సంగతి తెలుసుకోగలందులకు వీలుగా, ఆ పటాలు పోలీసు చౌకీలలో నిక్షేపించబడినాయి. ఇవి అన్నీ ఒక్క రాత్రి, ఒక్క పగులులో జరిగే పనులుకాదు సంవత్సరాల తరబడి పని చేస్తేనే ఇటువంటి ప్రయత్నాలన్నీ సుష్ఠుగా జరగడం సాధ్యం అవుతుంది. మరి ఇక్కడ అన్నిపనులు సుష్ఠుగా జరిగాయి.

లాహోర్ రంగంలో పోరాటం భారతదేశంసరిహద్దు, ఇచ్ఛోగిల్‌కాల్వలమధ్య ఉయ్యాలజోకను కొనసాగింది. దాడి, ఎదురుదాడి పద్ధతిని నడిచింది. కాల్పులు విరమణ జరిగే నాటికి భారత సైన్యాలు ఇచ్ఛోగిల్‌కాల్వ ఒడ్డున ఉన్నాయి. ఇప్పుడు ఆ కాల్వ పొడుగునా భారత సైన్యంవుంది. ఆ ప్రాంతం అంతా ఇప్పుడు భారతదేశం ఆక్రమణలోవుంది. డోగ్రాయ్, బుర్కీలలో భారత సైన్యం పటిష్ఠ స్థావరాలు ఏర్పాటు చేసుకో గల్గింది.

సెప్టెంబరు 7 న పాకిస్తాన్ సైన్యాలు లాహోర్ రంగంలో తీవ్రమైన ఎదురుదాడిని ప్రారంభించాయి. అది చూచి ఇక్కడే అసలు యుద్ధం జరగబోతున్నదని, ఇందుకు లాహోర్ "పణ"మని అనుకున్నారు. కాని అది సరికాదు. భారతదేశం ఆలోచన అది కానేకాదు. అసలు అందుకోసం భారత సైన్యం ప్రయత్నం గూడా చెయ్యలేదు. లాహోర్ భారత్‌కు అక్కరలేదు. ఆ పని చేయడం ఎక్కువ ధర పెట్టి పనికిమాలిన బేరం చేయడంవంటిది. సైనిక వ్యూహం దృష్ట్యా అందువలన ఎటువంటి లాభమూలేదు. రాజకీయంగా అది ఒక గుదిబండ లాగా తయారయ్యేది. అసలు పాకిస్తాన్‌లో భూమిని ఆక్ర మించుకొనడం అన్నది భారతదేశం ఉద్దేశమేకాదు. శత్రువు

యొక్క సైనికశక్తిని పీలుకుమార్చడమే ఇక్కడ భారత సైన్యం లక్ష్యం. ఇదే ఇక్కడ ముఖ్యమైన కార్యం. తర్వాత జరిగిన యుద్ధంలో యీ లక్ష్యం పుష్కలంగా సాధించబడింది.

సెప్టెంబరు 7 వ తారేఖునాటి రాత్రి భారత సైన్యాలు జమ్మూ—సియాల్‌కోట్ రంగంలో ముందుకు కదిలాయి. జమ్మూనుంచి సియాల్‌కోటకు ఒక రోడ్డువుంది. ఆరోడ్డు మీద సుచేత్‌ఘర్‌వుంది. భారత సైన్యం అక్కడినుంచి యాత్రను ప్రారంభించింది. అక్కడికి తూర్పుగా 30 మైళ్ల దూరంలో వున్న ఇఖ్నాల్ చేరింది. ఈరంగంలో పాకిస్తాన్ కొంత సైన్యాన్ని సమీకరించి ఉంచింది. ఆ సైన్యాన్ని యుద్ధంలోకి లాగితే, ఇక్కడి నుంచి లాహోర్ రంగానికి సైన్యాన్ని పంపే అవకాశం పాకిస్తాన్‌కు లేకుండా పోతుంది. ఈ సియాల్‌కోట్‌రంగంలో మన సైన్యం తనకు అనుకూలమైన స్థానాలలోచేరి నిల్వగా, ఆ తర్వాత టాంకుల బలం ముందుకు నడిచింది.

సెప్టెంబరు 8 వ తారీఖున భారత సైన్యం ఇంకో ఎత్తు వేసింది. ఇది ఈ యుద్ధంలో శత్రువు కన్ను కప్పేందుకు చేసిన పని. రాజస్తాన్—సింధు సరిహద్దుల్లో గద్రా అన్న పట్టణం వుంది. అక్కడ మన సైన్యాలు ముందుకు దూకి సింధులో ప్రవేశించాయి. కరాచీ—హైదరాబాద్ ప్రాంతంలో పాకిస్తాన్ సైన్య నివహం కొంత వుంది. దాన్ని అక్కడినుంచి కదలనీయరాదు. అందుకే యీ యెత్తు. ఈ యెత్తుమూలంగా అక్కడవున్న ఆ సైన్యం యుద్ధం జరుగుతున్న చోటుకు కదిలేందుకు వీలు లేకపోయింది. స్వయంగా ఇతరమైన చర్యలకు దిగేందుకు అవకాశం లేకపోయింది. యుద్ధం కొనసాగుతున్నంత మేరా పాకిస్తానీలు భారత సైన్యాన్ని ఎదుర్కొన్నా, వారి దృష్టి అంతా సులేమాంకిమీద కేంద్రీకృతమైవుంది. ఇందులో పెద్ద ఎత్తు వుంది. ఈ సులేమాంకి సట్లెజ్ తూర్పు ఒడ్డున వుంది. ఇక్కడ పాకిస్తాన్ పెట్టుకొన్న ఆలోచన ఇది. సులేమాంకి మీదుగా ఫజిల్కా మీదుగా వద్దామని; కాని భారత్ విమాన బలం యీ ఆటను సాగనీయలేదు. ఇందుకుగాను కేంద్రీకృతమైవున్న పాక్ సైనిక కేంద్రీకరణాన్ని చిద్రుపలు చేసింది. పాకిస్తాన్ అప్పటికే కొన్ని దాడులు ప్రారంభం చేసింది. కాని, భారత సైన్యం ఆ దాడులను త్రిప్పికొట్టింది. ఈ జరిగిన సంఘర్షణలలో పాకిస్తాన్ పొందిన నష్టం అపారం.

ఇట్లా ప్రక్కవాటుగా ప్రధాన యుద్ధరంగపుసక్ష ప్రదేశాలలో చెదురు చెదురు సంఘర్షణలు కొనసాగుతూ ఉండగా, లాహోర్ రంగంలో యుద్ధం అటు వూగుతూ, ఇటు వూగుతూ కొనసాగుతూనేవుంది. అయితే అప్పటికే రెండు ప్రధాన రంగాలలో పెద్ద యుద్ధాలకు అంకురార్పణలు ఆరంభం అయినాయి; కసూర్ రంగంలోను; జమ్మూ—సియాల్‌కోట రంగంలోను.

భారత సైన్యం ప్రథమ పర్యాయం పశ్చిమ పాకిస్తాన్ మీదకు విజృంభించిన సమయంలో పాకిస్తానీ సైన్యాలు రాయ్‌విండ్ ప్రాంతంలో నిలిచి వున్నాయి. అక్కడ పాకిస్తాన్ సైన్యం ప్రథమ సాయుధ డివిజన్‌వుంది. ఇది పేరుగన్న డివిజను. పోటు యుద్ధంలో గొప్పదని పేరు. ఇప్పుడు ఈ సైన్యాన్ని పాకిస్తాన్ కసూర్ మీదుగా యుద్ధంలోకి దింపింది. ఇచ్ఛోగిల్ కాల్వ దగ్గర భారత సైన్యాన్ని నిలువరించగల్గామని పాకిస్తానీలు భావించారు. అందువల్ల ఇప్పుడు గట్టి ఎదురుదెబ్బ తీయగలమని అనుకున్నారు. పాకిస్తాన్‌యొక్క మొదటి సాయుధ బలం ముందుకు కదిలి విజృంభించడంతో సంప్రాప్తమైన ఒత్తిడిచేత భారత సైన్యం వెనక్కు తగ్గక తప్పలేదు. కసూర్ రంగంలో సైన్యాన్ని నడుపుతున్న భారత సైనికాధికారి ఇప్పుడు గొప్ప నిర్ణయం చేసుకున్నారు. ఆన సైన్యాన్ని వెనక్కు మళ్లించారు. అయితే ఆయన సైన్యం పూర్తిగా వెనక్కు తిరిగి రాలేదు. ఒక ప్రత్యేక స్థానం దాకా మాత్రమే వెనక్కు తిరిగి వచ్చింది. ఏ స్థానం దగ్గర సైన్యాన్ని మొహరిస్తే, శత్రు పురోగమన ఉధృతిని మందీకృతం చేయడం, శత్రువు ముందుకు రాకుండా అరికట్టడం సాధ్యమో, ఆ స్థానం వరకు మాత్రమే మన సైన్యం వెనుదిరిగి వచ్చింది. ఇందుకోసం కొంత మన భూమిని పాక్ సైన్యానికి 'ఎర'గా వెయ్యవచ్చు. అదే ఆలోచన. ఆ ఆలోచనతో మన సైన్యం ఖేమ్‌కరణ్ దాకా తిరిగివచ్చిఆగింది. అక్కడ యుద్ధానికి, పాకిస్తాన్ సైన్యంతో తలపడి దానిని నిలువరించడానికి సన్నాహ పడింది.

ఖేమ్‌కరణ్‌కు సమీపంలో "అసల్ ఉత్తర్" అనే గ్రామంవుంది.ఆ గ్రామాన్ని అంటి ఒక వాగు మలుపు తిరుగుతూ పోతున్నది. అక్కడ క్షేత్రం గుర్రపు డెక్క ఆకారంలో వుంది. అచ్చట మన సైన్యం పాక్ సైన్యం కోసం నిరీక్షిస్తూ నిలబడింది. శత్రువుకు ఇందులోవున్న ఎత్తు సరిగ్గా అర్థం కాలేదు. భారత్ సైన్యం ఓటమి ప్రారంభమైనదన్న దృష్టేగాని, తాను యమగండంలో జొరబడుతున్నానన్న భావమే అప్పుడు శత్రువుకు కల్గలేదు. ఆదిలాసాతోనే శత్రు సైన్యం అక్కడ ఖేమ్ కరణ్ సమీపంలో భారత సైన్యం పన్ని కూర్చున్న ఉచ్చుల్లో తలదూర్చివేసింది.

సెప్టెంబరు 9, 10-అక్కడ ఘోరయుద్ధం నడిచింది. పాకిస్తాన్ సైన్యం యీ రెండు రోజుల్లోను నాల్గుసార్లు టాంకులతో విజృంభించింది. భారత సైన్యం కదల లేదు; చెక్కు చెదరలేదు. శత్రువు దాడులకు తల ఒగ్గలేదు. శత్రువు వర్ష ధారా పాతం మాదిరిగా కాల్పులు సాగించగా, భారత సైన్యం ఎదురు కాల్పులతో సమాధానం ఇచ్చింది. పాకిస్తానీ టాంకులు చాలా ధ్వంసం అయినాయి. భారత సైన్యం తన టాంకులను చెరుకు తోటల్లో, జొన్న పొలాలలో దాచివుంచింది. శత్రువు ఒక బ్రిగేడు సాయుధ శకటాలతో విజృంభించాడు. లాభం లేకపోయింది. భారత సైన్యం ఆ శకటాలను వెనకకు తోలింది. పాకిస్తాన్ ఇంకో బ్రిగేడును ముందుకు ఉరికించింది. ఇక్కడ శత్రువుకు ఆలోచన చేసేందుకే మన సైన్యం ఎడము కల్పించలేదు. శత్రు సైన్యం వామ పక్షంలో ఒక వాగు వుంది. దానివలన కదలికకు వీలు లేకుండా పోయింది. ఈ పరిస్థితిలో భారత సైన్యం టాంకులు ముందుకు దూకాయి. రణరంగంలో "మార్" అనే మాట తప్ప ఇంకో మాటలేదు. మాట, మాటవెంట శతఘ్నులు ప్రేూశాయి. ఇది

వేట. గురితో ప్రాణం తీసే బాణం వదిలినట్లు వుంది. శత్రు సైన్యం సమీపంలోవుంది. దేశ వ్యవధి తక్కువ. మన సైన్యం 106 ఎమ్. ఎమ్ శతఘ్నులను, చేతి బాంబులను గురి తప్ప కుండా ప్రయోగించింది. ఇక్కడే ఈ యుద్ధంలోనే కంపెనీ క్వార్టర్ మాష్టర్ హవిల్‌దార్ అబ్దుల్ హమీద్‌ఖాన్ మూడు పాటాన్ టాంకులను పడగొట్టి, నాల్గవ దానిని దెబ్బతీస్తూ వీరస్వర్గం అలంకరించాడు. ఈ 22 రోజుల యుద్ధంలో ఇటువంటి సాహసకార్యాలు చాలా జరిగాయి. అందులో ఇది శేఖరం.

ఖేమ్‌కరణ్‌లో నాల్గు పాకిస్తానీ ముట్టడులు వృధా అయి పోయినాయి. ఐదవ ముట్టడి ప్రారంభమైంది. ఇది పాకిస్తాన్‌కు విపరీత పరిణామాలను తెచ్చిపెట్టింది. ఈ ఐదవవిజృంభణంలో పాకిస్తాన్ ప్రాంతీయ సాయుధ బలాధిపతి మేజర్ జనరల్ నసీర్ అహ్మద్‌ఖాన్ నిహతులైనారు. శతఘ్ని దళాధిపతి బ్రిగేడియర్ ఏ. ఆర్. షమీన్ నేలకు ఒరిగాడు. అప్పుడు అక్కడిపాక్‌సైన్యం పై అధికారులకు పంపిన ఒక సందేశాన్ని మన సైన్యం పట్టుకున్నది. అందులో ఇట్లా వుంది:—

"హమారే సబ్ సే బడా ఇమాం మారేగయే".

భారత సైన్యం చేతుల్లో పడిన ఒక పాకిస్తానీరిసాల్‌దార్ కూడా మేజర్ జనరల్ నసీర్‌ఖాన్ మరణించినట్లు ధృవ పరిచాడు. ఆయన నేలకు ఒరగగా నాల్గు పాకిస్తానీ పాటాన్ టాంకులు, నేలకు ఒరిగిన ఆయన భౌతికకాయాన్ని చుట్టు ముట్టాయి. ఆయన దేహాన్ని భారత సైన్యం చేతులలో పడనీయ లేదు. యుద్ధరంగంనుంచి తొలగించాయి. అయితే బ్రిగేడియర్ షమీన్ భౌతికకాయం మాత్రం భారతసైన్యానికి ఆ తర్వాత కన్పించింది. భారత సైన్యం సర్వ సైనిక మర్యాదల తోను ఆయనకు ఖనన క్రియలు నడిపించింది.

ఇది బ్రహ్మాండమైన విజయం. యుద్ధోపాయాలలో శ్రేష్ఠతమ మార్గాలను అనుసరించి భారత సైన్యం యీ విజయాన్ని సాధించింది. శతఘ్నిప్రయోగంలో నేర్పు వలన యుద్ధతంత్రంలో ఉన్నతస్థాయి శిక్షణవలన భారతసైన్యం యీ విజయాన్ని సాధించింది. పాకిస్తాన్ ప్రథమ సాయుధ బలం అబలం చేయబడింది. "అసల్ ఉత్తర్"లో జరిగిన యీ ఘోర సంగ్రామంలో రెండు పాకిస్తానీ రెజిమెంట్లు—నాల్గవ ఆశ్విక బలంతో సహా—నామరూపాలు లేకుండా పోయినాయి. "అసల్ ఉత్తర్" అంటే ఏమిటో అర్థం చెప్ప నక్కరలేదు. అయితే హిందీలోను, ఉర్దూలోను కూడా ఈ మాటకు ఇంకో అర్థం కూడా వుంది. మామూలు అర్థం నిజమైన ఉత్తరపు దిక్కు అని. ఇంకో అర్థం "సరియైన సమాధానం" అని. ఈ యుద్ధంలో పాకిస్తాన్ 97 టాంకులు పోగొట్టుకున్నది. అందులో కొన్ని టాంకులు చెక్కు చెదరని స్థితిలో భారతసైన్యం వశమైనాయి. రెండు టాంకులు సిబ్బందితో కూడా లొంగి పోయినాయి. ఈ టాంకులలో చాలా భాగం పాటాన్ టాంకులు.

ఈ యుద్ధంలో పాకిస్తాన్ సైనికాధికారులు కొందరు మనకు బందీలుగా చిక్కారు. వారిలో ఇద్దరు లెఫ్టినెంట్ కల్నలులు, ఆర్గురు మేజర్లు, ఆర్గురు ఇతర అధికారులు, ఎంతో మంది ఇతర హోదాలవారు ఉన్నారు.

ఇది నిజంగా పాకిస్తాన్‌కు సరియైన సమాధానం.

ఇంతకంటే ఘోర పరాజయం సియాల్‌కోట రంగంలో పాకిస్తాన్‌కోసం వేచి ఉన్నది. ఈ రంగంలో పాకిస్తాన్ తన ఆరవ సాయుధశకటబలాన్ని ప్రయోగించింది. ఈ బలం ఒక డివిజన్ శక్తితో యుద్ధానికి ఆయత్తమై వచ్చింది. ఇచ్చట సెప్టెంబరు 8 న పోరు ప్రారంభమైంది. భారత సైన్యం ఎత్తుగడలను గురించి తప్పు ఊహ వేశారు. సరాసరి సియాల్‌కోటమీద భారతసైన్యం పడు తుందని వారు అనుకున్నారు. అట్లా జరగలేదు. భారతసైన్యం ఇక్కడ ముందు రెండు గ్రామాలను—బార్వా, మహారజకేలను—ఆక్రమించుకున్నది. ఇందులో రెండో గ్రామం చాలా కీలకమైంది. ఎందుచేతనంటే, అది ప్రధానమైన రోడ్లకు కూడలి. అట్లా వానిని ఆక్రమించుకొని భారత సైన్యం దక్షిణంగా ముందుకు కదిలింది. ఎదుట సియాల్‌కోట. ఆగ్నేయంగావున్న పట్టణం ఫిల్లోరా వుంది. దాని మీదకు భారత సైన్యాలు గమనం సాగించాయి. పాకిస్తాన్ సైన్యాలు కూడా బదియానా, ప్రసూర్, షిల్లోరాలనుంచి కదలి ఎదురు దాడిని ప్రారంభించాయి. ఆ తర్వాత జరిగినవన్నీ టాంకుల యుద్ధాలు. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇటువంటి టాంకుయుద్ధాలు ఇంత ఎత్తున నడిచిన జాడలేదు. ఈ యుద్ధం ఇట్లా 15 రోజులపాటు నడిచింది. ఇక్కడ శత్రువు తన బలంలో 6, 7 రెజిమెంట్లను ప్రయోగించాడు. పాటాన్‌లు, టాంకు విధ్వంసక శకటాలు, షెర్మాన్‌లు, షాఫేలు—అన్నిరకాల టాంకులు ప్రయోగింపబడినాయి. ఈ ప్రయోగించిన పాటాన్‌లలో చాలా టాంకులు సరికొత్తవి. పెద్దగా వాడినవికాదు. వాటి టైరుల రబ్బరు ఇంతకూడా అరిగిన జాడ కన్పించలేదు.

భారతదేశం యీ యుద్ధంలో ముందు లారీలతోడి పదాతి శకటబలాన్ని వినియోగించింది. ఒక బ్రిగేడు బలం యుద్ధంలో దిగింది. గాళ్లు సరిగ్గా లేని దారుల మీదుగా యీ లారీలు కదిలాయి. మార్గం అంతా పరుషంగావుంది. గతుకులుగతుకులుగా వుంది. భూమి అంతా మైదానంలాగావుంది. శత్రువు పక్కవాటుగా ఈ సైన్యంమీద దెబ్బతీయడం మొదలు పెట్టాడు. సైన్యంపక్కాలలో దెబ్బ తీశాడు. ఇందువలన కొంత నష్టం జరిగింది. ఇది మన వ్యూహరచయితల కళ్లు తెరిచింది. తర్వాత మన సైన్యం స్థిర పురోగమనానికి అడ్డు లేదు. మొదటి రోజు యుద్ధంలో 20 శత్రు టాంకులు నాశనం చేయబడినాయి. మనవి పది టాంకులు నష్టమైనాయి. తర్వాత రెండు రోజులు స్తబ్ధంగావుంది. చిన్న చిన్న పోరాటాలు మాత్రం జరిగాయి. ఈ పోరాటాలలోకూడా శత్రు టాంకులు కొన్ని నష్టమైనాయి. మనకు ఈ రెండు రోజుల్లో ఎటువంటి నష్టము సంభవించలేదు. సెప్టెంబరు 10. ఆరోజు రాత్రి మన సాయుధ శకటబలం ఫిల్లోరా మీదకు కూచివేసి ముందుకు జరిగింది. అంతవరకు యీ మన టాంకులు పదాతి బలచక్రరక్షణలోవుండి పోరాటం సాగించాయి. ఇప్పుడు అవక్ర గతిని ముందుకు విజృంభించాయి.

ఆ మరునాడు, అనగా సెప్టెంబరు 11 న ఫిల్లోరా యుద్ధం జరిగింది. మన శకటాలను నిల్పడంలో, వ్యూహం పన్న డంలో సేనానులు అమితమైన నేర్పును, చాకచక్యాన్ని ప్రదర్శించారు. ఇచ్చట ఒక టాంకుల బారుకు ఇంకో టాంకుల బారు ఆసరా. ఇట్టి ఆసరాతో మన టాంకులు పక్ష గమనం చేశాయి. ఇది విచిత్ర చక్రమణంగా సాగిపోయింది. శత్రువు పదాతికి, టాంకుల బలానికివున్న అనుబంధం యీ గమనంతో విచ్ఛిన్నంచేయబడింది. మరియొక యెత్తులో శత్రువు టాంకుల దళాల మధ్యనే గండ్లు కొట్టబడినాయి. ఇప్పుడు శత్రువు టాంకుదళాలు ఒక దానినుంచి ఒకటి దూరమైపోయినాయి. ఒక దానితో ఒకటికి సంబంధం లేనివిధంగా పృధక్కరింపబడినాయి. శత్రువుకు ఇప్పుడు క్రమ్మికు రావడంకన్నా ఇంకో ఎత్తు మిగలలేదు. శత్రువు తన విడి విడి టాంకు దళాలతో క్రమ్ముకుని వచ్చాడు. అదే కావలసింది. మన సైన్యం ఆ టాంకులను తాపీగా, తొందరతో నిమిత్తంలేకుండా చావు దెబ్బ తీసింది.

ఇక్కడ యుద్ధోపాయాలకౌన్నత్యమేగాక, ఆయుధ ప్రయోగంలో కూడా ప్రశస్తమైన నైపుణ్యం భారత సైన్యం చేత ప్రదర్శింపబడింది. శత్రువు తాలూకు టాంకులు 66 దాకా నాశనమైపోయినాయి. ఇది ఒక్కరోజు యుద్ధంలో జరిగిన పని. ఆ యుద్ధంలో మనం ఆరు టాంకులను మాత్రమే నష్టపడ్డాము.

ఇది శ్రేష్ఠమైన విజయం. ప్రపంచంలో జరిగిన టాంకులయుద్ధముల చరిత్రలో ఈ యుద్ధానికి ప్రముఖ స్థానం ఉంది.

ఆ మధ్యాహ్నానికి ఫిల్లోరావద్ద పాకిస్తానీ టాంకు బలం దాదాపు అత్యయస్థితిలో పడిపోయింది. గట్టి దెబ్బతిన్నది. ఆ తర్వాత కొంత సేపటికి భారతపదాతి బలాలువచ్చి, పాకిస్తానీ రక్షణ చక్రాన్ని చీల్చి, ఫిల్లోరా పట్టణాన్ని పట్టుకున్నాయి. ఈ యుద్ధంలో ఒక పాకిస్తానీ ''బడే ఇమాం'' నిహతుడైనట్లు తెలుస్తున్నది. బహుశా ఆ ''బడే ఇమాం'' బ్రిగేడ్ కమాండర్ అయివుండవచ్చు.

ఆపైన మరో మూడు రోజులపాటు యుద్ధం సద్దుమణిగినట్లు వుంది. ఈ మూడు రోజులలోను పాకిస్తాన్ సైన్యం పునః సమీకృతమైంది. అదనపు బలాలను పిలిపించుకొన్నది. అయితే ఈ మూడు రోజులపాటు మన సైన్యం వూరికే కూర్చోలేదు. 20 శత్రు టాంకులను తాత్కాలికంగా పనికి రాకుండా చేసింది. ఇప్పుడు భారతసైన్యం టాంకులతో సహా పశ్చిమ ముఖంగా చావిందా మీదకు కదిలింది. ఈ పట్టణం సియాల్ కోట్—పస్రూర్ రైలు మార్గంమీద వుంది. పాకిస్తాన్ రక్షణ పద్ధతిలో ఈ రైలు మార్గం చాలా ప్రధానమైంది. సెప్టెంబరు 15 న భారతసైన్యాలు యీ రైలు మార్గాన్ని అటకాయించాయి. తెగగొట్టాయి. ఇక్కడ యుద్ధం సెప్టెంబరు 14 న ప్రారంభమైంది. ఇది టాంకులతో జరిగిన యుద్ధాలలో మూడవది. సెప్టెంబరు 17 దాకా సాగింది. ఈ నాల్గు రోజుల పోరాటంలోను పాకిస్తాన్ టాంకులు 76 దెబ్బ తిని పోయినాయి.

ఈలోగా భారత సైన్యం తాలూకు ఇతర వాహినులు సియాల్‌కోట్—పస్రూర్ రోడ్డును ఛేదించి వేశాయి. అక్కడి నుంచి సియాల్‌కోటమీదకు ఉత్తరదిక్కునుంచి విజృంభించాయి. పాకిస్తాన్ సైన్యం తీవ్రాతి తీవ్రంగా మన సైన్యం పురోగతిని ప్రతిఘటించింది. ఎదురు దాడి చేద్దామని కూడా పాకిస్తాన్ సైన్యం ఆయత్తం అయింది. ఈ ఎదురుదాడితో సుచేత్‌పూర్‌ను చుట్టు ముట్టాలన్నది పాకిస్తాన్ ఉద్దేశం. కాని ఆ ఎత్తు పడలేదు. భారత సైన్యం పాక్ సైన్యాన్ని మెసల నీయలేదు. పాకిస్తాన్ ఎత్తిన ఎత్తుకోలును భారతపదాతిబలం తిప్పికొట్టింది.

సియాల్‌కోట్—పస్రూర్ రైలు మార్గంపై తన ఆధిపత్యాన్ని పునరుద్ధరించుకొనడానికి పాక్‌సైన్యం విశ్వ ప్రయత్నం చేసింది. అది కూడా సాగిరాలేదు. సెప్టెంబరు 23 ఉదయం 3—30 గంటలకు కాల్పుల విరమణ జరిగే వేళకు ఈరంగంలో 180 చదరపుమైళ్ళప్రాంతం భారతసైన్యం ఆక్రమణలో ఉండిపోయింది. ఇందులో ఒకఅంచు సియాల్‌కోటకు సరిగ్గా 4 వేల గజాల దూరంలోవుంది. ఇంకో అంచు చాలిందా దరిదాపుల్లో వుంది.

టాంకులకు టాంకులకు జరిగిన యుద్ధంలోనేమి పదాతిబలం తాకిడిలోనేమి, శతఘ్నుల దాటికి యేమి ఆగలేక దాదాపు 243 దాకా పాకిస్తానీ టాంకులు పనికి మాలిన స్థితిలో పడిపోయినాయి. ఇందులో భారత విమాన బలం పాలు కూడా కొంత ఉంది. ఈ ఛేదిన టాంకులలో అధికభాగం ఇప్పుడు భారతదేశం ఆక్రమణలోవున్న పాక్‌ప్రాంతంలోనే పడిఉన్నాయి. ఈమాట అర్థం ఇది. ఆ టాంకులను పాకిస్తాన్ పూర్తిగా కోల్పోయింది.

భారతదేశం పొందిన నష్టాలు ఇంతగాలేవు. మన టాంకులు కూడా దెబ్బతిన్నాయిగాని, వాటిని వెంటనే తెచ్చుకొని, మరమ్మతులు చేయించడంచేత, యీ నష్టం నికరపు లెక్కలో తగ్గవచ్చు.

టాంకులయుద్ధాలు గట్టి నేలమీద జరిగాయి. అచ్చట భూమి మథించబడినట్లు అయిపోయింది. ఇటు సైన్యాలు అటు రైతులు కూడా అప్పుడు ఆకాశం వంక చూస్తూ వచ్చారు. వారూ, వీరు ఒకే అందుకు చూడలేదు. వర్షమే గనుక పడివుంటే టాంకులన్నీ బురదలో దిగబడి ఉండేవి. అప్పుడు యుద్ధ గమనమే ఇంకో విధమై ఉండేది. ఇప్పుడు పాకిస్తాన్ టాంకులు, ఇతర యుద్ధ పరికరాలు పూర్తిగా హూనం హూనం అయిపోయినాయి.

భూమిమీద సైన్యాలు ఇట్లా ఒండొంటిని తలపడి పోరాటం సాగిస్తూ ఉండగా, అటు ఆకాశంలో ఉభయ దేశాల విమానాల మధ్యను పెనుసంఘర్షణలు జరుగుతూ వచ్చాయి. యుద్ధం ముగిసి కాల్పుల విరమణ జరిగే వేళకు భారత విమానబలం

# యుద్ధక్రమం

పూర్తి విజయాన్ని సాధించింది అని చెప్పడానికి లేకపోయినప్పటికి, "ఆకాశ రంగంలో" భారత దేశానికి అనుకూలమైన పరిస్థితిని మాత్రం సృష్టించగల్గింది. యుద్ధం చివరి దశలో ఉన్న దినగా భారత విమానాలు చాలాసార్లు శత్రు భూమిపై ఎగిరి వచ్చాయి. పాకిస్తాన్ విమానాలు యుద్ధానికి ఏమన్నా వస్తాయేమోనని ఎత్తువేసి చూచాయి. కాని పాక్ విమానాలు యీ సవాలును మనోవాక్కాయకర్మలా తిరస్కరించాయి.

యుద్ధం ప్రారంభమైన కొద్ది రోజుల అనంతరంనుంచి కూడా పాకిస్తాన్‌విమానాలు మన విమానాలతో ముఖాముఖి యుద్ధం అంటే హడలి పెడముఖం పెట్టాయి. ఆ విమానాలు వచ్చి మన స్థావరాలమీద దాడి చేసిన సందర్భాలలో కూడా అవి తొందరపాటును, భయాన్ని ప్రదర్శించాయి. అట్లా వచ్చినట్లు వచ్చి, గురిచూచి కొట్టకుండా, ఏదో మొక్కుచెల్లించుకుంటున్న పద్ధతిలో పని చేసి, దాగుడుమూతలాడాయేగాని పాకిస్తాన్ విమానాలు మన విమానాలతో ఖుద్దున యుద్ధం చెయ్యడానికి సన్నద్ధం అయిన పద్ధతే ఎక్కడా గోచరించదు. పాకిస్తాన్ విమానాలు ఒక పద్ధతి,ఒక క్రమం అంటూ లేకుండా,నిర్విచక్షణగా దాడులు సాగించాయన్న ఆరోపణ ఒకటివుంది. బహుశా భారత విమానాలంటే ఆ విమానాలకు గుండెలకు తట్టిన బెదురే ఇందుకు కారణం అయివుంటుంది. పాక్ విమానాలకు గురి చూసి కొట్టగల శక్తియే తక్కువ. అందులోను భారత్ విమానాలు ఎక్కడవచ్చి పడతాయో అని పెద్ద భయం. అందువల్లనే ఆ విమానాలు, భారత విమానాలు కన్పించి ప్రతిఘటించి రాబోతున్నట్లు ఆచూకి కన్పించగానే బాంబులను వదలడం, పారిపోవడం మొదలుపెట్టాయి. ఫలితంగా సైనికేతరమైన స్థానాలు దెబ్బ తింటూ వచ్చాయి. ఒకవిధంగా ఆలోచిస్తే, భారత విమానాలంటే పుట్టిన భయంవల్లనే పాక్ విమానాలు గురి చెడినాయేమోనని కూడా అనిపిస్తుంది. అయితే పాకిస్తాన్ విమానాలు ఒక పనికిమాలిన పని చేశాయి. గుజరాత్ ముఖ్యమంత్రి భారత భూభాగంలో విమానంమీద పోతూవుండగా ఆ విమానాలు ఆ విమానాన్ని కూల్చాయి. ఇంతకంటే అసహ్యపు పని ఇంకోటిలేదు. ఇది క్షంతవ్యమైన విషయంకాదు.

అదేవిధంగా 'నాపాం' బాంబు ప్రయోగం కూడా పరమ అనాగరకమైంది. ఆ బాంబులతో పాకిస్తానీలు అనేకమంది అమాయకుల హతమార్చారు.

భారత విమానబలం కొన్ని ప్రతిబంధకాలలో పడి పని చేయవలసి వచ్చింది. అగ్ర ప్రాంతాలలోవున్న విమాన స్థావరాలు మనకు ఆట్టేలేవు. ఆ వున్న స్థావరాలనుండే మన విమానాలు తమ కార్యక్రమాన్ని నిర్వహించవలసి వచ్చింది. పైగా మనకు అనేక రకాల విమానాలు ఉన్నాయి. పాకిస్తాన్‌కు అట్లా కాదు. ఇక్కడ పాకిస్తాన్ అనుకూలస్థితిలో ఉన్నది. మన విమాన బలం ఇన్నిరకాల విమానాలను సరిచూచుకుంటూ, సరిదిద్దుకుంటూ రావాలి. వాటి ఆయుధాలు వాటికి చూచుకోవాలి. అదేవిధంగా వేటికి చెయ్యవలసిన పనులు వాటికి చెయ్యాలి. అయినా మన ఇంజనీర్లు, వైమానికులు బ్రహ్మాండమైన పనులు చేశారు. విమానాలు ఎప్పుడు అనుకుంటే అప్పుడు యుద్ధంలో ప్రయోగించడానికి సిద్ధంచేసి ఉంచారు. అందువల్లనే మన విమానాలనుగాని, విమానాశ్రయాలనుగాని పాకిస్తాన్‌అంతగా ఏమీచెయ్యలేక పోవడం. మరి మన విమాన స్థావరాల విధ్వంసాన్ని తలపెట్టి పాక్ విమానాలు తక్కువ ప్రయత్నాలు ఏమీ చెయ్యలేదు. రాడార్ ఏర్పాట్ల విషయంలో కూడా మనం తీసికట్టే. అయితే ఇక్కడ కూడా మన రాడార్ సిబ్బందియొక్క ఉన్నత స్థాయి నైపుణ్యంవలన ఎంతలెంతలో పనులు జరిగాయి.

ఆకాశంలో జరిగిన యుద్ధాన్ని గురించి వ్రాస్తున్నప్పుడు, పాకిస్తాన్ పొందిన నష్టాలను గురించి చెప్పకపోతే కథ పూర్తికాదు. భారత విమానాలలో ఉపయోగింపబడిన ఆయుధాలు, ఇప్పటి కాలపు ఆయుధాలతో పోలిస్తే, పాతవి. అయినా మన వైమానికులు పాకిస్తాన్ విమానాలను పక్షుల్ని కూల్చినట్లు కూల్చి వేయగల్గారు. పాకిస్తాన్ విమాన బలాధిపతి ఎయిర్ మార్షల్ నూర్‌ఖాన్ తమ విమానాలు 14 కన్నా నష్టం కాలేదని అంటున్నారు. ఈ పద్నాలుగులోను పదిమాత్రమే భారతదేశం విమానాలచేతుల్లో నేల కూలాయని ఆయన వాదం. తక్కినవి ప్రమాదాలకు గురి అయ్యో, లేక పాకిస్తాన్ స్వయంకృతాపరాధంవల్లనో కూలి ఉంటాయని ఆయన అంటున్నారు. ఆయనతో మనకు తగాదా అనవసరం. కానీ ఒక్క అమృత్‌సర్ ప్రాంతంలోనే మన శతఘ్నులదెబ్బలకు గురియై పది పాకిస్తాన్ విమానాలు నేలమీద కూలిపడ్డాయి.

భారత్ విమాన బలం చేయవలసిన పని ఒక్కటి కాదు; ఎన్నో ఉన్నాయి. భారతసైన్యం ముందుకుపోతూవుంటే, ఆ సైన్యానికి అండగా ముందు దాడులు చేయడం, సైన్యాన్ని రక్షించడం, ఆ సైన్యానికి అండగా గొడుగుపట్టడం, శత్రు సంచారాన్ని కనిపెట్టడం, శత్రువు సరఫరాల సంగతి తెలియడం, దెబ్బ తీయడం; ఇన్ని పనులుకాక, శత్రు వైమానిక స్థావరాలపై దాడులు చెయ్యాలి. ఆకాశ దేశంలో గస్తీలు తిరగాలి. మన విమానాలు యీ అన్ని పనులను సమర్థంగా నిర్వహించాయి. ఒక పైలట్ అన్నాడు—పని చెయ్యడంలో బాధలేదు. వేచి ఉండటంలోవుంది. విమానాలు ఒక పనిమీద వెడతాయి. అది ఫలానా అప్పుడు అని తెలిస్తే బాధలేదు. అది ఎప్పుడూ అని చూస్తూ కూర్చోవడం ఒక బాధ. సరే, విమానాలు వెళ్ళాయి. అవి క్షేమంగా తిరిగి వస్తున్నదీ, లేనిదీ చూచుకుంటూ మిగిలినవారు ఆకాశంలో కన్పించిన ప్రతి "చుక్కను" తిలకిస్తూ కూర్చోవలసి వుంటుంది. ఇది ఇంకో బాధ; కాదు యాతన.

ఒక బ్రిటిష్ పత్రికా విలేఖరితో మాట్లాడుతూ, పాకిస్తాన్ విమాన బలాధిపతి ఎయిర్ మార్షల్ నూర్‌ఖాన్ భారత్ విమానాలను గూర్చి ఒక మాట అన్నారు. భారత విమాన బలం చెదురు చెదురు దండయాత్రలు సాగించి తన బలాన్ని వృథా చేసుకున్నదన్న ఒక అభిప్రాయాన్ని అభివ్యక్తం చేశారు. పాకిస్తాన్ విమానస్థావరాలను దెబ్బతీయడమే భారతదేశం లక్ష్యం అయితే, కేంద్రీకృతంగా తీవ్రంగా దాడులు సాగించి ఉండవలసిందన్న భావాన్ని కూడా ఆయన వెల్లడించారు. అయితే భారత విమానబలం ఏమినిర్ణయం చేసుకున్నదో, ఆ నిర్ణ

యాన్ని బాగా ఆలోచించిన మీదటనే చేసుకున్నది. ఇక్కడ మన విమానబలం ప్రధానలక్ష్యం ఒక్కటే. ముందుకు విజృంభిస్తున్న భారతసైన్యానికి అండగా ఉండటం. తక్కిన ఉపాయాలన్నీ ఔపచారికాలు. ఆనుషంగికాలు. యుద్ధం ప్రారంభం అయిన తొలిదశలో విమానబలంఅన్నదాని ప్రధాన కర్తవ్యం యీవిధంగానే ఉంటుంది. ఇప్పుడు ఇంతజరిగిన తర్వాత వెనక్కు తిరిగి చూచుకుంటే, ఈ జరిగిన నిర్ణయం సరియైనదేనని నిర్ధారణఅవుతున్నది. ఆ నిర్ణయంవలన ఏ లాభాలు కల్గాలని, ఏ ఫలితాలు సంభవం కావాలని ఆశించడం జరిగిందో, ఆ లాభాలు కల్గాయి. ఆ ఫలితాలు సంభవం అయినాయి.

యుద్ధం ప్రారంభం అయిన తొలి రోజుల్లో మన విమానాలు పాకిస్తాన్ విమాన స్థావరాలను అన్నింటిని ఒక్కసారి ఒట్లా చుట్టి వచ్చాయి. ఆ పని చేసినందువల్ల పాక్ విమాన బలం ఎత్తు ఏమిటో మనకు అవగతం అయిపోయింది. ఆ తర్వాత మన కాంబెర్రాలు ఒక్కొక్క పాకిస్తాన్ విమానాశ్రయాన్ని హూనం చేయడం మొదలుపెట్టాయి. ముఖ్యమైన పాక్ విమాన స్థావరాలకు మన విమానాలతాకిడి అధికమైపోయింది. కరాచీ దగ్గర మీర్‌పూర్ విమానస్థావరం వుంది. అక్కడినుంచే పాక్ విమానాలకదలిక అధికం. మన విమానాలు ఆ విమాన స్థావరంమీద దాడి చేయలేదు. సార్గోధా, అక్వాల్, పెషావర్, కోహట్, చల్‌ఝుమ్రా, రిసాల్‌వాలా, ఛక్లాలా, ఇంకా మరి కొన్ని పాకిస్తాన్ విమానస్థావరాలు మన విమానాల దాడులకు అధికంగా గురియైనాయి. కరాచీ, రావల్‌పిండి, ఢక్కా, చిట్టిగాంగ్‌లమీద మన విమానాలు ఎగురనుకూడా ఎగురలేదు. కాని పాకిస్తాన్ రేడియో యీ విషయంలో అసత్య ప్రచారం చేసింది. అక్కడి స్థావరాల మీద కూడా భారత విమానాలు దాడి చేశాయి, అంది. అది నిజంకాదు. అదేవిధంగా పాకిస్తాన్ రేడియో ఇంకో అబద్ధపు ప్రచారాన్ని గూడా సాగించింది. మనం కూడా పాకిస్తాన్‌లో గాలి గుమ్మటం బలాలను దింపినట్లు ఒక మాటను ప్రచారంలోకి తెచ్చింది. ఈ మాట నిజంకాదు. మనం పాకిస్తాన్‌లో ఎక్కడా గాలి గుమ్మటం బలాలనుదింపలేదు.

ఆకాశంలో జరిగిన యుద్ధాలలో భారత విమాన బలం నైపుణ్యం, ఆయుధ వినియోగశక్తిలోనేర్పు ప్రస్ఫుటమై గణుతికి ఎక్కాయి. శత్రువుకు గుండె గుభిల్లుమనడానికి కారణం అయినాయి. ఈ యుద్ధంలో దాదాపు 70 దాకా శత్రు విమానాలు ధ్వంసం అయినాయి. వీనిలో కొన్ని మన విమానాల దెబ్బలతో, మరికొన్ని భూ సైన్యం కాల్పులతో దెబ్బతిన్నాయి. మనము కూడా దాదాపు 35 దాకా విమానాలను పోగొట్టుకున్నాము. ఇవికాక ఉభయపక్షాలకుచెందిన విమానాలు మరికొన్ని దెబ్బ తిన్న జాడ కన్పిస్తున్నది. పాకిస్తాన్ వైమానికులు గూడా చాలా మంది నష్టమైపోయినారు. అటువంటి వారిని తిరిగి సంపాయించాలంటే నిజంగా కష్టమే అవుతుంది. పాకిస్తాన్ సాగిస్తున్న ప్రచారంప్రకారం యీ యుద్ధంలో దాదాపు 113 దాకా భారత విమానాలు నాశనం అయిఉండాలి. వీనిలో 78 విమానాలను తమ విమానాలు పట్టపగలే కూల్చి వేసినట్లు పాకిస్తాన్ చెబుతున్నది. ఈ ప్రచారం పట్టి బుద్ధిజాడ్యజనితోన్మాదం. ఒక్క మాటకూడా నిజం కాదు. ఈ యుద్ధంలో తన విమానాలకు వాటిల్లిన నష్టాన్ని కప్పిపుచ్చుకోడానికి పాకిస్తాన్ పన్నుకున్న అవగుంఠనం అని మాత్రమే మనం యీ అబద్ధాలను గూర్చి వ్యాఖ్యానించవలసి ఉంటుంది.

పాకిస్తాన్‌అయితే తూర్పురంగంలో కూడా యుద్ధాన్ని విస్తరింప చేయడానికి పూనుకున్నది కాని భారతదేశం ఇచ్చట ఎంతో సంయమనాన్ని ప్రదర్శించింది. పరిమితమైన చర్యలు తప్ప పెద్దఎత్తు దాడులకు దిగలేదు. పాకిస్తాన్‌ను గురించి కూడా ఇక్కడ ఒక మాట చెప్పాలి. ఈ తూర్పు రంగంలో పాకిస్తాన్ విమానాలు మాత్రం కొద్ది హడావుడి చేశాయి. సైన్యాలు ముందుకు రాలేదు. భారతదేశపు సరిహద్దు చౌకీలమీద కాల్పులు సాగించడం మాత్రంతో సంతృప్తిచెందాయి. సెప్టెంబరు 8, సెప్టెంబరు 15 తేదీల నడుమ ఇటువంటి కాల్పులు కూచ్‌బీహార్ సరిహద్దుల్లో కొన్ని చౌకీలమీద, అస్సాంలో గోలక్‌గంజ్ ప్రాంతంలోని కొన్ని చౌకీల మీద పాకిస్తానీలు సాగించారు. అయితే శత్రుబలాలు ఇట్లా ఎందుకు యీకాల్పులు సాగించింది విశదం కాకుండా ఉంది. బహుశా తూర్పు పాకిస్తాన్‌లో జాతీయ భావోద్వృతిని ఉధృతపరచడానికి ఈ చిల్లర కాల్పులను పాకిస్తాన్ సైన్యం ప్రారంభించి ఉండవచ్చు. లేకపోతే తనకు మిత్రము, చైనాను మేలుకొల్పడానికి యీ కాల్పులు హెచ్చరికలు కావచ్చు.

పాకిస్తాన్ చేసిన పనులలో ఎట్టి చిలిపిగాను, విప్రయోజకంగాను కన్పించేది ఒకటి వుంది. అది ద్వారకమీద పాకిస్తాన్ తన నౌకలచేత కాల్పులు సాగింపించడం; అక్కడ ఆ ద్వారక దగ్గర సైన్యసంబంధమైన స్థావరాలు ఏమీ లేవు. పాకిస్తాన్ చేసిన యీ అల్లరిపనిని చూచి భారత్ యుద్ధనౌకలు బొంబాయి నుంచి కదిలి, యీ యుద్ధం నడిచినంతకాలం, తిరిగి పాకిస్తాన్ నౌకలు అల్లరి పనులకు అంటూ దిగకుండా చేశాయి. పాకిస్తాన్ నౌకలకు కరాచీని వదిలిరావడం అంటే భయం అయ్యేట్లు చేశాయి. అయితే పాకిస్తానీనౌకల యీ చర్యకు కూడా ఏదో అర్థం ఉండకపోదు. భారతదేశం నౌకలు బెలూచిస్తాన్ తీరంలో దాడిని కొనసాగించవచ్చునని పాకిస్తాన్ వూహించి ఉంటుంది. ఇది ఇట్లా కాని పక్షంలో ఇరానియన్ ఫ్రిగేట్లు, పాకిస్తాన్‌నౌకల సంఘర్షణకు సంబంధించిన విచిత్రమైన వార్తలకు అర్థం కుదరదు. ఆ ఇరానియన్ ఫ్రిగేట్లు పర్షియన్ సింధుశాఖనుంచి బయలుదేరి ప్రయాణం చేస్తూ ఉండి వుంటాయి. అవి భారతదేశం నౌకలు అనుకొని, పాకిస్తాన్ నౌకలు వానిపై కాల్పులు సాగించి ఉంటాయి. ఈ సంఘర్షణను గురించి ప్రచారంలోకి వచ్చిన వార్తలనుబట్టి ఇరానియన్ నౌకలు యీ సందర్భంలో ఎదురు కాల్పులు సాగించినట్లు తెలుస్తున్నది. ఈ ఘర్షణలో క్షతకాయమైన ఇరానియన్ ఫ్రిగేట్లకు ఇప్పుడు కరాచీలో మరమ్మత్తులు జరుగుతున్నట్లు వినవస్తున్నది. ఈ కథ నిజమైతే,

# యుద్ధ క్రమం

అప్పుడు పాకిస్తాన్ రేడియో ఒకరోజున ప్రసారం చేసిన వార్తకు అర్థం కుదురుతుంది. సెప్టెంబరు 22 న నౌకా యుద్ధం జరిగిందని, అందులో పాకిస్తాన్ నౌకలు ఒక భారత దేశం నౌకను ముంచివేశాయని ఆ వార్త తాత్పర్యం. అప్పుడు యీ జరిగిన ఉదంతం అంతా పెద్ద ప్రహసనం అనే చెప్పాలి.

భారత పాకిస్తాన్‌లమధ్య కాల్పుల విరమణకు సమితి కార్యదర్శి చేసివున్న ప్రతిపాదనలకు సెప్టెంబరు 14 నాడే అంగీకరించడానికి భారత ప్రభుత్వం తన సంసిద్ధతను వ్యక్తం చేసి వున్నది. అప్పటికే పాకిస్తాన్ విషయంలో తాను పెట్టుకున్న లక్ష్యాన్ని భారతదేశం సాధించింది. పాకిస్తాన్ తనకు ఏదో సైనిక శక్తి వున్నదని విర్రవీగుతున్నది. ఆ శక్తిని కుంఠితం చెయ్యడమే, పదును తగ్గించడమే, ఇక్కడ భారతదేశం లక్ష్యం. సెప్టెంబరు 14 నాటికి ఆ పని పూర్తిఅయింది. అయితే పాకిస్తాన్ మాత్రం యుద్ధ విరమణకు అంగీకరించ లేదు; తిరస్కరించింది. ఈ తిరస్కరించడం—తనకు యీ యుద్ధంలో గెలిచే అవకాశం ఏదో వున్నదని మాత్రంకాదు. చైనా జోక్యం చేసుకునే స్థితిని చూపించి, రాజకీయంగా కొన్ని 'లాభాలను పొందవచ్చునని మాత్రమే పాకిస్తాన్ అట్లా చేసింది. అప్పటికే పాకిస్తాన్‌కు చైనా 'శ్రీముఖాలు' పంపుతుందని తెలుసు. సెప్టెంబరు 6 న భారత కాలమానం ప్రకారం ఉదయం 9—30 గంటలకు చైనా తన శ్రీముఖాన్ని భారత్‌కు అందజేసింది. అందువల్ల దౌత్య స్థాయిలో కొంత అలజడి అంటూ బయలుదేరిందికాని పాకిస్తాన్‌కుమాత్రం లాభం ఏమీ కల్గలేదు. భారత దేశానికి చైనా అందజేసిన రెండవ 'శ్రీముఖం' కూడా కాల దోషం పట్టిన తర్వాత, కొన్ని గంటల అనంతరం, శ్రీ భుట్టో భద్రతా మండలితో యుద్ధ విరమణకు పాకిస్తాన్ ఆమోదాన్ని ప్రకటించారు.

సెప్టెంబరు 23 ఉదయం 3—30 గంటల దగ్గర నుంచి ఉభయ దేశాల మధ్యను యుద్ధం విరమించబడింది. అయితే అంతకుముందు, ఆ తర్వాతను కూడా పాకిస్తాన్ తనకు సాధ్యమైనంతలో ఎక్కువ ప్రాంతాన్ని భారత సైన్యం చేతుల్లోంచి తొలగబెట్టి ఆక్రమించుకొనడానికి విపరీతమైన పాట్లు పడింది. అవును మరి! ఈ యుద్ధంలో తాను అఖండ విజయం సాధించినట్లు పాకిస్తాన్ తన ప్రజలలో ప్రచారం చేసింది. అది నిజం అని నిరూపించుకోవాలంటే ఇటువంటి పాట్లు పడక పాకిస్తాన్‌కు తప్పదు. ఇక పాకిస్తాన్ విజయం సంగతి అంటారా, పరిస్థితి అందుకు పూర్తిగా విరుద్ధంగా వుంది. భూమిమీదనేమి, ఆకాశంలోనేమి, పాకిస్తాన్ సైన్యాలు గట్టి దెబ్బ తిన్నాయి.

ఈ జరిగిన యుద్ధంలో పాకిస్తాన్ ఏదో ఒకటీ అరా డివిజన్‌ను మినహా తక్కిన సర్వ సైన్యాన్ని ప్రయోగించింది. తన సాయుధ శకట బలాలను, రిజర్వు బలాలను, సామి—సైనిక నివహాలను, గాలి గుమ్మటం సైన్యాలను, విమాన బలంయావత్తును ఉపయోగించింది. ఇంకా యీ యుద్ధాన్ని కొనసాగించాలంటే, అక్కడ వెనుక తాహతులేని స్థితిలో పాకిస్తాన్ పడిపోయింది. పూర్వం యుద్ధాల్లో పాల్గొని, ఇప్పుడు పౌర ఉద్యోగాలు నిర్వహిస్తున్న మాజీసైనికనివహాలకు గూడా యుద్ధంలోకి రావలసిందిగా ఉత్తర్వులు జారీ చేసింది. ఇప్పుడు యీ యుద్ధంలో పాకిస్తాన్ సైన్యంలో దాదాపు 5 వేలమంది మరణించడమో, లేక క్షతగాత్రులు కావడమో జరిగింది. ఈ రిజర్విష్టులను చేర్చుకుంటే యీ లోపం భర్తీ అవుతుంది. అంతకన్నా జరిగేది, ఒరిగేది పాకిస్తాన్‌కు ఏమీలేదు.

ఇక్కడ ఇంకో విషయం కూడా వుంది. పాకిస్తాన్ ఈ యుద్ధంలో తనకు నిల్వ వున్న ఆయుధాలను గూడా అధికంగా ఉపయోగించింది. అందువల్ల అదనంగా బలాలను పెంచుకుంటే అప్పుడు వారికి ఆయుధాలు సమకూర్చడం, తగు పరికరాలు ఇవ్వడం పెద్ద సమస్య అయిపోతుంది. ఇక్కడ తగినంత అంగబలం లభిస్తుందా అన్న విషయం కూడా ఉంది. ఈ విషయంలో భారతదేశం పరిస్థితి ఎంతో మెరుగ్గావుంది. ఈ జరిగిన యుద్ధంలో మనం ఉపయోగించిన సైన్యమూ తక్కువ. మనం విమానంబలంగాకూడా ఇందులో ముక్త సరిగానే వినియోగింపబడింది. అందువలన నష్టాలు కూడా తక్కువే; అంతేగాక పాకిస్తాన్‌వలన వచ్చిన యీ బెడదను ఎదుర్కొనడానికిగాను, ఉత్తరపు సరిహద్దులలోని మన సైన్యాన్ని పెద్దగా కదిలించవలసిన అవసరంకూడా కల్గలేదు.

యుద్ధ విరమణ అంటూ కుదిరినప్పుడు, ఉభయ పక్షాల నీతి దార్ఢ్యం సంగతి కూడా విభిన్నంగావుంది. యుద్ధం ప్రారంభం అయినప్పుడు పాకిస్తాన్ అన్నివిధాలుగా ఆధిక్యము కల్గివుంది. ఎక్కువ ఆయుధాలు ఉన్నాయి. ఆ ఆయుధాలు అన్ని విధాలుగాను శక్తివంతమైనవి. అందువల్ల తన ఆయుధబలంపై పాకిస్తాన్ అమితమైన విశ్వాసంతో ఉన్నదంటే, అది ఎబ్బెట్టు ఎంతమాత్రంకాదు. ఇక శిక్షణ విషయంలో కూడా పాశ్చాత్య రాజ్యాల నిపుణులు పాకిస్తాన్ సైన్యానికి బ్రహ్మాండమైన కితాబులు ఇచ్చారు. అసలు పాకిస్తాన్‌కు వున్న "క్షత్ర సంప్రదాయం" భారత దేశానికి లేదని కూడా అన్నారు. ఇది అంతా సరే. అంత మాత్రంచేత భారత సైన్యం పాటవాన్ని న్యూనంచేసి చూడవలసిన అవసరంగాని, తక్కువచేసి అంచింవలసిన పనిగాని ఇక్కడలేదు. అది ఇక్కడ జరిగింది. అదేవిధంగా యుద్ధం వచ్చినప్పుడు దాన్ని తుదముట్ట చూచే ఇచ్ఛాశక్తి కూడా భారత సైన్యానికి తక్కువయేనని నిపుణులంతాకలిసి అంచనా వేశారు. ఇప్పుడు జరిగిన యీ యుద్ధం సంగతి సమీక్ష చేసి చూస్తే, ఇటు భారతదేశమూ, అటు పాకిస్తాన్‌మూ, ఉభయ దేశాలు యుద్ధంలో సంఖ్యలో సమతూలంగానే బలాలను దింపాయి. భారత సైన్యం సంఖ్య విషయంలో యీషదధికంగా ఉన్నదనుకుంటే, ఇతరమైన శక్తి సంపన్నత పాకిస్తాన్‌కు అధికంగా వుంది. అయితే యుద్ధంలో పాకిస్తాన్ 'శ్రీ' స్థానంలో నిలబడలేకపోయింది. ఈ యుద్ధం ఇంకోవిషయాన్నిగూడా స్పష్టంగా తెల్పుతున్నది. పాకిస్తాన్ సైన్యం నాయకత్వంకన్నా భారత సైన్యం నాయకత్వం ఉన్నతమైంది. పాకిస్తాన్ సైన్యం శిక్షణకన్నా భారత సైన్యం శిక్షణ ప్రకృష్టమైంది.

# అసుర సంధ్య

[శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారి నవల గత మాసంతో ముగిసినది. దాని చిత్తు ప్రతికి సాఫు ప్రతిని వ్రాయడములో కొన్నిభాగాలు పోయినాయి. వారు ఈ విషయం తెలుపుతూ అసలు పాఠాన్ని పంపారు. పాఠకుల సౌకర్యంకోసం దానిని ప్రకటిస్తున్నాము.]

తర్వాత వాళ్లిద్దరూ కలిసి ఆత్మానందస్వామిని చూడ టానికి వెళ్లారు.

''స్వామిజీ, మొదటి దశలో ఆదర్శాలూ, విశ్వాసాలూ ముఖ్యమనీ, అలా ధర్మసాధన ద్వారా జీవితానుభూతి పొందటం ముఖ్యమనీ, తర్వాతి దశలో 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామ్ ఏకమ్ శరణమ్ వ్రజ' అని గీతలో చెప్పినట్లు మాయనుంచీ విముక్తి పొంది జ్యోతిర్మయమైన సత్యంలో లీనం కావటం జరుగుతుందనీ చెప్పారు. ఇదుగో ఈ స్నేహితుడు వ్యక్తి జీవితంలో ఆదర్శాలూ, విశ్వాసాలూ అర్థ శూన్యమనీ, జీవితానుభూతిని యథాతథంగా ఆనందమయంగా పొందాలనీ అంటాడు. మీ రిద్దరూ చర్చిస్తే వినాలని ఉంది'' అని శ్రీధర్ పరిచయ వాక్యాలు పలికాడు.

స్వామిజీ నాగరాజు వైపు చూచి చిరునవ్వుతో తల పంకించాడు.

నాగరాజు ప్రారంభించాడు : ''కాలం మారుతుంది. అంటే పరిస్థితులు మారుతాయి. సత్యాన్ని దర్శించే మార్గాల్లోనూ భేదం ఉండాలి. జీవనవేగం, పూర్వం నలభై, ఏభై ఏళ్లప్పుడు కూడా యింత తీవ్రంగా ఉండేది కాదనిపిస్తుంది నాకు. ఆ రోజుల్లో ఏవైనా సామాజికమైన విశ్వాసాలూ, ఆదర్శాలూ ఉన్నాయంటే వాటిని వ్యక్తి జీవితంలో ఆచరణలో పెట్టే అవకాశం ఉండేది. ఇప్పుడు అటువంటి అవకాశం తక్కువ. కారణం సామాజికమైన ఆదర్శాలు నేడు సంకీర్ణంగా ఉన్నాయి. తొందరగా మారుతున్నాయి; వ్యక్తి ఆచరణకు అందకుండా ఉన్నాయి. వ్యక్తుల్లో విచికిత్సా ఎక్కువైపోయింది. పూర్వం విశ్వాసాల ద్వారా జరిగే సాధనకూ, కలిగే అనుభూతికీ పరీక్షా సమయం నిదానంగా వచ్చేది; వ్యక్తితో అనుభవమూ, వివేకమూ పరిణతి చెందిన తర్వాత, వయస్సుపైబడి ముసలితనం వచ్చిన తర్వాత వచ్చేది. అప్పుడు లౌకికమైన జీవితంనుంచీ వెలుగులోకి విముక్తి లభించేది—ఆ వెలుగుని దర్శించాక మళ్లీ జీవితంతో వాళ్లకు సంబంధం ఉండేదికాదు. వర్ణాశ్రమ ధర్మాల ననుసరించే చాలమంది సామాన్యులు ఈ మొదటి రకంవారు. రెండో రకంవారు పిన్న వయసులోనే జీవితంమీద ఆసక్తిలేక, సమాజానికి దూరంగావెళ్లి, యోగ సాధన ద్వారా విముక్తి మార్గం అన్వేషించే వారు. అలాంటివాళ్లు మళ్లీ జీవితంతో సంబంధం పెట్టుకున్నా అది కేవలం లాంఛన ప్రాయంగానో, లేకపోతే లోక సంగ్రహణార్థంగానో ఉండేది. జీవితంనుంచీ పొందవలసిన అనుభూతినీ, ఆనందాన్నీ అలాంటి వా రాశించేవాళ్లుకాదు. పోతే మూడో రకం వారు కర్మయోగులనీ, రాజర్షులనీ, జీవితంతో సంబంధం ఉంటూనే సత్యదర్శనం చేసినవారు. ఈమూడు రకాల్లోనూ మూల సిద్ధాంతం ఒకటే—జీవితానుభూతి సత్యం కాదు, పరిపూర్ణమైనదికాదు; అది మాయ, అది దుఃఖ భూయిష్ఠం; దానికి అవతలి గట్టున పరిపూర్ణమైన ఆనందం, నిశ్చలత్వం, శాశ్వతమైన అస్తిత్వం ఉన్నదన్న సిద్ధాంతం. అందుకే 'జీవితం' ప్రకృతి లేక క్షేత్రమనీ, 'ఆత్మ' పురుషుడు లేక క్షేత్రజ్ఞుడనీ విభాగం. ఇలా విభాగం చెయ్యటంలో రెండింటి సంబంధమూ నిర్వచించవలసిన కష్టం ఉంది. అందువల్ల ఆత్మజ్ఞానమంటే కర్మచేస్తూ నిర్లిప్తంగా ఉండటం; కర్మ ఫలాపేక్ష లేకపోవటం, వగైరా వూహకు అసంభావ్యంగా, అనుభవానికి అసాధ్యంగా కనిపించే భావాల్తో ఆ నిర్వచనం చెయ్యవలసి వచ్చింది. ఇది అపోహలకు అవకాశ మిచ్చేదిగా వుంటూ, సుబోధకంగా లేకపోవటంవల్లనే కాబోలు బుద్ధుడు ఆత్మ అనేది వేరుగా లేదనీ, సత్కర్మ ద్వారా సద్విశ్వాసాల ద్వారా, అంటే నైతిక సూత్రాల ద్వారా, వాంఛలను అధిగమించట మొక్కటే జీవితపు అనుభవంలోని దుఃఖం నుంచీ, దోషం నుంచీ విముక్తి అని, అదే నిర్వాణమనీ, తన మతాన్ని బోధించాడు. ఏదఎలావున్నా, మారే 'జీవితం' వేరు, నిశ్చలమైన 'ఆత్మ' వేరుఅన్న విభేదం స్పష్టం. జీవితం మారుతుంది, ఆత్మకు మార్పు లేదు అన్న సాంప్రదాయికమైన విభజన నేటి పరిస్థితుల్లో విపరీత వ్యాఖ్యానాలకు లోనవుతూంది. మార్పులేనిదీ, హేతువాదానికి అందనిదీ అయిన యీ 'ఆత్మ' ఏమిటి? అసలు ఉందా? లేక మోసమా? అంటారు భౌతికవాదులు. జీవితం 'మాయ' అంటే ఆ భావం యథార్థానుభవంలో ఏవిధంగానూ పనికి రాదు......జీవితంలో లిప్తమై కూడా జీవాత్మ అతీతంగా ఉండ గలదు అనే అనుభవాన్ని బోధపరచుకోవటం కష్టమే! 'అజ్ఞానే నావృతమ్ జ్ఞానమ్.' కాని జ్ఞానాన్నీ, అజ్ఞానాన్నీ విడదీయుట మెలాగ? గీతాకారుడు 'శ్రేయాన్ స్వధర్మో విగుణః' అని ఒకసారి కాదు రెండుసార్లు (III లో, XVIIIలో) చెబుతూ, 'స్వభావ నియతమ్ కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్' అన్నాడు. ఏది స్వధర్మమో కాదో, ఏది స్వభావ నియతమో కాదో నిర్ణయించుకోవటం ఎలాగ? ఇన్ని యాంత్రిక శక్తులు మనిషిమీద చోదకత్వం నెరపుతున్న

కాలంలో అదీ అసాధ్యమే! ఇవన్నీ నేడు సంప్రదాయం తెలుసుకోవాలనుకునే సామాన్యుణ్ణి ఎదుర్కొనే సమస్యలు. జీవన వేగం ఉద్ధృతం కావటంతో ప్రతి ఆదర్శాన్నీ—స్వధర్మమైనా, స్వభావమైనా—తర్కంతో విశ్లేషించి ఏమిటి? ఎందుకు? అనే వివికిత్సకు లోనవుతూ ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో ఉన్నాడు సామాన్యుడు. ఈ పరిస్థితిలో ఆదర్శం, స్వధర్మం, నీతి అనే వాటికి నిలుకడ, నిర్దిష్టమైన స్వరూపం ఉండదు. సాంప్రదాయికమైన తత్త్వ జిజ్ఞాస జీవితం దుఃఖమయము, మనిషికి జరా మృత్యువులు ఉన్నాయి అనే విషయాన్ని గూర్చి ఆందోళన పడుతూ ప్రారంభమౌతుంది. దీన్నిగూర్చి సిద్ధార్థుడు పడిన ఆందోళన ఎందుకో నా కర్థం కాదు! మార్పువల్ల దుఃఖమే కాదు, సుఖమూ వస్తుంది. జీవితంలో కలిగే మార్పుతో మనిషి మనస్సు కూడా మారుతూ సరిపెట్టుకుంటూ వస్తే యిబ్బంది ఉండదు కదా! మార్పుని జీవన ధర్మంగా, జరా మృత్యువుల్ని సహజంగా, సిద్ధార్థుడు ఎందుకు అంగీకరించలేదో నాకు అర్థం కాదు! దుఃఖంతో పాటు సుఖాన్ని నిరాకరించమని ఏమిటో ఆ సలహా! వాంఛ అనేది దుఃఖాన్నీ, సుఖాన్నీ రెండింటినీ యిస్తుంది కదా! రెండింటినీ అంగీకరించే ప్రయత్నమే ఎందుకు చెయ్యరాదు? నిర్లిప్తతతో కాదు, ఉద్విగ్న మనస్కతతోనే అంగీకరించాలి అంటాను! అప్పుడు జీవితాన్నీ ఆత్మనూ వేరుగా చూడటంకాదు,రెండింటికీ తాదాత్మ్యం అంగీకరించటమే అవుతుంది. జీవితం క్షణ క్షణమూ మార్పు చెందుతుందనీ, దానికి అనుగుణంగా మన మనఃస్థితీ మార్పు చెందాలనీ, అలా చెందటానికి ప్రయత్నంచెయ్యటమే నేటి సాధన అనీ నా అభిప్రాయం! జీవితం అంటే కదలిక. కదలిక అంటే ఒక దాన్ని వదలి మరొకదాన్ని ఆశ్రయించడం, ఒక అనుభూతిని విస్మరించి మరొక అనుభూతిని అంగీకరించడం. ఇటువంటి కదలిక, మార్పు, నేడు సామాజికమైన యాంత్రిక శక్తుల ద్వారా వ్యక్తి మనస్సులో త్వర త్వరగా ప్రవేశిస్తోంది—అలా జరుగుతున్నప్పుడు ఆ మార్పును ప్రయత్న పూర్వకంగా గుర్తించి అంగీకరించటం కంటె ఆత్మ సాధన నేడు వేరు లేదు! అలా గుర్తించి అంగీకరించటంవల్లనే నేడు వ్యక్తికి తన 'వ్యక్తిత్వం'—అంటే ఆ యాంత్రిక శక్తుల్ని అజమాయిషీ చేసే స్వాధికారం, స్వయం నిర్ణయశక్తి—వివేచన ద్వారా అనుభవం ద్వారా లభిస్తుంది; తద్ద్వారానే 'ఆత్మ'గోచరమౌతుంది. కాని కదలికనూ, మార్పునూ అంగీకరించటానికి ప్రతిబంధకమౌతున్నది నేడు సంప్రదాయమే—విశ్వాసాలను గూర్చి, ధర్మాన్ని గూర్చి, అవి చలించరాదనే అపోహ; నీతిని గూర్చి భయం; మార్పంటే ప్రమాదం, తప్పు, అనే భీతి! పూర్వం పరిస్థితులూ, సంఘ వ్యవస్థా నిలుకడగా ఉన్నప్పుడు నీతి నియమాలూ, ధర్మమూ, నిర్దిష్టంగా, నిలుకడగా ఉండేవి. వాటిని అంగీకరించడం జీవితానుభూతిని యథాతథంగా పొందటం, జీవితంమీద అధికారం పొందటం అయ్యేది. ఇవ్వాళ ఆత్మవిశ్వాసం లేకుండా, ప్రాత ఆదర్శాల్నీ, ధర్మాన్నీ అడ్డం పెట్టుకుంటే జీవితానుభూతే చేయిజారి పోతున్నది. లేక మనిషి జీవితపురథ చక్రాలక్రింద నలిగిపోతున్నాడు. మరోవిధంగా చెప్పాలంటే, ఆనాటి జీవిత తటాకానికి ఆదర్శాలు చాలు;ఈనాటి జీవిత ఝరికి 'ఆత్మ ప్రత్యయం' కావాలి. అందుకే ఆనాడు జీవితాన్ని 'ధర్మం' ద్వారా అన్వేషిస్తే, ఈనాడు జీవితాన్ని 'ఆత్మ ప్రత్యయం' ద్వారా అన్వేషించాలి అంటున్నాను! అలా చెయ్యటంతో ఈ జీవితాన్ని వదలి దూరంగా, ఎప్పుడో, ఎక్కడో, యోగసాధన, ఆత్మసాక్షాత్కారం జరుగుతాయి అనే కృత్రిమమైన ఏర్పాటు పోతుంది. 'వ్యక్తి'గా జీవించటమే నేటి యోగ సాధన, ఆత్మ సాక్షాత్కారమూ!''

స్వామిజీ అంతా ప్రశాంతంగా విన్నారు : ''మీరు ప్రాత క్రొత్తల సమన్వయ దృష్టితో చెప్పేది, నేడు ప్రతి వ్యక్తీ కర్మ యోగి కావాలనీ! దాని కనువైన క్రొత్త పరిస్థితులు సంఘంలో ఏర్పడుతున్నాయనీ! బాగానే వుంది! కానీ, ఆ స్థితికి మీరు చెప్పిన దృక్పథంతో, అంటే వ్యవస్థాగతమైన ధర్మాధర్మవిభాగాన్ని కాదనే స్వయంనిర్ణయశక్తితో, ఎంతమంది తయారు కాగలరు? అని నా ప్రశ్న. మీరొక విశిష్ట మార్గంలో వెళ్లటం బాగానే ఉంది. అది మీకు జన్మతః వచ్చిన సంస్కారం. అది మీ స్వధర్మం. మీలాగా జీవితంలో మార్పుని అంగీకరిస్తూ, దుఃఖాన్నీ, జరామరణాల్నీ తేలికగా తీసుకునే వాళ్లెంతమంది ఉంటారు? 'గీత' మీ మార్గాన్ని కాదనదు! మీరు చెప్పేదీ 'నిర్లిప్తత'కూ వ్యాఖ్యానప్రాయంగానే ఉంది కదా!.......నాకు శ్రీధర్ అనుభవం తెలుసు. శ్రీధర్ సాధనకూడా స్వధర్మ నిర్ణయం ద్వారానే జరుగుతున్నది. సంఘాన్నెదిరించి పద్మమణి నంగీకరించటంలో శ్రీధర్ చేసిందీ స్వధర్మావలంబనమే! నా అభిప్రాయంలో, మార్గం ఏదైనా, మీరూ స్వధర్మాన్నే ఎన్నుకున్నారు. కాని మీ స్వధర్మాన్ని అందరికీ వర్తింపజెయ్యటం ప్రమాదమేమో!... పోతే, మరొక్క విషయం: జీవితాన్నీ, ఆత్మప్రత్యయాన్నీ ఒకటిగా వీక్షించటం ద్వారా జీవితానుభవం యిచ్చే ఆనందమే తప్ప, దానికి అతీతమైన అలౌకికమైన ఆనందానికి, మీరు వెలి అవుతున్నారని తోస్తుంది...'' అన్నారు.

''నేను సామాన్యుణ్ణి అనే విషయం విస్మరించకండి...''

---

# గ్రంథ విమర్శలు

## అమెరికన్ సాహిత్యం

(ఆంగ్లమూలం : మార్కస్ కన్‌లిఫ్. తెనుగు సేత : యస్వీ జోగారావు. ప్రచురణ: ఎం. శేషాచలం అండ్ కంపెనీ. వెల: రు. 6—50. పుటలు: 524)

నాలుగుశతాబ్దాల అమెరికన్ సాహిత్యపరిణామాన్నీ అందులో భాసించిన ప్రధానమైన రీతుల్నీ సామాన్యపాఠకునికి పరిచయంచేసే ఉద్దేశంతో పెంగ్విన్ సంస్థవారు మార్కస్ కన్‌లిఫ్ చేత ఆంగ్లంలో వ్రాయించి ప్రచురించిన విమర్శగ్రంథానికి తెలుగుసేత తెలుగువారికి పనికిరానివిధంగా తయారు కావటం దురదృష్టం! ఎం. శేషాచలం అండ్ కంపెనీ వారు అనువాదం 'స్వచ్ఛందశైలి' లో ఉండేలా చూడమన్నారట. అనువాదకులు 'యిష్టంవచ్చినట్లే సాగించారు అనువాదం. ఈ పుస్తకాన్ని తెలుగువారు చదివితే రచయితలపేర్లూ, గ్రంథాలపేర్లూ, అధ్యాయాలవిభజనవంటి స్థూలంగా పాడకట్టే విషయాలుతప్పితే, గ్రంథంలోని తాత్త్వికమైన ప్రధానవస్తువు వూహకు అందివచ్చేలా ఎక్కడా అనువాదం రూపొందలేదు. దీనికి ముఖ్యకారణం : పదాల్నీ, పదబంధాల్నీ, ఆంగ్లజాతీయాల్నీ సరిగా తర్జుమాచెయ్యలేకపోవటంకాదు — ఆ రకం దోషాలూ కొల్లలుగా ఉన్నప్పటికీ! కారణం ఒక అధ్యాయంలో లేక ఒకపేరాలో గ్రంథకర్త చెబుతున్న భావమేమిటో సూటిగా అర్థం చేసుకుని దానికి ప్రతిగా తెలుగులో తయారైన అధ్యాయంలో లేక పేరాలో ఆ భావం వ్యక్తం అవుతున్నదా లేదా అని అనువాదకర్త పరామర్శించి చూచుకోకపోవటం! ఈ గ్రంథంలో ఏ పేరా అయినా తీసుకొని చూస్తే ఈ లోపం కనిపిస్తుంది. ఇంగ్లీషుతెలిసి, అమెరికన్ సాహిత్యంతో పరిచయం ఉన్నవారికే, మూలాన్ని చూడకుండా ఈ గ్రంథాన్ని మాత్రమే చూస్తే ఏమీ బోధపడనిపేరాలు ఈ పుస్తకం నిండా ఉన్నాయి. ప్రత్యేకంగా వెదికి పట్టుకోనవసరంలేకుండా, పుస్తకంతెరిస్తే కనిపించిన ఈ క్రింది ఉదాహరణ—"ఉపోద్ఘాతం"లోనిది—పరిశీలిస్తే పైన చెప్పిన విషయం అర్థమౌతుంది.

"ఆదర్శాలతో బయల్దేరినసంఘమది. అయితే ఆదర్శానికొకప్పుడు వాస్తవికతవల్ల వ్యాఘాత మేర్పడేది. ఆదర్శమూ, వాస్తవికతా ఒకదానితో ఒకటి ముడిపడడం తప్పనిసరి అయింది. సాహిత్యపరంగాచూస్తే అమెరికన్ నైతికదృక్పథమన్నది విధిగా జరిగినదానికీ అసలు జరిగేదానికీ అతికితే కతకని, కతికితే అతకని అనుబంధంగా తయారైంది. తత్ఫలితంగా, అమెరికన్‌సాహిత్యంలో మాత్రం గోప్యత, మార్మికత అనిపించుకునే పదార్థము చాల తక్కువైపోయింది. (ఆధ్యాత్మికత లేనిదైనా సరే, అమెరికన్ కల్పనతోపాటు మతాని కొక గొప్ప ప్రాముఖ్యం ఉంటూవచ్చింది.) ఊహాగతమైనదెంత ఉత్కృష్టమైనదైనా కార్యశూరులచేత అది నిరాకరింపబడుతుంది. అమెరికాఅధ్యక్షునివంటి అమెరికన్ భవిష్యద్ద్రష్టకు అధ్యయన సమయాల్లో కార్యార్థుల రాకలవల్లను, ఎడతెగని టెలిఫోన్ మోతలవల్లను అంతరాయం కలుగుతుంది. అప్పుడప్పుడిలాంటి సన్నివేశం ఆర్జవాన్ని కప్పిపుచ్చే మాటల్లో తేలికగా, అనాలోచితంగా చెప్పబడటం కద్దు. ఎమిలీ డికిన్సన్, థోరో మొదలైనవారి రచనలలో ఈ ధోరణి కనిపిస్తుంది. ఒకచోట థోరో ఏమంటాడో చూడండి— 'ఓ మహాదేవా! నాకు నావల్లనే ఆశాభంగంకలిగించేదానికన్నా హీనమైన తుచ్ఛదనాన్నిమ్మని యాచించను నిన్ను. ఒక మెట్టు దిగితే, నువ్వయితే కటాక్షిస్తావు కాని నా మిత్రులకు నావల్ల ఆశాభంగం కలిగేదాని గురించి అంతకన్నా అడగను.' ఇదేమీ హాస్యం కోసం వ్రాసిన పద్యం కాదు. ప్రార్థన పద్యంగా వ్యవహృతమైనది. థోరో యదార్థంగా ఏమనుకుంటాడో లోపల, అదే పైకి చెబుతాడు."

పై పేరా చదివితేచాలు. లోపం గ్రంథకర్తది కాదు, అనువాదకర్తదే అనేసంగతి నిరూ

పించి వేరుగాచెప్పనక్కరలేదు. ఇటువంటి పేరాలతో నిండివున్న ఈ అనువాదం ఎవరికి ఉపయోగిస్తుంది ? "అనువాద పద్ధతి పద్ధతిగా నున్నది... రచన చతురముగా సాగినది.... పకడ్‌బంద్‌గా పసందుగా నున్నది." అని ఒకరూ, "మూలంలోని భావాలు చెడకుండా తర్జుమాచేశారు" అని మరొకరూ, 'అనువాదము చక్కగా, సరళముగా నడచినది.' అని యింకొకరూ, పెద్దలు, ఈ అనువాదానికి అభినందనలూ పరిచయవాక్యాలూ వ్రాశారు. ఏమనుకోవాలి ? పోతే, పదాల్నీ, పదబంధాల్నీ, జాతీయాల్నీ తర్జుమా చెయ్యటంలో దొరలిన దోషాల పట్టిక తయారు చేయాలంటే ఒక పెద్ద గ్రంథమే తయారౌతుంది!

"Hast thou not torn the Naiad from her flood" (పేజీ 90) అంటే "నయ్యాద్ నదిని వరదనుండి...." అని తర్జుమా! నయ్యాద్ నదిపేరు కాదు, నదీదేవత అనే సంగతి 'కన్సైస్ ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ' చూచినా తెలుస్తుంది !

"Things are in the saddle and ride mankind" (పేజీ 120) అనే వాక్యంలోని నుడికారం అర్థంకాక "కావలసినవి జీనులో ఉన్నాయి కాని ఎక్కడికో స్వారిచేస్తూపోతారు మనుషులు" అని అనువాదం చేశారు. 'అచేతనాలు లేక వస్తువాహనాలు అధికారం స్వీకరించి మానవాళిమీద స్వారి చేస్తున్నాయి' అనే భావానికి పట్టినగతి! పై ఆంగ్లవాక్యంలో నుడికారందాకా అక్కరలేదు, వాక్యంలో కర్త, కర్మ, క్రియ ఎక్కడుంటాయో తెలిసినా అనువాదం తప్పిపొయ్యే అవకాశంలేదు. mankind ఏకవచనం అయితే rides అని ఉండాలి కదా ride ఎలా ఉంటుందీ అన్నైనా తట్టలేదా ? ఇక ఆంగ్లసాహిత్యసంప్రదాయానికీ, పాశ్చాత్యదార్శనిక భావాలకూ, అమెరికన్ సంస్కృతికీ సంబంధించిన ప్రత్యేకమైన పదజాలాన్ని, నుడికారాలనీ తర్జుమా చెయ్యటంలో కలిగిన అపభ్రంశాలమాట చెప్పనక్కరేలేదు! ఏతా వాతా, అనువాదకులకు ఈగ్రంథం బోధపడలేదు అంటే అతిశయోక్తికాదు ! ఇక్కడ చెప్పవలసినమాట ఒక్కటున్నది. అనువాదం కష్టమైనకార్యమని అందరికీ తెలుసు. దాన్ని ఒక్కరే చెయ్యబూనటం సాహసం—ఒక్కరే అంటే ఒక సాహిత్యాన్నీ సంప్రదాయాన్నీ ఎరిగిఉండి, ఆంగ్లంతో కేవలం భాషాపరిచయంకలిగిఉన్నవారని ఉద్దేశం. ఆంగ్లసాహిత్యాన్నీ, సంప్రదాయాన్నీ అవగాహన చేసుకుని అందులో నిష్ణాతులైన తెలుగువారికి మరొకరికి ఈ అనువాదాన్నిచ్చి సరిచూడమని చెప్పితే ఎంతోబాగుండేది. ఇకముందైనా ప్రచురణకర్తలు యిలాంటిగ్రంథాలను తర్జుమా చేయించేప్పుడు ఒకరిబదులు ఆంగ్లాంధ్రాలకు ప్రతినిధులుగా యిద్దరుపండితుల్ని ఎన్నుకోవడం అవసరం. లేకపోతే పడినశ్రమా, పెట్టినఖర్చూ కేవలం నిరుపయోగం.

## నవల

(ఆంగ్ల గ్రంథం. రచన: ఎ. నాగ గోపాలరావు. ప్రచురణ: పద్మా పబ్లికేషన్స్, ఏలూరు. పేజీలు: 26)

'నవల' (Novel) అను పేరుగల ఈ ఇరవైఆరు పుటల ఇంగ్లీషుపుస్తకంలో కేవలం అయిదు పేజీలు మాత్రమే నవలనుగూర్చి ఉన్నాయి. వ్యాస శీర్షిక 'ఆధునిక భారతదేశంలో నవల' అని ఉంది. తెలుగులో నవలలు వ్రాసిన లేక యితర భాషలనుంచీ తర్జుమాచేసిన రచయితలూ ఆ గ్రంథాలూ వరుసగా పట్టీ యివ్వటంతప్ప మరేమీ 'సరుకు' లేదు ! 'తెలుగుకథానిక పరిణామం' సరిగా మూడున్నర పేజీల కథారచయితల కేటలాగు ! 'వ్యాసం : దాని ప్రాముఖ్యం', 'తెలుగుసాహిత్యంలో నేటి రీతులు' అనే రెండూకూడా ఇంచుమించు అలాగే ఉన్నాయి. ఈ నాలుగు వ్యాసాల (?) మహా గ్రంథానికి ఒక మున్నుడి (Foreword), ఒక కృతిసమర్పణం (డాక్టరు రాధాకృష్ణులకు) ఒక ఆంగ్లపత్రికలో ఈ గ్రంథాన్నిగూర్చి ప్రచురింపబడ్డ సమీక్ష, ఈరచయిత వ్రాసిన యితరగ్రంథాలనుగూర్చి ప్రముఖుల అభిప్రాయాలూ పత్రికాసమీక్షలూ—యివన్నీ అనుబంధం ! (ప్రస్తుత సమీక్షనుగూడా చేర్చుకుంటే వచ్చేకూర్పులో గ్రంథం మరోపేజీ పెరుగుతుంది!) కాని ఈ ఆంగ్లప్రచురణ మనకు గుర్తుచేస్తున్న ఒకానొకపరిస్థితిని మనం గుర్తించక తప్పదు ! తెలుగు రచయితలను గూర్చి, గ్రంథాలను గూర్చి ఇంగ్లీషులో ఇతరభాషలవారికి తెలియజెప్పేరచనలు బొత్తిగాలేకపోవటమే ఆ పరిస్థితి! 'పి. ఇ. ఎన్' వారి ఆహ్వానంమీద ఇంగ్లీషుతెలిసిన ఆంధ్రుడు నవలల పేళ్ళూ, రచయితల పేళ్ళూ

చెబుతూ నాలుగుముక్కలు చెప్పాడో లేదో, అది ఒక గ్రంథంగా వెలువడి, రాష్ట్రపతికి అంకితమై, రెండవకూర్పుదాకా వెళ్లిపోయింది ! నిజమే, తెలుగు రచయితల, పుస్తకాల, పట్టీలుకావలసిన ఆంగ్లేతరుడికి ఎంతైనా ఉపయోగిస్తుంది ఈ పుస్తకం! పోతే, దీంట్లో ఏముందని దీన్ని 'భారతి' కి సమీక్ష నిమిత్తం పంపటం ? తెలుగువారు తెలుసుకోదగిందేమీలేదు ఈ పుస్తకంలో !

—ఆర్. ఎస్.

## నా చ రి త్ర

(డాక్టర్ ఉ. వే. స్వామినాథయ్యరుగారి స్వీయ చరిత్ర. అనువాదకులు:—ఎన్. సి. వి. నరసింహాచార్యులు, సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీవారి ప్రచురణ. 424 పుటలు. వెల: రు. 7—00.)

తెలుగులో మనకు ప్రాచీన గ్రంథముల నుద్ధరించి వ్యాఖ్యలు వ్రాసిన ఉద్దండపండితులవలెనే తమిళ భాషకును అట్టి నిస్తులమైన సేవ చేసిన వారిలో శ్రీ ఉత్తమదానపురము వేంకటసుబ్బయ్యర్ గారి కుమారులు 'మహామహోపాధ్యాయ', 'దాక్షిణాత్య కళానిధి' డాక్టర్ స్వామినాథయ్యరుగారు ప్రధానులు, మార్గదర్శకులు. ఆంధ్రవాఙ్మయమును తమిళవాఙ్మయమును ప్రాచీన కాలమున భిన్న పరిణామములనందియుండినను ఆంగ్లవిద్య వ్యాపించిన కాలమునుండియు నూతనవికాసాదికములలో చాలవఱకు మన పోకడలకు వారి పోకడలకును పెక్కు సామ్యములు గలవు. తమిళాంధ్రములకేకాదు మన దేశభాషలకన్నిటికిని నూతన చైతన్యమును అందుచే వికాసమును కలిగి దృక్పథమే మారిపోయినకాలమిది. అచ్చాఫీసులు ఏర్పడి వాఙ్మయమునకు ప్రాణముపోసినకాలమిది. శ్రీ అయ్యరుగారు జనించిన కాలము మన దేశమందును సాటి పండితులు జనించి భాషనుద్ధరించినకాలము. భాషలువేరేగాని పరిశ్రమలు, ఆశయములు, ఎదుర్కొన్న కష్టములు, తుదకు వారికి కలిగిన ఫలితములు, జనామోదమును అన్ని ఒక్క లాగుననేయుండుటను చూడగలము. శ్రీ చిన్నయసూరిగారు, వీరేశలింగము పంతులుగారు, మా తాతగారు వేదము వేంకటరాయశాస్త్రిగారు, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు గురుజాడ అప్పారావుగారు మొదలగువారు మనదేశమందు, వెలసి భాషాసేవచేసిన కాలమందే తమిళములో శ్రీ మీనాక్షి సుందరంపిళ్లైగారు, సుబ్రహ్మణ్యభారతియారు, శ్రీ స్వామినాథఅయ్యరుగారు మొదలగువారు వెలసిరి. నవలలు, నాటకములు, కథానికలు, పత్రికా ప్రచారము—ఇది దేశమంతటను ప్రారంభమైనది. అన్నిటికన్నను మిన్నగా ప్రాచీన తాళపత్ర గ్రంథ సేకరణకు జరిగిన ప్రయత్నము ఇంతింత అనరానిది. పందొమ్మిదవ శతాబ్దముయొక్క ఉత్తరార్ధమున ప్రాచీనతాళపత్ర గ్రంథములకు దేశమంతటికిని ఒక 'స్టాక్ టేకింగ్' వంటిది జరిగినది. ప్రభుత్వమువారును ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నేర్పరిచిరి. లెక్కలేని నూతనాంశములు తెలియుటచే భాషా చారిత్రక పరిశోధనలు, క్రొత్త పాశ్చాత్య రీతిని, ప్రారంభమైనవి. ఇట్టికాలమున జనించి, అశ్రుతపూర్వములును, కేవలము శ్రుతపూర్వములై యుండి దృష్టిగోచరము కాకుండినవియు, దృష్టిగోచరములైయుండియు జిజ్ఞాసువులకు హస్తగతముకాకుండ బాధ పెట్టుచుండినట్టివియు నైన ప్రాచీన విజ్ఞాననిధులనదగు గ్రంథములను వెదకి బయటపెట్టుటయేకాక, ఉద్దండపండితులు అనుదినము పాఠము చెప్పుచుండియు అర్థముకాని యనేకవిషయములను పరిశోధించి చక్కని వ్యాఖ్యానములతో ముద్రించి తమిళవాఙ్మయమునకు మహోపకారమొనర్చినవారు శ్రీ స్వామినాథ అయ్యరుగారు.

శ్రీ అయ్యరుగారు క్రీ. శ. 1855లో జనించిరి. గొప్ప సంగీత విద్వాంసులయింట పుట్టి స్వయము సంగీతము చక్కగా అభ్యసించినవారైయుండియు వట్టి గాయకులుగానే జీవితమును గడుపక ఆ సంగీతము నొక వినోదసాధనముగా మాత్రమే ఉంచుకొని భాషాజ్ఞానోపార్జనకే జీవితమును ధారపోసిరి. 'పుట్టిన దాదిగా తనదు పుణ్యమె దాదిగ' అన్నట్లు పేద కుటుంబమున జనించినవారైనను, చిన్నప్పటి నుండియు వీరికి తమిళముపై నభిలాషమెండై పలువురు విద్వాంసుల సాహచర్యమేర్పడినది. ఎట్లో భోజనవసతులు కుదుర్చుకొని ఆ యా పండితులకడ కూర్చుండి పాఠముచెప్పించుకొని తుదకు మహావిద్వాన్ శ్రీ మీనాక్షి సుందరంపిళ్లైగారి కడ ఐదేండ్లు నిత్య శుశ్రూషయొనర్చి ఎన్నియో విషయములను

# గ్రంథ విమర్శలు

గ్రహింపగల్గుట పుణ్యవిశేషమే. శ్రీ పిళ్లెగారి మూలమున వీరికి లేతవయసులోనే, ప్రాచీన తమిళ శైవ మఠములలో ప్రసిద్ధమైన, తిరువావడుతురై మఠాధిపతులైన శ్రీ సుబ్రహ్మణ్య దేశికుల అనుగ్రహము కలిగినది. మీనాక్షి సుందరంపిళ్లెగారి మరణానంతరము శ్రీ దేశికులవారే వీరిని తమకడనుంచుకొని, పాఠములుచెప్పుటయేగాక వీరిని తమ యాస్థానపండితుడను హోదాలోనుంచి తామే కుంభకోణము కాలేజికి తమిళోపాధ్యాయులుగా మర్యాదలతో పంపిరి. ఆ కాలమున దక్షిణదేశమున పండితులును విద్యావంతులును ఒక్క తమిళమునుమాత్రమే అవలంబింపక తెలుగును సంస్కృతమును కూడ చక్కగా చదివియుండిరి. సంస్కృతమును కొంత వదలినను 'తెనుగు చదువుచుండిరి. స్వామినాథయ్యరు గారి తండ్రిగారు కూడ తెనుగు బాగుగా చదువుకొన్నవారేనట. కాని అయ్యరుగారికి ఎందుచేతనో మొదటినుండియు ఒక్క తమిళమందే ఆసక్తి యేర్పడి తుదితాకినది. ఇరువదియేడేండ్లు వచ్చునప్పటికే తమిళమందు గట్టి పాండిత్యము కుదిరినది. సంస్కృతాంధ్రములను పూర్తిగా ఒప్పరికించిన ఏకాగ్రతచేత తమిళమందు పునాదులు లోతుగాను గట్టిగాను పడి తర్వాతి రచనా సౌధములు 'మిన్నులతో రాయు సువర్ణసౌధము' లగుటకు దారియేర్పడినది.

ఎనుబది యేడేండ్లు జీవించిరి. బాల్యములో ఎప్పుడు ఆడుకొనిరో, లేక ఆడుకొననేలేదోగాని జీతకాలమంతయు విద్యార్థివలె చదువుచు, పరిశోధించుచు, వ్రాయుచు భాషాసేవలో గడిపిరి. ప్రసిద్ధములైన తమిళపంచకావ్యములనబడువానిలో పెక్కులు నాటి పండితులే యెఱుగరు. దేశమందు శైవమతము అధిక ప్రచారమందున్నందున ప్రాచీన జైన బౌద్ధ వాఙ్మయమును ఎఱిగినవారు ఏ మూలల యందో ఉండిరి. ఇట్టి సంప్రదాయసిద్ధ విషయముల గూర్చిన గ్రంథముల పరిశోధన కష్టసాధ్యమై యుండినది. మతద్వేషముచే జైనులు శైవులకు చెప్పెడివారుకారు. అట్టి గ్రంథములను జీవకచింతామణి, మణిమేఖలై మున్నగువానిని, శిలప్పదికారం, అగనానూరు, పురనానూరు, పత్తుప్పాట్టు మొదలైన వానిని, ఊరూరు తిరిగి, కష్టనష్టముల కోర్చి మర్యాదకు చూడక, నిద్రాహారములు త్యజించి, ప్రతులు సంపాదించి, మొదట గ్రంథనిర్ణయమును చేసికొని, వానికొక స్వరూపమునుదిద్దీ ముద్రించి దేశమున కర్పించినారు. ఆంగ్లభాషాగ్రంథముగాని ముద్రణ విధానాదికముగాని బొత్తిగా ఎఱుగనివారే యైనను ఇంగ్లీషుపద్ధతులు చక్కగా అలవాటు పడినవారికన్న నేర్పుతో ఉపోద్ఘాతాదికములు, శ్లోక శబ్దాది సూచికలు, పాఠాంతర సూచికలు మొదలైనవాని ముద్రణములలో వీరవలంబించిన పద్ధతులు నేటికిని తమిళపండితులకొక యాశ్రయముగా నున్నది. పెక్కురు వీరి వ్యాఖ్యలనుకూడ చదువక, వట్టి ఉపోద్ఘాతాదికములను మాత్రమే చదివి పరీక్షలలో ఉత్తీర్ణులై పండితులై నెగడుచున్నారని చెప్పుదురు. బౌద్ధ, జైన మతాదిక సంప్రదాయములను ఆయా మతస్థులకడకుపోయి చాల వినయముతో గ్రహించి వారివలన మెప్పులను బిరుదులను కూడ సంపాదించిరి. బృహత్కథామూలకమును జైన గ్రంథమునైన 'పెరుంగదై' (పెద్దకథ) వీరుద్ధరింపనిచో బయటికి వచ్చియేయుండదు. తాళపత్ర పరిశోధనకు వీరిని అన్ధ పురికొల్పినది. ప్రాచ్యలిఖిత భాండాగారమువారి పాటువయు ప్రచారమును లేకుండినను కూడ వీరీపనులను చేసియేయుందురు.

ఈ ప్రచురణము వీరి ఆత్మకథ. ఆత్మ కథా రచనము మన దేశమందు ఇంకను చక్కగా పెంపొందలేదు. చూచివ్రాయుటకు ఆదర్శములు, నమూనాలు లేవు. ఆంధ్రములో శ్రీ వీరేశలింగముపంతులవారితర్వాత చాలాకాలమువఱకు లేకుండి ఇటీవల వచ్చినవే శ్రీ చిలకమర్తివారిదియు, శ్రీ ప్రకాశం పంతులవారిదియు. ఇంగ్లీషులో రాజకీయ ధురంధరులు పలువురువ్రాసినవికూడ అయ్యరుగారికి సమకాలికములేగాన తొలి తొలి రచయితలలో వీరొకరగుచున్నారు.

ఒకరిచరిత్రను వారే వ్రాసికొనుట యొకటి. ఇతరులు వ్రాయుట యొకటి. ఇతరులు ఒక మహాపురుషుని వర్ణించినట్లు వ్రాయుదురు. తామేయైనచో తమ వినయ ముట్టిపడునట్లు తమ పనులకన్నిటికి సమర్థకముగా వ్రాసికొనవచ్చును. కొందఱు సమకాలికులయాక్షేపములకు సమాధానముగానో ప్రతిస్పర్ధులను దూషించుటకో దీని నొకమార్గముగా నుపయోగించుకొందురు. ఇదొక ప్రచారము కూడ. తమకు తృప్తికరముగా ఇతరులు వ్రాయ

లేరని కొందఱు తామే వ్రాసికొందురు. పాశ్చాత్య దేశములలో ఈ విధమైన వాఙ్మయము ఎంతో కలదు. మన దేశమందు ఇప్పుడు ఏర్పడుచున్నది. కొందఱి యాత్మకథలను వెలువడినవెంటనే ప్రతి స్పర్థులు ఆక్షేపించుటయు క్రొత్తగాదు. కాని ఆత్మ కథలలోని రచనాశిల్పము ఒకతీరు, జీవిత చరిత్రలలో నింకొకతీరు. ఒకరిని గుఱించియే ఎందరి కెన్ని భావములు గలవో, దృక్పథములు గలవో అందఱు అన్నివిధముల వ్రాయ వచ్చును. రచయిత తన నాయకుని మహా పురుషుని గానో, లేక వట్టి నికృష్టునిగానో భావించి వ్రాయ వచ్చును. అట్లుగాక సహృదయుడైయుండు రచయిత ఒక మహాపురుషుని సుగుణ దుర్గుణములను సమా నముగా ప్రదర్శించి అతని జీవితమందలి అభ్యు దయపతనాదులకుగల కారణములను తెల్పును. అది జ్ఞానప్రదము. గొప్పవారికిని కోపతాపములు, అభి మాన ద్వేషములు ఉండును. వానిని పరిశీలించి వివ రించుటయే జీవితచరిత్రకారుని విధి. ఆత్మకథా రచయిత సహృదయుడైనచో తన్నుతాను కొలతవేసికొని, హృదయముపై చెయ్యిపెట్టుకొని తన చరి త్రనుబట్టి జీవితము చక్కగా నడిచినదా లేక తనది భగ్నజీవితమా, తన ఆదర్శములు నెఱవేరినవాలేదా, మానవ జీవితము దైవికపరిణామమా లేక పౌరుషా ధీనమా—మొదలైన దృక్పథములలో వ్రాయవచ్చును. కొందఱు తమ కష్టసుఖములను విచిత్రసంభవము లను వ్రాయుదురు. ఇందులో మానవ స్వభావము ఎంతో చక్కగా తెలుపుటకును, తెలిసికొనుటకును అవకాశములు గలవు. జీవితములో పైకిరాగోరు యువకులకు ఇట్టి రచనలు కనువిప్పుగానుండ గలవు. ఎవడును పుట్టుకతో మహాపండితుడో, మహా పురుషుడో, జ్ఞానియో, యుద్ధవీరుడో, దేశ నాయ కుడో కాడనియు, పురుష ప్రయత్నమును, జీవిత మందలి సందర్భములును, దేశకాలాది పాత్రాదిక ములును గొప్పతనమునకు కారణములనియు తేలును. లోకజ్ఞానము కలుగును.

శ్రీ అయ్యరుగారి 'నా చరిత్ర' ఇట్టి ఉత్తమశ్రేణికి చెందిన రచన. వట్టి అనుభవమును వ్రాయుటయేతప్ప వేరుద్దేశము వారికుండినట్లు కనబడదు. తన జీవిత దశావిశేషములను, బాల్యమున తన తాతగారు, తల్లి దండ్రులు, ఆ కాలమున విద్యార్జనకై తాను పడిన శ్రమయు, తన్నొక పండితునిగా చేయుటకై తలి దండ్రులు పడిన కష్టములు, తనకు లభించిన గురువులు, వారి సౌజన్యాదికములు, వారి ఘనత, తాను పొందిన లాభములు, ఇవన్నియు నొక విద్యార్థి తాను గట్టెక్కు వఱకు పడు నవస్థలుగా చక్కగా వివరింపబడియున్నవి. గతశతాబ్దమందు జరిగిన వాస్త విక వృత్తమగుటచేత ఇందలి విశేషము నాటికాలపు జనజీవితమును తెలుపుటయేగాక నేటికిని దీనిని చదువు విద్యార్థులకు తమ జీవితములను పోల్చి చూచు కొని యానందించుటకనువుగా నున్నది. కాలము మారిపోయినను, సందర్భములు మారినను మానసిక దశమాత్రము ఆరీతిదే గదా. తాళపత్రగ్రంథము లింకను ప్రచారమందుండి గంటముతో వ్రాయు చుండిన కాలమది. 'రెఫరెన్సు' చదువు లింకను ప్రారం భముకాలేదు. నోటుబుక్కులయలవాట్లింకనుకాలేదు. అంతయు బట్టీ పెట్టవలసినదే. విద్యార్థి చదువు చుండగనే వక్తయు, ఉపన్యాసకుడును, కవియు ఉపాధ్యాయుడునుగా పరిణమించుకాలము. అందును బ్రాహ్మణోత్తములైన అయ్యరుగారు బ్రాహ్మణేతరుల కడ శుశ్రూషించి చదువుకొనిరి. వర్ణాశ్రమధర్మమును పాటించి భోజనముమాత్రము వేరైనను మిగిలిన సహవాసమంతయు వ్యత్యాసములేని,కపట మెఱుగని మను తలకలసి మెలసి గురుశిష్యులుండిన చరిత్ర. ఈ చరి త్రలో ఆకాలపు విద్యావిధానము, మఠములు, తమిళ గ్రంథములపై నాడుండిన భావములు, క్రమముగా జరిగిన మార్పులు మొదలగు విషయములెన్నియో తెలిపినారు అయ్యరుగారు. ఒక మహామహోపా ధ్యాయుడు తన గొప్పను చెప్పుకొనుటగా గాక ఒక విద్యారి సంతుష్టుడై తన కృతజ్ఞతా సూచకముగా తన విద్యకు కారకులైనవారిని, తన గ్రంథరచనకు ప్రోత్సహించిన వారిని గుఱించి వ్రాసినట్లు వినయ ముతో నిండియున్నది.

శ్రీ అయ్యరుగారు పూర్తిగా వ్రాయలేదు. తమ నలువది నాలుగవ సంవత్సరముతో నిలిపినారు. వృద్ధా ప్యమున వ్రాయు చరిత్రలు పూర్తియగు వఱకును రచయితలు, అందులోను ఆత్మచరిత్రల రచయిత లుండుట అరుదు. ఈ తెలుగు పుస్తకము శ్రీ అయ్యరు గారి దానికి సమగ్రానువాదముకాదు. అయ్యరు గారి రచనను వారి శిష్యులు శ్రీ కీ. వా. జగన్నాథం గారు సంగ్రహించి ప్రకటించినదానికిది ఆంధ్రాను

వాదము. సంగ్రహించుటనుగూర్చి యొకమాట— ఆంగ్లేయగ్రంథములలో మామూలుగా సంగ్రహించి నప్పుడు మూలమున ఏ యే భాగములు లుప్తములో వానిని ఆయా స్థలములలో నక్షత్రాంకములచేతగాని, సంఖ్యలచేతగాని తెలుపుదురు. ఇందట్టి నిర్దేశములేదు. పూర్తి మూలముతోపోల్చుకొన్నగాని ఏది త్యక్తమో తెలియదు. ఆంధ్రము దీనినే యనుసరించినది.

ఆంధ్రీకరణమును గూర్చి—చక్కని గ్రాంధికములో తర్జుమాచేసినారు. సరళముగా ప్రత్యేకాంధ్ర గ్రంథమువలె నడచినది శైలి. కాని అందందు తమిళ పదములు మూలమునందలివే దొర్లినవి. తూచాలు తప్పక పంక్తికి పంక్తి వచ్చునట్లు మూలాను సారియైనందున ఒక్కొక్కచోట అర్థము తెలియుటకు తమిళమూలముననే చూడవలసి వచ్చినది. కొన్ని యెడల మదరాసులోని తమిళముతోడి తెనుగు వంటిది దొరలినది. ఉదా— 'జనులకు వారిఎడల మిక్కుటమైన మతింపు ఉండినది' 'మతమునకు చెందినవాడననియే మతింపుతో చూచిరి.' మతింపునకు బదులు గౌరవమనియో లేక మరేదైన పదము వాడియుండవచ్చునేమో. కొనియాడుటకు 'కొండాడు', అట్టహాసమను నభిప్రాయమున 'దడబడలుగా', ప్రార్థించిరి, నేడుకొనిరి, అనుటకు 'అడిగికొనిరి'— 'మీరు వీనిని మీ భ్రాతునిగా స్వీకరించి రెండుమార్గములందును పరిశ్రమింపజేయవలెను అని అడిగికొనిరి.' (ఇది మద్రాసులోని 'మిమ్మల్ని నిండా దూరం అడుక్కొంటాను' వంటిది. అడుక్కొనుట యనగా ముష్టియెత్తుకొనుట యని తెలుగువారి భాష. ఇది దక్షిణాది తెలుగులో 'కేట్టు క్కొండాన్'కు సరియైన తెనుగు అనువాదము.) ఇత్యాదులు పెక్కులు. కాని ఇట్టి కొన్ని పుడకలను తీసివేసిన రచన పానకమే.

ఇట్టి భాషేతర గ్రంథమును ఆంధ్రులకు ప్రసాదించిన అకాడెమీవారు ప్రశంసారులు. కాని 424 పుటలలో అసమగ్రమైన సంగృహీత ఆత్మకథను వ్రాయించుటకన్న దీనిని ఇంకను తగ్గించి శ్రీ అయ్యరుగారి తర్వాతి చరిత్రను కూడ కలిపి ఒక సమగ్ర చరిత్రగా వచ్చునట్లు చేసిన యెడల ఒక చోటనే ఈ మహాపండితుని గూర్చి చదువరులకు తగిన విషయము లభించియుండెడిది.

— వేదము వేంకటరాయశాస్త్రి.

## పౌరహక్కుల శాసనము

(అమెరికా రాజ్యాంగము)

(మూలం: విలియం ఓ. డగ్లస్. అనువాదం: మొక్కపాటి శివాజీ. యం. శేషాచలం అండ్ కో. మదరాసు. వెల. 2 రూ.)

అమెరికా, ఫ్రెంచివిప్లవాలు జరిగినకాలంలో ఆ విప్లవయుగ ఫలితంగానే మానవులహక్కుల సిద్ధాంతం ఉద్భవించింది. నిరంకుశ ప్రభుత్వాల వల్ల కలిగే అన్యాయాలకు హక్కులు ఔషధాల వంటివి. —18వ శతాబ్దినాటి తాత్త్వికులు నిరంకుశత్వంవలన కలిగే ప్రతిఅన్యాయానికీ తగిన ఔషధాన్ని కనుగొనడం సాధ్యమేనని భావించారు. వారు కనుగొన్నామనుకొన్న ఔషధానికే 'హక్కు' అని పేరుపెట్టారు. ఈ హక్కులను వారు పవిత్రమైనవనీ, ప్రకృతిసిద్ధములైనవనీ, అనితరదత్తములనీ, అనివార్యములనీ వర్ణిస్తూ ఉండేవారు. హక్కుల స్వభావాన్ని యేదృష్టితోచూచినా యీ సిద్ధాంతం ఒక కరుడుగట్టిన వాదంకాదని తేలుతుంది. క్రొత్త క్రొత్త అన్యాయాలు అనుభవంలోకి వచ్చినప్పుడల్లా కొత్తకొత్తనివారణోపాయాలూ, వాటితోపాటు నూతనహక్కులూ సృష్టింపబడతాయి. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం తయారుచేయబడిన రాజ్యాంగాలలో 19—వ శతాబ్దిలోతయారైన రాజ్యాంగాలలోలేని క్రొత్తహక్కులెన్నో చేర్చబడ్డాయన్న విషయం యిందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు.

మానవుల ప్రాథమిక హక్కుల సిద్ధాంతం మొదట చక్రవర్తుల నిరంకుశవిధానాన్ని నిర్మూలించటానికి తయారుచేయబడిన అస్త్రం. కాని క్రమంగా అది మొత్తంప్రభుత్వ నియంతృత్వ పద్ధతికే గొడ్డలిపెట్టుగా మారింది. మరొక విశేషమేమంటే యీ శతాబ్దిలో రాజ్యాంగశాసననిర్మాణంపై మానవుల హక్కుల సిద్ధాంతంయొక్క ప్రభావం ప్రస్ఫుటంగా కనపడుతోంది. ఉదాహరణకు జర్మనీ వీమార్‌రాజ్యాంగంలో, నవ భారత రాజ్యాంగంలో మానవుని ప్రాథమిక హక్కులు వివరింపబడ్డాయి. 1948 లో ఐక్యరాజ్యసమితి 'విశ్వమానవ

హక్కుల' పత్రాన్ని రూపొందించింది. ఈనాడు సభ్య మానవ ప్రపంచం గుర్తించి అనుసరింపదగిన హక్కులన్నీ యీ పత్రంలో పొందుపరుప్పబడినాయి.

తమ రాజ్యాంగంద్వారా అమెరికాప్రజలు యీనాడు అనుభవిస్తూవున్న అనేక ప్రాథమిక హక్కులు యీ చిన్న పుస్తకంలో సోదాహరణంగా వివరింపబడినాయి. అసలు స్వాతంత్ర్యమంటే ఏమిటో, ఆదిన అమెరికా దానిని ఎలాసాధించిందో, అమెరికాలో ప్రజలకు ఎలాంటిహక్కులు ఉన్నాయో ఆ హక్కులు చెక్కుచెదరకుండా అమెరికా తన రాజ్యాంగంలో ఎటువంటి పకడ్బందీలుచేసి, వాటిని చట్టబద్ధంచేసి ఏర్పాటుపరిచిందో యీ పుస్తకంలో చక్కగా వివరింపబడింది. "సర్వే సర్వత్ర నియంతృత్వాన్ని ప్రతిఘటించి స్వేచ్ఛాపూరితం అయిన వాతావరణంలోనే నివసించాలన్న ఆశయాన్ని అమెరికా రాజ్యాంగచట్టంలో ఇముడ్చుకున్నారు. ఈ కారణంగా వారి రాజ్యాంగచట్టం ఎన్నడో గతించిన కాలానికి సంబంధించిన, బూజు పట్టివున్న పాత కాగితాలకట్టకాదు. అది వారి గుండెవంటిది". అమెరికా రాజ్యాంగంయొక్క ప్రాధాన్యాన్ని యీవిధంగా వివరించటం సమంజసంగానే వుంది. విలియండగ్లస్ మూలం ఎంత సరళముగా వున్నదో, మొక్కపాటి వారి అనువాదంకూడ అంత సరళముగా అమరింది.

—బి. ఆర్.



## దూ ర తీ రా లు

(నవల. రచయిత: శ్రీ పల్లంపాటి వెంకట సుబ్బయ్య. వెల: రు. 5.00 'అన్నపూర్ణ పబ్లిషర్సు', విజయవాడ.)

'వివిధ బౌద్ధిక తాత్విక వాదాలకు ఎంతో కొంతగా లోబడిన రచయిత రచన ఈ నవల.' పాత్రల సంభాషణలు తాత్వికంగా ఉన్నాయి చాలా మట్టుకు. ప్రజాసేవకు సత్యమూర్తి, భార్యాస్మృతికి శంకర నారాయణ, లోకం వైపు చూడని ఆదర్శానికి సూర్యం, గుండెలేని స్వార్థానికి జయరాం, పురుషునిలో మంచితనాన్ని ప్రేమించిన స్త్రీకి జానకి, కేవల శరీరఅభిలాషానిశితమైన పరిశీలనానికి లతా, ప్రతీకలు. నవల వీరి వీరి తత్వాల పరిణామము. 'విలువలు' అతి త్వరితంగా మారిపోయే ఈ పరిస్థితుల్లో 'రచనా మార్గము సుగమంగా లేదం'టున్నారు రచయిత. (ఈనాటి పరిస్థితుల్లో ఎవరూ గొప్ప రచన చేయలేదనిపిస్తున్నది అని అనిపించారు శంకర నారాయణచేత.)

నవలలో కథ అంటూ బలంగా ఏదీ లేదు. వివిధ మానసిక తత్వాల సంఘర్షణ కోసమే ఏదో కథలాగు అల్లినారనిపిస్తుంది. స్వగతాల ద్వారానూ తానే చెప్పడం ద్వారానూ కథని చెప్పకుండా, పాత్రలు డైరీలను వ్రాశారనీ పాత వాటిని చదివేరనీ చిత్రించడము ద్వారా సినీమాల 'ఫ్లేబాకు' పద్ధతిని ఉపయోగించారు రచయిత. సత్యమూర్తి మాత్రం ఒకమారు "సుమారు ఎనిమిది సంవత్సరాల వెనక్కు వెళ్లి ఆనాటి జీవితాన్ని సింహావలోకనం" చేశాడు జానకి కథనూ తన వ్యాసంగాన్నీ మనకు పరిచయము చేయడము కోసము. "కమ్యూనిస్టులు శరీరానికిచ్చే ప్రాధాన్యత మనస్సుకు యివ్వటంలేదు. మానవుడంటే ఒక్క శరీరం మాత్రమే కాదు, అతనికి భగవత్స్వరూపమైన మనస్సు కూడా ఉంది. దానిని గుర్తించని ఏ సిద్ధాంతమైనా బౌద్ధమతంలా నశించి

పోతుంది'' అని సత్యమూర్తి చేత ననిపించారు. కేవలం శరీరమే ఉన్నదా అనిపించే లతకు భ్రాతృ ప్రేమ, స్వార్థమే మూర్తీభవించిందాలన్న జయరాంకి పశ్చాత్తాపమూ ఇవ్వడమూ మనస్సుని గుర్తించడమే కావచ్చునుగాని జీవితసమస్యలు కాక రాజకీయపు టసూయా, ప్రజాసేవా, శరీరసుఖాన్వేషణమూ అన్న కేవల మానసిక, యాంత్రిక తత్త్వాల సంఘర్షణ మాన సత్వాన్నేకాక మానవత్వాన్ని రేపగలదా అని సందేహము. హార్దిక ఘట్టాలు లేకపోలేదుగాని నవల అన్నది మానవుల గాథ అనడానికి చాలినంతగా కథలో హార్దికార్ద్రత (Human Interest) పరుచుకుందా అని. ఈ రచన శంకరనారాయణ సత్యమూర్తికి వినిపించాడన్న కథ యంత పొడి పొడిగా లేక పోవచ్చునుగాని, ఇందులోని పాత్రల ''దూర తీరాల''కూ వారికీ మధ్య విధి మాత్రమే కనబడుతోందిగాని మానవత్వపు నదీ ఉన్నదా అని సందేహం కలుగుతుంది.

దీనిలోని ప్రదేశాలు రాయలసీమవే, భాష కాదు. ఆ నడుమ ప్రసిద్ధ పండితు లొకరు లక్ష్య శుద్ధిలేని ఉత్క్రోషమును బయట పెట్టినారు— వ్యావహారిక మనగా సర్కారుల వ్యావహారికమేనని కొందరనుకుంటున్నారని. రామ రామ. బ్రతికిఉన్న భాష ఏది చైతన్య స్రవంతికాదు? ఈ రచనలోని సాంబశివారెడ్డి, నాగన్నవంటి ఒకటి రెండు పాత్రలూ, అక్కడక్కడి పలుకుబళ్లు కొద్దికాక, రచనంతా రాయలసీమ వాతావరణంతో ఆ సీమ జీవద్భాషతో వెలుగంది యుండవలసినదనిపించినది నామట్టుకునాకు.

—శ్రీ గోపాలకృష్ణమూర్తి.

## మూడు వాక్చిత్రాలు

(రచన: సాహిత్య భూషణ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, విజ్ఞాన స్రవంతి, ఖమ్మం. వెల: 1—25.)

'కాటు వేయని పాము' 'నిష్కృతి', 'తెలుసుకొన్న నిజం' మూడు కథల సంపుట మిది.

పేదరాలు శీలాన్ని అపహరించ బూనుకొన్న కామందు శివయ్య దొర జీవితం ఒక పేదవాడి చేతిలోనే అంతమవుతుంది. కష్టాల కౌగిలిలో నిరంతరం నలిగిపోయిన రామి పాత్ర అత్యంత సహజంగా చిత్రించబడినది. కామందుపెట్టే కష్టాలకు అంతే లేకపోతుంది. అమాయకుల్ని బలిగొనడాన్ని చూచి సుబ్బిగాడు సహించలేకపోతాడు. బండికొయ్యతో శివయ్యదొర తలను బ్రద్దలుగా చేసేస్తాడు. కాటు వేయని పాము, సహనం సరిహద్దులను దాటుకొన్నపుడు సంభవించే విషాదానికి ప్రతిబింబం.

నిష్కృతి కథలో చంద్రమౌళి తన చిన్ననాటి అపరాధాన్ని ఎంతో ఆలస్యంగా గుర్తిస్తాడు. గొప్ప యింటివాడనీ, మర్యాదలున్నవాడనీ మహాలక్ష్మి తన ప్రేమానుబంధాన్ని అతి రహస్యంగా ఉంచేస్తుంది. ఏకాంత జీవితంలో ఎన్నో బాధలతో ప్రసవిస్తుంది. బిడ్డ పెద్దవాడవుతున్నాడు. వాడి పేరు రంగడు. కూలీ సహితం సంపాదించుకోలేని దైన్య స్థితిలో చంద్రమౌళి సహాయం లభిస్తుంది. ఆ కుర్రవాని చిత్తశుద్ధికి ఆశ్చర్య చకితుడవుతాడు చంద్రమౌళి. అతని తల్లిని చివరి క్షణంలో చూచినపుడు ఆమెయే మహాలక్ష్మి అని గుర్తిస్తాడు. ఈ కథలో నిజం బయట పడటానికి కొంత కాలం పట్టినా చంద్రమౌళి హృదయం కరుణతో వెల్లివిరిసిపోతుంది. ఇందులో—పోలీసుల ఆగడాలు, కూలీల ఆదాయాలు గమనించదగినవి. చిత్రణ బాగున్నది.

జీవితంలోని సాధక బాధకా లెరుగని యువకుల అంధకారమయమైన భవిష్యత్తును సూచించే కథ 'తెలుసుకొన్న నిజం'. జానకిరామయ్య—తల్లి దండ్రుల కష్టార్జితాన్ని వృధాగా వ్యయం చేస్తుంటాడు. ప్రతి సంవత్సరమూ పరీక్షల్లో తప్పుతుంటాడు. నలుగురు మిత్రులూ నాల్గు రకాలుగా తన్ను గూర్చి హేళనగా మాట్లాడడంతో అతనికి జ్ఞానోదయమవుతుంది కానీ వెంటనే ఆవేశిస్తుంది నిస్పృహ

నిరాశ. ఆ నైరాశ్యంతో నడిచి పోతూ కారుక్రిందపడి మరణిస్తాడు. అత డంత బేలగా మారిపోవడం పాఠకునికి ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. ఈ మూడు కథలూ మూడు దృక్కోణములతో నడిచినవి. సంఘాన్ని పరిశీలనాత్మక దృష్టితో చూచి రచించిన కథ లివి.

## పుల్లాభొట్ల కథలు

(రచన : పుల్లాభొట్ల వెంకటేశ్వర్లు, విజ్ఞాన స్రవంతి, ఖమ్మం. వెల : 1—75.)

సార్థకమైన తీర యాత్ర, పిన్ని చాలా మంచిది, అవరోహణ, పుట్టుమచ్చ, నాలుగు కథలున్న వీ సంపుటంలో. "పిన్ని చాలా మంచిది" కథ మంచి కథ. సుగుణ నిస్సహాయస్థితి ఎంతో జాలిని కలిగిస్తుంది. కృష్ణుడు పరాయివాడనే దృష్టి తన కుటుంబానికి ఉన్నందున వాడు జబ్బు పడ్డప్పుడు, చివరికి అవసాన దశలో వున్నపుడు కూడా తగిన మందిప్పించలేకపోతుంది, పాపం సుగుణ. ఆఖరున కృష్ణునితోపాటు తానూ ఈ లోకాన్ని విడిచి వెళ్లుతుంది. ఈ కథ పాఠకునిలో దయారసాన్ని చిప్పిల చేస్తున్నది.

'పుట్టుమచ్చ' సామాన్య జీవితంలోని ఒక మహాద్భుత సన్నివేశమును చిత్రీకరిస్తున్నది. శేఖర్ రైల్లో వెడుతుండగా తొలినాటి ప్రేయసి దేవప్రియ కన్పిస్తుంది. ఆమెను గుర్తిస్తాడు. ఇద్దరూ మధురానుభూతులతో ప్రణయానందాన్ని పంచుకొంటారు. ఆ మరుక్షణాలలో సంభవించిన రైలు ప్రమాదంలో ఆమె చనిపోతుంది. ఇద్దరూ వివాహితులే. ఆకస్మికంగా కలుసుకోవడం ధర్మ సందేహాన్ని కల్గించినా దేవప్రియ అన్నట్లు "భగవంతుడు దయామయుడు" కనుక మన్నిస్తాడేమో అని అన్పిస్తుంది.

'అవరోహణ' కథలో సంఘం బహిష్కరించిన పడుచును పెళ్లి చేసుకొంటా డొక యువకుడు. ఈ కథ ఆచరణలోని సార్థకతను గోచరింపచేస్తున్నది.

సార్థకమైన 'తీర్థయాత్ర'లో సహజత్వం ఉందికానీ తీర్థయాత్రలో వ్యభిచరించడంచేత సంతాన ప్రాప్తి కల్గినట్లు చిత్రించడం అంత సమంజసంగా కన్పించదు. నైతికంగా సవ్యమనిపించుకోదు. కథ నడిచిన ధోరణి మాత్రం గొప్పగా ఉన్నది.

—కె. సభా.]

## గిరీశం ది గ్రేట్ సినీప్రవేశం

(రచన : శ్రీ వడ్లమన్నాటి కుటుంబరావు, వెల. సాదా ప్రతి రు. 2.00, మేలు ప్రతి రు. 3.00. ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో, మద్రాసు. ప్రాప్తిస్థానం : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాదు.)

శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు 'కన్యాశుల్కం'లో కొన్ని అద్వితీయమైన పాత్రలను సృష్టించారు. వాటిలో చిరస్మరణీయమైనది 'గిరీశం' పాత్ర. అప్పారావుగారి అమరసృష్టి గిరీశం సినీ ప్రవేశం కావించటం ఈ రచనలోని ఇతి వృత్తం.

నిజానికి ఇందులో కథావస్తువేమీ లేదు. సినిమారంగానికి సంబంధించిన వివిధ ఘట్టాలను సంభాషణల రూపంలో ఒకదానితో మరొక దానిని అతికించటం జరిగింది. ఈ రచన నాటక రూపంలో సాగినా ప్రదర్శన యోగ్యమైనదిగా లేదు. ఇద్దరు, ముగ్గురు వ్యక్తులు కలుసుకుని పిచ్చాపాటీ చెప్పుకుంటున్న ధోరణిలో ఈ రచన సాగింది. ఈ కబుర్ల ద్వారా రచయిత సినిమా పరిశ్రమలోని బ్రతుకు బండారాలను బైటపెట్టారు. సంభాషణలలో అక్కడక్కడ మోరటు హాస్యం దొర్లకుండా జాగ్రత్త పడితే బాగుండేది. ఏది ఏమైనప్పటికీ రచయిత సినిమారంగంయొక్క యథార్థ స్వరూపాన్ని కళ్లకు కట్టేటట్లు చిత్రీకరించ గల్గారు.

—ఎం. ఎల్.]

## లేఖలు:

# మన రచయితలలో స్తబ్ధత

అయ్యా!

గతమాసం 'భారతి' లేఖలలో హా. శి. గారి ఉత్తరం ప్రబోధాత్మకంగాను, ఆవేదనతోను నిండి వుంది. దానిని చూచి రచయితలకు మీరు మనవి చేయడమున్నూ ప్రశంసనీయం.

లోగడ జాన్‌స్ట్రాచీ, సార్త్రేల రచనలు, తర్జుమాలు ధారావాహికంగా 'భారతి'లో ప్రచురించడం ముదావహం. కాని ఆ అనువాదాలు కొన్నిచోట్ల మూలాన్ని క్లిష్టతరంగాకూడ మార్చాయి. అలాంటి రచనలు మూలం చదువుతున్నంత సాఫీగా ఉండేలా అనువదించడమూ కష్టంగావచ్చును. కాని చాలా గందరగోళపరిచింది సార్త్రే అనువాదం మరీను.

హా. శి. గారన్నంతగా రచయితలలో స్తబ్దత లేదేమో. మొదటినుండి 'భారతి' కావ్య గుణ విమర్శ, పరిశోధన మున్నగువిషయాలకు ప్రాధాన్యత యిస్తూండబట్టి అదేమాదిరి రచనలు 'భారతి' కి వస్తూండవచ్చు. కాని యితర పత్రికలలో కొడవటిగంటి, మామిపూడిలాంటి స్వయంప్రతిభగల రచయితలు విజ్ఞానపరంగా, రాజకీయసంబంధంగా చక్కని వ్యాసాలు వ్రాస్తూనే ఉన్నారు. మార్మికత్వపు మధురిమలతోటి 'తేజోరేఖలు' లాంటి రచనలు సంజీవదేవ్‌లాంటివారూ, టి. ఎస్. ఇలియట్ లాంటివారిని గురించి బుచ్చిబాబుగారిలాంటివారు చక్కని వ్యాసాలూ యిటీవల భారతిలో వ్రాస్తూనే ఉన్నారు. అదేవిధంగా హా. శి. గారు కోరినట్లు మన రచయితలు కదిలి చక్కని విజ్ఞానప్రేరితమైన వ్యాసాలు వ్రాయగలరని ఆశిద్దాం. హా. శి. గారి హృదయపూర్వకమైన వేడికోలును పాఠకులందరి తరఫున సవాల్‌గా రచయితలు స్వీకరించి కలంకదిపితే మరింత సంతోషం.

'భారతి' తన స్థాయిని యిదేరకంగా పెంపొందించుకొంటూ ముందుకుసాగాలని కోరుతూ,

—కృష్ణాబాయి (విశాఖపట్నం)

# వరుణఏన్ది తామ్రశాసనంలో 'ఓలివాయి' ఏది?

అయ్యా !

గడచిన ఏప్రిల్ నెల "భారతి"లో "వరుణఏన్ది తామ్రశాసనం" అను పేర శ్రీ మునునూరి సాంబశివరామమూర్తిగారు రచించినవ్యాసము ప్రకటితమైనది. 'వరుణఏన్ది'లో వారు పేర్కొనిన "ఓలివాయి" తుల్యభాగానది కాదేమోయని సంశయముగల్గినది.

చాళుక్య వంశోద్భవుడయిన తృతీయ భీమరాజు తన పట్టాభిషేకమహోత్సవసమయమున "వరుణ ఏన్ది తామ్రశాసనము" (10 వ శతాబ్దిన) వ్రాయించెను. దీనికి ఎల్లలు పశ్చిమమున "ఓలివాయి". ఈ ఓలివాయినే వారు దోలివాయి (తుల్యభాగ) గా పేర్కొనిరి. ఈ శాసనముదొరికిన మురముండ గ్రామమునకు దగ్గరగా చరిత్రప్రసిద్ధిగన్న తుల్యభాగముండుటయే కారణమేమో. ఈ శాసన నిర్మాణమునకు పూర్వము ఈ నదికి "ఓలివాయి" అనే శబ్దముండినట్లు కానరాదు. ఈ ప్రాంత భూభాగ చరిత్రకు మూలాధారమైనస్కాందములో 'తుల్యభాగ'గనే పేర్కొనబడినట్లు తెలిసినది. క్రీ. శ. 1390 లో అనపోతారెడ్డిచే ప్రకటింపబడిన శాసనములో తుల్యభాగయని స్పష్టముగా పేర్కొనబడినది.

తుల్యభాగా నదీతీరే గ్రామ ముద్దామవైభవం
సోయం కాటయవేమాంకః...............

కుమారగిరిభూపాలుని కుమారుడగు అనపోతారెడ్డిచే తుల్యభాగానదీతీరమందున్న మహా వైభవము

గల గ్రామము నుదారబుద్ధిచే కాటయవేము దర్పింపజేసెనని భావము. ఈ అనుపలతిశాసనం శ్రీ రాళ్లభండి సుబ్బారావుగారిచే రెడ్డిసంచికలో ఆంధ్రాక్షరములతో ప్రకటితమై యున్నది.

ఇక అల్లయవేముడు కీ. శ. 1434 లో తుల్యభాగానదీతీరమందున్న మహేంద్రవాడ, వెదురుపాక యను గ్రామముల నేకముచేసి తనపేర "అల్లాడ రెడ్డి వేమవరము" అని నామకరణముచేసి (అల్లయ వేమారెడ్డి) వేమవరముశాసనము ప్రకటించెను. ఈ భూమి పరమ పవిత్రమనియూ, కలకాల ముండునట్లుగ, వేదాంగవేత్తలైన విప్రులకు వేమభూపాలుడు ధర్మముచేసిరని అర్థము.

శ్రీ సప్తగోదావరతుల్యభాగ మధ్యేఽగ్రహారో
మహనీయ సస్యైః
ఆచంద్రమాతారకమాదినేంద్రముజ్జృంభ తాం
వేమనృపాల ధర్మః—

పదియవశతాబ్దవాసులైన చాళుక్యులు—తుల్యభాగను—"తోలివాయి" అని వాడినచో, ఆ వ్యావహారిక సాంప్రదాయమును వీరుగ్రహింపకయుందురా? ఆ కాలమున తుల్యభాగను "తోలివాయి" అని జనులు వ్యవహరించినట్లు మనమూహింపవలెనా?

శ్రీనాధుడు భీమఖండములోని సప్తగోదావరి క్షేత్రములందలి తీర్థముల నభివర్ణించుచూ, తుల్యభాగనుకూడ ప్రశంసించెను.

తే. గీ. గౌతమీ సింధు కౌంతేయు కన్యనదులు
దుల్యభాగయు నేలేరు దుమ్మికొనలు
భువన సంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ ! సంసారతాపశాంత్యౌషదంబు.
(భీమేశ్వర పురాణం—తృతీయాశ్వాసము)

14 వ శతాబ్దమునకు ఈ నదిని తుల్యభాగ అని అందరూ వ్యవహరించుచున్నట్లు మనము గ్రహింపవచ్చును.

ఈ ప్రాంతమున దీనిని జనులు "తొలేభాయి" అని కూడ వ్యవహరించుట కలదు. తుల్యభాగ ఎక్కడున్న దనిన చాలమంది నిరక్షరాస్యులకు తెలియదు. దీనికి కారణమేమన వారు ఈ శబ్దము నుచ్చారణ చేయలేకపోవుటయే. తొలేభాయి అని ఎందుకు పిల్చుచున్నారో పరిశీలింతము.

గౌతమముని యనుమతిలేకుండ తుల్యుడను మహర్షి ఈ నదిని తొలుత తీసుకవచ్చినట్లును, యిది అంతర్వాహిని (సరస్వతీనదివలె) అయిపోవునట్లుగా శపింపబడినట్లు ఒకగాథ కలదు. సముద్రమువలె పుణ్యదినములు, ఆదివారములుతప్ప యితర దినములంత ప్రాముఖ్యము లేకపోవుటకిదియే కారణమయి యుండును. ఈ నదికి రెండు మూడు ఫర్లాంగుల దూరములో బావులు తీయవలెనన్న ఎంతో లోతు తీయవలెను. ముఖ్యముగా అర్తమూరు ప్రాంతములో జలపడుటకూడ కష్టమే. నది సమీపములో భూమిపై భాగమున ఎక్కడకక్కడ జలలు కలవు. ఇది అంతర్వాహిణి కనుకనే రోహిణికార్తిలో రోళ్లు బద్దలగుచున్ననుగాని, జీవనదిగ ప్రవహించుచున్నది. తుల్యునిచే కొనిరాబడుటచే తుల్యభాగ యని పేరు వచ్చినట్లు చెప్పుదురు.

ధవళేశ్వరంసమీపంలో వృద్ధగౌతమినుండి విడివడి కడియము, జేగురుపాడు, అర్తమూరు, పొలమూరు, మహేంద్రవాడ, ముక్తేశ్వరము మీదుగ చొల్లంగి దగ్గర సముద్రగామి యగుచున్నది. సప్త "పాయలలో" దీనిని తొలిపాయగ పేర్కొనవచ్చును. అందుచే జనులు దీనిని "తుల్యభాగ" అని పలుకలేక తొలిపాయయనియుండవచ్చును. కాలాంతరమున ప్రజలుచ్చారణముచే "తోలిపాయి"—"తొలిభాయి"—"తొలేభాయి" గా మారినది—నేడు గోదావరిని "గోదారి" యన్నట్లుగ. భవిష్యత్తులో యింకే రూపమువహించునో ఎవరికెరుక ? అందుచే "తొలిపాయే" "తొలేభాయి" గ పిలువబడుచున్నది.

తూర్పు చాళుక్య ప్రభువుల క్రొత్తశాసన మీ ప్రాంతములో దొరుకుట, శ్రమపడి ఆ శాసన విశేషములు తెలిపినందుకు వారికి నాకృతజ్ఞత తెలుపుచున్నాను. వారి "తోలివాయి" తుల్యభాగసంబంధము ఒక కట్టుకథగా తోచుచున్నది. తోలివాయియే తుల్యభాగఅయినచో ఈ ప్రాంతవాసుల కెక్కువ యానందదాయకముగ నుండును.

**రాజమహేంద్రవరము. వి. ఆర్. మేడపాటి.**

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1
Editor : S. Sambhu Prasad.